# జేబుదొంగలు

విశ్వనాథ సత్యనారాయణ






రు. 2-8-0.

# జేబుదొంగలు

విశ్వనాథ సత్యనారాయణ

రసతరంగిణి: బెజవాడ.

# పీఠిక

## ౧

ఇంకను రైలు రాలేదు. ప్రయాణీకులను బయటకు రెండుమార్గములుగా వదలిపెట్టుదురు. ఏమార్గమువద్ద వేచియుండవలెనో అవధానికి తెలియలేదు. తండ్రి ప్లాట్‌ఫారము టికెట్టు కొనుమని యిచ్చిన యణా అవధాని సొంతడబ్బుకింద దఖలు చేసినాడు. తమ యింటికి నతిథిగావచ్చు పెద్దమనిషిని గుర్తుపట్టుటకు తండ్రి యానవాళ్లు చెప్పెను. ప్లాటుఫారము మీాదికి పోయినచో డేలికగా గుర్తుపట్టవచ్చును. అందుచేత నతడు బండ్లు నిలచియుండు స్థలముననే తటపటాయించుచు నిలుచుండెను.

అంతలో రైలు వచ్చెను. ఒక్కసారిగా రైలు నిలుచు స్థానము జనముతో కిటకిట లాడిపోయెను. రైలు దిగినవారు ఒకరికన్న నొకరు ముందుగా వచ్చుచుండిరి. అవధాని ప్రతి మనుష్యునివంకను తేరి పారచూచి వారుకాదని మరియొక్కరివద్దకు పోవుచుండెను. చివరకు తమ యింటికి వచ్చు నతిథి రాలేదని నిర్ణయము చేసికొని తిరిగి పోవుచుండగా నొక పెద్దమనుష్యుడు ఒక బండిలో నెక్కబోవు

చుండెను. తండ్రి చెప్పిన గురుతులన్నియు నాయ నకు సరిపోవుట చూచి, తొందరగా నచ్చటకు పోయి 'అయ్యా మీరేనా గురుమూర్తిగారు?' అనెను. ఆయన ఔననగా 'నేను సోమశంకరంగారి కొడుకునండీ, మిమ్ము తీసికొనిరమ్మని మానాయన గారు నన్ను రైలునకు పంపించిరి. నేను ప్లాటు ఫారమంతయు మీ కోసము వెదకినాను. మీరు రాలేదేమో యనుకొని తిరిగి పోవుచుండగా మీరు కనుపించినారు' అనెను. గురుమూర్తిగారు 'అయ్యో నాయనా, పసివాడవు. మీ నాన్నగారు నిన్నెం దుకు పంపించిరి. నేను రాలేనా, సరేలే, బండి యెక్కుము' అని యిద్దరును బండిమీద పోయిరి. బండి యింటికి చేరినంతనే సోమశంకరముగారు ఎదురుగా వచ్చి 'ఏమండీ, స్నానము చేయుదురా?' అనెను.

అప్పటికి సాయంకాల మేడుగంట లయ్యెను. సోమశంకరంగారి యింటిలో ప్రతిదినము సాయం కాలపు భోజనము ఆరుగంటలకే చేయుదురు. ఈనాడు అతిథి వచ్చుచున్నాడు కదా యని ఆయన యాగెను.

గురుమూర్తిగారు 'ఇప్పుడే కదా వచ్చితిని, కొంచెమాగి స్నానము చేయుదును, భోజనమున కిప్పుడే తొందర లేదుకదా' యనెను—

సోమ:- మా యింటిలో నెప్పుడునూ ప్రొద్దు క్రుంకకముందే చేయుదుము.

గురు:- (నవ్వి) అసలు సంధ్యవేళ భోజనము చేయరాదు. భోజనము, రతియు సంధ్యాకాల మందు సలుపరాదు. దితి పూర్వము సంధ్యాసమయమున కశ్యప ప్రజాపతితో తన కామమును తెలియచేసినదట. ఆయన కాదు కూడదనినను ఒప్పుకొనలేదు. ఆ సమయము నందలి దుష్టత్వముచే హిరణ్యాక్ష హిరణ్యకశిపులు పుట్టినారట.

గురుమూర్తిగారికి సోమశంకరము గారికి చన్న నగరములో పరిచయము జరిగినది. సోమశంకరము గారిది కాకినాడ. గురుమూర్తిగారిది బరంపురము. గురుమూర్తిగారు కొంచెము కవి, వాక్చాతుర్యము కలవాడు. నిర్భయస్తుడు. మొగమోటమి కలవాడు. సోమశంకరముగారు పూర్వము డిప్యూటీకలక్టరు చేసి పింఛను పుచ్చుకొనుచున్నాడు. ఆయన పూర్వోద్యోగమునందలి గౌరవముచేతను ఎవ్వరికిని

నెక్కువ పరిచయమీయని రాజోద్యోగుల తరహా చేతను, ఆయనతో నెవ్వరును నంత చనవుగా మాటాడరు. గురుమూర్తిగా రిట్లనినంతనే సోమ శంకరముగారిలో నొక చిన్న కలకగలిగి తొలినాటి చన్ననగరములోని గురుమూర్తిగారితోడి పరిచయ సందర్భములు జ్ఞప్తికి వచ్చి, సర్దుకొని, సోమశంక రముగారు నవ్వి 'పరవాలేదు. వెంటనే భోజనము చేయుటకు మీ కభ్యంతరము లేదుకదా' యనెను. గురుమూర్తిగారు మాటాడక తన దుస్తులు తీసి స్నానమునకు సిద్ధపడెను.

గృహపతి తన యింటిలో సేవకుడైన, అవధాని యీడువాడైన అప్పడిని పిలచి 'ఓరీ, అయ్యగారికి నీరు తోడినావా?' యనెను. అప్పడు 'వారు రాక ముందే అన్నియు సిద్ధము చేసితినండీ' అని చెప్పగా 'అయ్యగారికి స్నానాలగది చూపింపు' మనెను. అప్పుడు గురుమూర్తిగారిని స్నానాలగదికి తీసికొని పోయి తానువెంటనే తిరిగివచ్చెను. సోమశంకరము గారు అప్పుడే పడమటింటిలోనికి పోయి వెండి పళ్లెము ముందు కూర్చుండెను.

గురుమూర్తిగారు స్నానముచేసి తన పెట్టెలో పట్టుబట్టతీసి కట్టుకొనుచుండెను. అవధాని యొక

కుర్చీలో కూర్చుండి ఏదో పుస్తకము చదువు చున్నట్లు నటించుచుండెను. అప్పుడు దూరముగా నిలచుండి మందముగా నవ్వుచుండెను. గురుమూర్తి గారు పిల్లవానిని తండ్రి కోపపడె ననుకొనెను. గురుమూర్తి మంచి జాగ్రత్తయినవాడు. "తన జేబు లోపలి డబ్బుసంచి వెంటతీసికొని భోజనము నకు వెళ్లుదమా యని యాలోచించెను. తన దగ్గర డబ్బు సంచిని చూచి సోమశేంకరముగా రేమైన యనుకొందురేమో. అయినను గౌరవముగల యిం టిలో డబ్బెవరునూ తీయరు. ఒకవేళ నప్పుడు బోయినను అవధాని యచ్చటనే యున్నాడు" అని యాలోచించి డబ్బుకోటు జేబులోననే వదలి లోనికి పోయెను.

అవధాని కొంచెము సేపుండి లేచి పడమటిం టిలో తొంగిచూచెను. భోజనము చేయుచుండిరి. తిరిగి వచ్చి అప్పుడితో కనుసైగ చేసెను. అప్పుడు గురుమూర్తిగారి కోటు జేబులో నుండి డబ్బుసం చిని తీసెను. అందులో రెండు పది రూపాయిల నోట్లు, మూడైదురూపాయిల నోట్లు, ఏడు రూపా యీలు, పదమూడణాల చిల్లరయు నుండెను.

అవధాని:—ఒక అయిదు రూపాయీల నోటు తియ్యరా.

అప్పడు:—అయ్యో బాబో, పీక నులిమేస్తాడు బాబో, తీస్తే తీసినట్లు తెలియకుండా తీయాలి.

అని ఒక రూపాయియు ఏడణాల స్నరచిల్లరయు తీసి దాచివేసెను. అవధాని "నీ వింకపో, నాన్నగారడిగితే నీవు నాతో చెప్పి వెళ్ళావని చెపుతాను." అని అనగా అప్పడు, రూపాయి అవధాని భాగమిచ్చి తాను వెడలిపోయెను. అవధాని కోటు గురుమూర్తిగారెల్లు వేసిరో అట్లు మడతలన్నియు సర్ది చదువుకొనుచు కొనుచు నిద్రపోయినట్లభినయించుచుండెను. గురుమూర్తి సోమశంకరములు భోజనము చేసి బయటకు వచ్చిరి. తాంబూలము సేవించిరి.

సోమశంకరము నిద్రపోవుచున్నట్లున్న కొడుకును చూచి యింటిలో వంటమనిషిని పిలచి పిల్లవానిని తీసికొనిపొమ్మనెను. అవధానికి పదియేండ్లు. తండ్రి కత న్నొకడే కొడుకు. ఆయనకు సంతానము చాల యాలస్యముగా కలిగెను. అతడు పుట్టిన మరు సంవత్సరమే సోమశంకరముగా రుద్యోగము నుండి విరతిపొందెను. అతని తరువాత మూడేం

డ్లకు నొక కూతుపను కలిగెను. కూతురు పేరు విమల. తరువాత సంతానలేదు. ఈపిల్లల నిద్దరను సోమశంకరముగారు అల్లారుముద్దుగా పెంచుకొను చుండెను. కాని, ఆయన యొకరకమైన లోభి. భార్యకుగాని, పిల్లలకుగాని, ఏదికావలసినను, కొనియియ్యడు. తక్కిన విషయములలో ప్రేమకు చెప్పుటకు వీలులేదు. కొడుకు తన్నదిరించినను యూరకుండును. అవధానికి సమృద్ధిగా నసభ్యపు కూతలు వచ్చును. వాని నతడు తండ్రిమీదనే ప్రయోగించును. ఒక సినిమాకో, నాటకమునకో పోవలెనన్నచో, గాడిద గీపెట్టినను తండ్రి రెండ ణాలు చేపడు.

ప్రస్తుతము సోమశంకరముగారిభార్య కూతు రితో పుట్టినింటికి పోయెను. భార్యపేరు భవాని.

సోమశంకరముగారు తానింక పోయి నిద్రింతు నని లేచెను.

గురు:—నాకోసము వృధాగా పిల్లవానిని పంపించి నారు. పసివాడు తోటకూర కాడవలె వ్రేలాడి పోయినాడు.

సోమ:—మీ యుత్తరము ఈవేళ ప్రొద్దుననే వచ్చెను. నాకు భోజనమునకు వేళ దాటిపో

మెను. నల్లమందు పడి నాల్గు మెతుకులు పోయినగాని నా కోపిక యుండదు. మాయిల్లు మీ రెరుగ రాయెను. అదిగో మీకు ప్రక్క. కటకటాలలో నుండి చల్లని గాలి వచ్చును. ఆ లాంత రిచ్చటనే యుండు. కావలసినచో పెద్దదిచేసి చదువుకొనుడు-అని వెడలిపోయెను.

గురుమూర్తిగారు నెమ్మదిగా లేచి తన కోటు దగ్గరకు పోయి, వంకెను తగిలించి; ఎందుకైనను మంచిదని డబ్బుసంచి దగ్గరనే యుంచుకొందమని తీసెను. ఊరకే మరల డబ్బు లెక్కపెట్టెను. నోట్లు సరిగానే యున్నవి. ఒక రూపాయియు కొంత చిల్లరయు తగ్గినట్లు తోచెను. అయినను 'తాను ఖర్చుపెట్టుకొన్నాడేమో? ఏమియు ఖర్చు పెట్టలేదే? ప్రతి పైసాయును ఆకళింపులో నున్న మనిసే! ఏమై యుండును? సరిగా టిక్కెట్టు కింత, దారిలో కూలి కింత; పండ్లు కొన్నదింత, బండికింత. ఇంక యే ఖర్చును లేదు. ఏమైనది. వీళ్ళ పనిచేసెడు వాడు-,వాని మొగము చూచిననే తన కేదో యను మానము తగిలినది. వాడు తీసియుండునా? అవ ధాని నిద్రపోయినాడు. ఆసమయములో వాడు కొట్టి వేసి యుండును. రేపు ప్రొద్దుననే వచ్చును కదా.

అప్పుడు వాని సంగతి కనుగొందము. వెధవకు ఈ నౌకరీ తీసివేయింతును.

గురుమూర్తి చాలసేపు నిద్రపట్టక మేల్కనియే యుండెను. ఏదైన చదువుద మనగా పుస్తక మేదియు లేదు. గురుమూర్తికి సారస్వత గ్రంథ మేదైన చదువవలె ననగా పింఛను పుచ్చుకొను చున్న డిప్యూటీ కలెక్టరు నింట్లో అట్టి గ్రంథ మెచ్చట దొరుకును?

వెధవ రూపాయి న్నరో, రూపాయి ఏడ ణాలో పోయినంతమాత్రాన సోమశంకరముగారితో చెప్పుట యెందుకు? చెప్పినచో బాగుగా నుండ దేమో. కాని నోటిముందరి కూడు తీసివేయుట యెందుకు?

గాలి లేదు. సోమశంకరముగారు మేడమీద పోయి పండుకొన్నాడు కాబోలు. నిరాబా స్థల ములో పండుకొనినచో చల్లగానైన యుండును. తాను పడుకొన్నచోట ముందినుప చువ్వలు. ఆ ముందు పందిరిమీద బ్రబ్బలి తీగ బ్రాకి యల్లు కొన్నది. ఆయనకు పట్టక పట్టక రాత్రి రెండు గంటలకు నిద్రపట్టెను. మరునాడు నిద్రలేచునప్ప టికి నేడు గంట లయ్యెను. అప్పటికి సోమశంకరము

గారు నిద్ర లేవనే లేదు. గురుమూర్తి గారికి అప్పుడు కనిపింపగా 'ఒరేయి మొగము కడుగుకొనుటకు నీళ్ళు తెచ్చిపెట్టు' మనెను. ఆ మాటలో గురుమూర్తి గారి కన్నులు అప్పడి కన్నులు కలిసెను. గురుమూర్తి కన్నులు సూదులవలె అప్పని గుండె లోనికి చొచ్చుకొనిపోయెను. అప్పడి కన్నులలో నొకభయము; నొకధైర్యము, నొకతొలగిపోయెడు తనము, గోచరించెను. వాడు వెంటనే మొగము త్రిప్పుకొనిపోయి నీళ్లు తెచ్చి యచ్చట నుంచెను.

గురుమూర్తి గారికి తెలిసెనా? ఊరకే చూచెనా? మరల నాయనవంక చూచినచో నీ సారి గట్టిగా తెలియును. ఎబ్బే, ఆయన కిదివరకే తెలియును. మరల చూచినచో తానుదొంగనని చెప్పినట్లగును. ఎరుగనట్లు తన పనిమీద తా నుండినచో దాని యంతట నదియే పరిసిపోవును.

అయినను వాని చూపు గురుమూర్తిగారి మీదికే పోయెను. గురుమూర్తి కన్నులు నవ్వు చుండెను. అప్పడికి కొంచెము భయము తగ్గెను. కాని యీయన గ్రహించినా డన్న మాట విస్పష్ట మయ్యెను.

గురుమూర్తి తన పనిమీద యూరిలోనికిపోయి

తిరిగి పదకొండు గంటలు దాటివచ్చెను. గృహపతి తొమ్మిదింటికే భోజనము చేసెను. "నే నుండలేక భోజనము చేసితిని. మీరు స్నానముచేసి భోజనము చేయుడు."

స్నానాల గదిలో నప్పుడు నీరు తోడి పోబోవుచుండెను. గురుమూర్తి "ఒరేయి! చెంబుతో నీళ్లు ముంచి ఇచ్చుచుండుము, వెళ్లకు"మనెను. వాడిచ్చుచుండగా నీయన స్నానము చేయుచుండెను.

గురు:—జేబులో నెంత కాజేసినావురా?

అప్పు:—అదేటి బాబూ. నే నట్లాంటివాణ్ణి కాదు. బాబయ్యగారిని కనుక్కోండి

గురు:—ఓరి వెధవా. అబద్ధాలు చెప్పకు. నా జేబులో ఎంత డబ్బున్నదో నాకు తెలియదంటావా? గాడిదా. పైగా బుకాయిస్తా వేమిటి? నీ అయ్యగారితో చెప్పానా, నాఖరికి నీళ్లు వొదులుకోవలసి వస్తుంది. ఆ దొంగతనంలో కూడా మంచి వొడుపు నేర్చావు. చెడిపోతావు. రూపాయి ఏడణాలేకదా అని ఊరుకుంటున్నాను. అయ్యగారితో చెప్పను. ఎందుకు చెప్పనో తెలుసా? నీవు దీనివల్ల బాగుపడతావేమోనని ఆశపడుతున్నాను. శిక్షించటంకన్న

ఒకటి రెండుసార్లు వదలిపెడితేనే దొంగలను మంచి మార్గానికి తీసుకోరావటం అని నా ఉద్దేశం. పసివెధవవు, యిప్పటినుంచి యిలాంటి గుణాలు నేర్చుకో. నీవంటివాడే రెండు నెలలు యింట్లోనూ పదినెలలు జైలులోనూ ఉంటారు పెద్దయితే. విని బాగుపడు వెధవా. ఈకాస్తలో నాకు వచ్చిన నష్టంలేదని ఊరుకున్నాను.

అప్పడు:—నే నెరగనండి.

గురు:—వాగేవా నోటిమీద కొడతా.

గురుమూర్తి లోపల భోజనము చేయుచుండెను. అప్పడు నవధానియు సావడిలో నుండిరి.

అప్పడు:—కనుక్కున్నాడు.

అవధాని:—నాన్నతో చెపుతాడా?

అప్పడు:—చెప్పనన్నాడు. ఇహ యిట్లాంటి పనులు చెయ్యకురా అని తిట్టాడు.

అవధాని:—పిచ్చిముండా కొడుకు.

అప్పడు:—అయ్యగారితో చెపితే? అయినా మీరు రూపాయి తీసికొన్నారు నేను చిల్లరే తీసికొన్నాను.

అవధాని:—గాడిదకొడకా. నామీదకూడా చెపుతావా? నామీద చెపితే ఎవరునమ్ముతారురా?

అప్పడు:—ఎందుకు నమ్మరు? నేను తీశానంటే నమ్మటంలేదా !

అవధాని:—పిచ్చివెధవా, నీవు తీశావనుకున్నారు కాని నేను తీశాననుకున్నారా? అదీ భేదం. అని అవధాని చిటికవేసెను.

అప్పని మొగములో కోపము కనిపించెను. అవధానికి భయమువేసెను. ఇంతలో భోజనముచేసి గురుమూర్తి వచ్చెను. వచ్చునప్పటికి వారిద్దరు నా స్థితిలో నుండిరి.

గురుమూర్తి వెంటనే యంతయు కనిపెట్టెను. అవధాని యేమియు నంగనాచి కాడు. ఇది యిద్దరును కలసి చేసినపనియే అని వెంటనే తెలిసెను. గురుమూర్తినిచూచి యిద్దరునూ వెలవెల పోయిరి. గురుమూర్తి ఏమియు తెలియని వానివలె తన దుస్తులు తాను వేసికొని ఏదోపనిమీద పోయెను. ఆయన మరల నా సాయంకాలమే ప్రయాణమై పోయెను.

పోకముందు సోమశంకరముగారితో చెప్పి పిల్లవానిని కూకలువేయింతమా యనుకొనెను. ఏమో తానువారింటిలో రెండుపూటలు భోజనముచేసెను. వంటమనిసి తనకు వడ్డించుచు నశ్రద్ధగా వడ్డించెను.

జౌననుటకు కాదనుటకు కాని యొక అగౌరవము కనిపించునట్లు ప్రవర్తించెను. శతవిధాల తన పరోక్షమందు సోమశంకరము తన్నుగూర్చి యుదాత్తముగా మాటాడలేదేమో. గురుమూర్తి నిరుద్యోగి. ఏదో అన్నోదకములకు మాత్ర మున్నవాడు, అంతే. సారస్వత విమర్శకుడుగా దేశములో నాయనకు కొంత పేరున్నది. సారస్వతముతో తనకు పరిచయము కలిపి తనకు చక్కని మేధా సంపత్తి కలిమి విమర్శనాజ్ఞానముకలిమి మనుష్య స్వభావము యొక్క లోతుపాతు లతనికి దెలి యును. తనగౌరవము పట్టి యుద్యోగ గర్వితులకు, తదితర దృష్టి లేనివారికి నేమి తెలియును? ఈ పిల్ల వాడు చెడిపోవును. తండ్రితో చెప్పనిచో నతని చెడిపోకకు తాను కొంత సాహాయ్యము చేసినవా డగును. చెప్పినచో సోమశంకరముగారు సరిగా తన్నర్థము చేసికొనునని నమ్మకములేదు. తానొక రాత్రియు నొక పగలును వారి యింటిలో నుండగా ఆయన తనతో మాటాడిన మాటలు పది చూచి నచో పిల్లవానిని మిక్కిలి గారాబముగా పెంచు చున్నట్లుండెను. అవును నిజమే. ఒక్క కొడుకు. వయసు చెల్లినతరువాత బుట్టినవాడు. వారి వారి

నోళ్లుకొట్టి సంపాదించిన దొక లక్ష యాస్తి యున్నది. ఒకవేళ కుఱ్ఱవాడు చెడిపోయినను వాని కేమి మహారాజు, కాలిమీద కాలు వేసికొని కూర్చుండవచ్చును. దారి పోవు తద్దినమా మా ఇంటికి రమ్మన్నట్లు తన కెందుకీ లేనిపోని వ్యవహారము. అయినను పసితనము. ఇంక నాలుగైదేండ్లు పోయిన తర్వాత నా కుఱ్ఱవానికే తెలిసి వచ్చును. తండ్రి పిసినిగొట్టు. అందుచేత పిల్లవానికి చేయి కాలాడుటలేదు. ఏదో కొంచెము చేవాటునకు నలవాటు పడినాడే కాని యీ గుణమే పాతుకొని కూర్చుండునా?

ధూమ శకటము పోయినంతమేర నల్లని కాఱు రాక్షసి బొగ్గు స్వరూపమంతయు నంది యిచ్చినట్లు, ఒక రకపు పొగ వెడలగ్రక్కినది కదా! చల్లగాలికి గవాక్షముల కడ కూర్చున్న బాటసారుల చొక్కాలకు మొగములకు సిరా పూసెను. నిముసములో ప్రక్కలు పరచి యితరులను కూర్చుండనీని గడుసరుల తెల్ల దుప్పటు లన్నియు బొగ్గు నలుసులతో వికారపు ముగ్గులు పెట్టెను.

మఱునాడు సోమశంకరముగారి భార్యయు కూతురును వచ్చిరి. విమల జ్వరముతో వచ్చెను.

వైద్యుని తీసికొనివచ్చి చూపించిరి. వైద్యులందరకు సోమశంకరముగారి వ్యవహారము తెలియును. అచ్చట సరిగా గిట్టుబడి కాదని ఏదో యాషామాషీ వైద్యము చేయుదురు. అవధాని పోయి మందు తెచ్చెను. విమలకు నాల్గు రోజులవరకూ వచ్చిన జ్వరము వచ్చినట్లే యుండెను. సోమశంకరముగారు ప్రొద్దుటిపూట నెనిమిది గంటలకు మేడపైనుండి దిగును. 'మందు తెచ్చావురా?' అని యవధాని నడుగును. పోయి యటు నిటు తిరిగి స్నానముచేసి భోజనముచేసి మేడపైకి పోయి పండుకొనును. సాయంకాలము నాలుగు గంటలకు దిగును. మరల పిల్లవంక చూచినట్లు నటించును. కాఫీ త్రాగి షికారుపోయి, యారు గంటలకు భోజనముచేసి యేడింటికి మేడనెక్కును. విమలకు జ్వరము తగ్గలేదు.

సోమశంకరముగారికి భవాని ద్వితీయము. భవాని అధునాతన నాగరకుల యింటిబిడ్డ. ఆమె పెండ్లినాటికి పుట్టింటిలోని సంస్కారము బలియక పోయినను తరువాత తరువాత నెక్కువ బలిసెను. ఆమె చెల్లెండ్రు, మేనకోడండ్రు నైనంత విష్పు భవానికడ లేదు. అయినను పుట్టింటికి రాకపోకల

వలన గాలి పారెను. ఆమె యూరిలో స్త్రీ సమా జమునకు రాకపోకలు, నడప దడప బ్రహ్మమందిర ప్రార్థన సమయముల తదితర సంస్కారవతులగు స్త్రీలతో కలియుటయు కలదు. అందుచే నామె వేషభాషలు కొంత సుంకు తేలినవి. కాని ఏ యా టలు సాగుటకును చేతిలో భర్త చిల్లిగవ్వ యాడ నీయడు. చొళ్లెము చుట్టి గ్రుచ్చుకొనుటకు పిన్ను లకు గతి లేదు. జపాను సిల్కు-చీరె లెచ్చటినుండి వచ్చును ? పుట్టింటివారు నాగరులై పోయినపు డెల్ల చీరలు పెట్టు తెలుగు గృహాము నలవాటు తెరవాటుకొట్టిరి. సోకుపడి చెల్లెలి చీర యొకటి తె చ్చెను. ప్రతియూరేగింపున కదియే బండారమైనది.

ఆమెయు, విమలవంక నట్లే చూచును. విమల వద్ద సదా అప్పుడు కూర్చుండవలయును. అవధాని వైద్యునితో 'మాచెల్లికి మా నాయనగారు మందు ఖర్చు యిస్తా నన్నాడు, మంచిమం దిమ్మ' నెను. ఆయన డబ్బు ముందిమ్మనెను. అవధాని తండ్రి నడిగి లాభము లేదని తన సంపాదనలో నొక ఐదు రూపాయిలు డాక్టరున కిచ్చెను. మందు తెచ్చి చెల్లెలికి వేసెను. ఆనాడు మధ్యాహ్నము చెల్లెలి మంచమువద్ద నవధాని కూర్చుండెను.

విమల:— అన్నాయీ! డాక్టరుకి డబ్బిచ్చా నన్నావు కదా! ఎక్కడిదిరా?

అవధాని:—నాన్నగా రిచ్చారు.

విమల:—నాన్నగారియ్యకేం. అమ్మఇచ్చిందా?

అవధాని:—కాదే, నా స్వంతం.

విమల:—నీకు స్వంతమా? ఎక్కడిది?

అవధాని:—అది నీకెందుకు? జ్వరం నిమ్మదిస్తే చాలదు?

విమల:—అట్లాకాదు. చెప్పితీరాలి. లేకపోతే నాకు మందువద్దు.

అవధాని:—చెపుతానుగాని యెవరితో చెప్పవు గదా. నేను మన యింటికి అప్పుడప్పుడు వచ్చే చుట్టాల జేబుల్లోంచి, పెద్దమనుష్యుల జేబుల్లోంచి కాజేస్తూ వచ్చాను. నా దగ్గర పదిరూపాయల దాకా ఉన్నది. అందులో అయిదు రూపాయలు డాక్టరుగారి కిచ్చాను.

ఈ మాటలు వినుచునే విమల మొగములో నొక వివర్ణత యుదయించెను. ఆమె పెదవు లెండిపోయెను. ఆమె కొంచెముసేపు అన్నగారి వంక నట్లే చూచి మొగము నట్లే త్రిప్పుకొనెను. అవధానికి గుండెలో భయము కలిగెను. 'చెల్లీ! తప్పు

చేశా నంటావా. నేను ఇట్లా సంపాదించకపోతే ఇప్పుడు నీకు మం దెవ రిప్పించేవాళ్లు? నాన్న గారు ఏదికావాలన్నా యియ్యరు. మనము బ్రతకటం యెల్లాగ. ఇట్లా తిరగవా? నీ కంత యిష్టం లేకపోతే మానివేస్తాలే.'

విమల:—అని ఒట్టేసుకో.

అవధాని:—నీ జబ్బు నయం అయాక వేసుకుంటాను.

విమల:—ఇప్పు డెందుకు వేసుకోకూడదు?

అవధాని:—జబ్బు నిమ్మదించిన తర్వాత వేసుకుంటాగా?

ఆ సాయంతనమువరకు విమల యవధానితో మాటాడలేదు. ఆరాత్రికి జ్వర మెక్కువయ్యె యతనితో మాటాడుట తప్పినది కాదు. తరువాత నాల్గు రోజులకు విమల జ్వరము తగ్గెను.

అంతవరకు నవధానికి చదువు లేదు. ప్రాథమిక పాఠశాలకు పోవుచు వచ్చుచుండెను. అది పురపాలక సంఘ పాఠశాల. అచ్చట నేదో జీతము కొద్దిగా నుండును. అట్లే మైదవతరగతి పరీక్ష నిచ్చెను. ఉపాధ్యాయులును నీతనిని ఊరకే యుత్తీర్ణుని చేయుచు వచ్చిరి. ఆ మరుసంవత్సరమున

నవధానిని ఫస్టు ఫారములో ప్రవేశపెట్టిరి. ప్రతి నెల జీతము మూడు నెలల తరువాత పేరు కొట్టి వేసినప్పుడుగాని సోమశంకరముగా రీయలేదు. అవ ధానికి చరిత్రగాని, భూగోళముగాని, లెక్కలుగాని ఏమియును రావు. ఇంగ్లీషు ముక్కలు మాత్రము మిక్కిలి చురుకుగా వచ్చును. దీనికితోడు ఒక యేడాది గడచిన తరువాత నొక సన్నివేశము జరిగెను. బర్మా షెల్ కంపెనీలో నుద్యోగస్థుడైన యొక దొర సోమశంకరము గారి యింటికి పనియుండి నాలుగైదు సారులు వచ్చెను. ఒకసారి సోమశంకరముగారు తన కొడుకును వెంట తీసికొని ఈయన యింటికి పోయెను. ఆ దొర కొడుకు ఎనిమిదేండ్ల వాడు. అతనికిని అవధానికిని పరిచయము కలిగెను. ఆ దొర యింటి లోని బట్లరు, ఆ పిల్లవానిని పెంచెడు నర్సు-వీరితో కూడ నవధానికి పరిచయము కలిగెను. అవధాని తన స్వప్రయోజకత్వమువలన నీ పరిచయమును చనువుక్రిందకు తెచ్చెను. ఆ దొర కొడుకుతో బట్లరుతో, నర్సుతో నింగ్లీషులోననే మాటలా డును. ఆ సంవత్సరాంతమునకు నీత డింగ్లీషులో ను త్తీర్ణుడయ్యెను - తక్కినవానిలో తప్పెను. ఫస్టు

ఫారము రెండవ మేడు చదివెను. మరల నంతియే యైనప్పటికి పాఠశాలలో నతనిని పై తరగతిలో వేసిరి.

ఇంటికి వచ్చిన పెద్దమనుష్యులజాగ్రత్త ఎక్కువ యైనకొలది అవధాని నేర్పు చిత్ర చిత్రములుగా ప్రజ్వలింపసాగెను. అప్పుడు సర్వవిధముల సహాయ భూతుడగుచుండెను. ఒకనాడొక యతిథి స్నానము చేయుచు భోజనముచేయుచు తన డబ్బుసంచి తన వద్దనే యుంచుకొనెను. అప్పుడు నవధానియు నెంతకాపు వేసినను వీలు చిక్కనీయలేదు. అవధానియు నప్పుడును దొడ్డిలో నొక పన్నాగము వేసిరి. స్నానాల గదికి బయట గొళ్లెము దాని యంతట నది పడును. నాలు గైదు సారులు అట్లుపడి లోన స్నానముచేయువారు కేకలువేయుటయు నితరులు వెళ్లి తీయుటయు జరిగినది. ఆ వచ్చిన యతిథి మధ్యాహ్నపు పూట నిద్ర లేచి కాళ్లును మొగమును నిముసములో కడిగి రావచ్చునుకదా యని కడచిన దినమున డబ్బుసంచి తలక్రిందనే వదలి పోయెను. అవధాని యిట్లన్నాడు— 'ఒరేయి, అప్పడూ! యివ్వాళ ఆయన మధ్యాహ్నము నిద్ర లేచి గదిలోకివస్తాడు. అప్పుడు డబ్బుసంచి అక్కడే

వదలి పెడతాడు. నేనీ పిట్టగోడచాటున దాక్కొని గొళ్లెం వేస్తాను. నీ వీలోపుగా పని కాజేసివెయ్యి. ఎరగనట్టు తీయటంలో రూపాయి, అర్ధా తీయకు. ఒక పది రూపాయల నోటుంటే కాజెయ్యి.'

అప్పడు:—ఆయన జేబులో నోట్లు లేకపోతే?

అవధాని:—ఓరి ముండ! ఎందుకుండవురా?

ఆ మధ్యాహ్న మీ పతక మనుకున్నట్లు జరిగినది.

ఈరీతిగా నవధాని యెప్పటికప్పుడు తనవిద్యలో క్రొత్తతంత్రముల కనిపెట్టుచునే యుండెను. ఎక్కువ జాగ్రత్త చూపినవానికి నెక్కువశిక్ష వేయుచుండెను. ఏదో సాయిలా పాయిల్గా పోనిచ్చినచో నొకటిరెండు రూపాయీలతో పోవుదానిని పోలీసు తెలివితేటలు చూపినవారికి పదులు నైదులు తగులుచుండెను.

ఒకనాడు విమల యన్నగారిదగ్గర నైదారు డబ్బునోట్లు చూసెను. అప్పటికి నవధానికి పదమూడవయేడు. విమలకు పధియవ యేడు. విమల యీ డబ్బు నీకెక్కడిదని యన్నగారిని గ్రుచ్చి గ్రుచ్చి యడిగెను. అతడు కొంతసేపు దొర కొడుకిచ్చినాడని, కొంతసేపు తన కెక్కడనో

దొరికినదని చెప్పిచెప్పి యామె యొత్తిడిమాటల కాగలేక ప్రాతబేరము బైటపెట్టెను. విమల తల్లి తండ్రులతో చెప్పుదునని బెదరించెను.

విమల యీడుకు మించిన తెలివికలది. ఆమె యూహాపోహాలు మంచి చురుకైనవి. ఆమె కారేండ్లప్పటి నుండియు నొక విచిత్రమైన వివేచనాశక్తి కనబడినది. ఈనాటి కప్పుడే యది పరిణతిముఖమై బాల్యసమాక్రాంత మగుటలో విస్పష్టముగా క్రియారూపమున శక్తిచాలక విద్యపూర్తియై యనుభవ దశ నందనిలోటు మాత్రమే మిగిలి ప్రయోగాభిముఖమై యున్న స్నాతకుని ప్రతిభవలె నుండెను. తన యన్నగారి దుశ్శీలము దల్లిదండ్రులతో చెప్పవలయునో వలదో యామెకు తెలియలేదు. చెప్పినచో లాభము లేదని తెలియును. తల్లిగాని, తండ్రిగాని యవధాని జోక్యము పట్టించుకోరు. తండ్రి యసడ్డ కలవాడును, తల్లి పుట్టింటి గాలి సోకినదియు కానిచో విమల కీపాటికి పెండ్లి యైయుండును. విమలయు పదియేండ్లపిల్లయయ్యు నెనిమిదేండ్ల దానివలె కనుపించును. అవధాని పదమూడేండ్ల వాడయ్యును పదునారేండ్లవానివలె నుండును.

విమల యవధానితో పది దినములు మాటాడ లేదు. అవధానికి విమల యన్నచో ప్రాణము. తండ్రియొక్క తూష్ణీంభావమువలనను తల్లియొక్క యౌదాసీన్యమువలనను నవధాని ప్రేమయంతయు నతని హృదయములోని మార్దవమంతయు మనుష్య జన్మవశమైన యనురాగ మంతయు పదియేండ్ల యొకయింటిలోని నివాసమువలన కలిగిన యార్ద్రిత యంతయు రక్తస్పర్శవలన కలిగిన యనురాగ మంతయు నవధానికి విమలలో ముడివడెను. విమలలో మొలక చూపెను. విమలలో వివర్ధితమగు చుండెను. తన యవినీతికార్యములు తప్ప తక్కిన తన సర్వవిషయములు నతడు విమలతోనే చెప్పును. పాఠశాలలో నుపాధ్యాయులతో తోడిబాలకులతో జరిగిన సంభాషణలు నివేదించునది విమలకు. ఆటలలో తన గెలుపులు వానియందలి తన చాకచక్యము నుల్లేఖించునది విమలకు. తన కెక్కువ మార్కులు వచ్చిన పరీక్షాపత్రములు వినికిలిచేయునది విమలకు. తనకు తక్కువమార్కు లిచ్చిన యుపాధ్యాయుల యధమత్వ నీచత్వ తత్సుతా జారత్వ, తత్కుల ప్రసంగము లుపన్య సించునది విమలకు. విమల యివి యన్నియు

వినును. అతని యధిక వాచాలత్వము విమర్శిం చును. అతని యసభ్యతా వాక్కులు నిరాకరిం చును. అతని క్రీడాపరాక్రమము ప్రశంసించును. విమలకు నవధాని యన్నచో నొక విచిత్రమై కోటి సమాకృష్టమైన యొక వంశగౌరవ పతాకా భావన. ఆ పసిమెదలో నింతయు సువ్యక్తమైలేదు. ఆ భావన యొక్క జాతిలక్షణ మట్టిది. ఆమె సృష్టిచేతనే యొక విలిప్తురాలు. తల్లిదండ్రుల దూరమువలన యీ విలిప్తతకు దోహదమైనది. అవధానియొక్క కించి దవినీతికర ప్రవర్తన సూచ నములవలన యతనియందు నభిమానమును నిం డుగా లేకపోయినది. అతడు తన కన్నగారు. అత డేదో కొండలు త్రవ్విపోయునని, సముద్రములు పుక్కిలించునని బాలహృదయములో నిగూఢతర ముగా నున్న యొక యాశయొక్క ప్రతిబింబము విమల యతనిలో చూచును.

అవధాని రెండవఫారము రెండేండ్లు, మూడవ ఫారము రెండేండ్లు చదివెను. ఈలోపుగా నతడు కొన్ని ఘనకార్యములు చేసెను. ఆయూరిలో నొక మహోత్సవము జరిగెను. అది యతడు మూడవ ఫారము మొదటి సంవత్సరము చదువుచున్నప్పుడు.

జనము సందడిలో నప్పుడు నతడు కలసి యొకని కోటుజేబులో నుండి డబ్బు తీయుచుండగా పోలీసువాండ్రు పట్టుకొనిరి. ఆడబ్బు అసలువానికి చేరలేదు—వీరికిని పొందలేదు. సోమశంకరముగారి కొడుకని తెలిసి చీవాట్లతో నవధానియు, దెబ్బలతో నప్పుడును బయట పడునప్పటికి చావుతప్పి కన్ను లొట్టపోయెను. వానికి తెలిసిన విషయ మేమనగా వీధికన్న నిల్లే భద్రమైనదని. నాల్గవ ఫారములో నున్నప్పుడు మరియొకసారి పట్టుబడగా తండ్రి వదలించుకొని వచ్చెను.

అప్పుడు నెల సబ్ జైలులో నుండెను.

ఇప్పటికి నవధానికి పదునెనిమిదేండ్లు. నాల్గవ ఫారములో నతడుండెను. అతనికి వచ్చిన యింగ్లీషు యఫ్. ఎ. విద్యార్థులకు గూడ రాదు. తక్కిన విషయములు ఒకటవతరగతి చదువుచున్నవారికి తెలిసినన్ని యితనికి తెలియవు.

అవధాని యొకవిచిత్రమైన ప్రవాహము. గంగానదిలో నెంతమాలిన్యమైనను పతన నిమేషమునందే తద్గత సర్వక్రిమి నాశనమై స్వచ్ఛతరమై పోవునట. అన్ని నదు లట్టివా? కొన్ని నదులలో మాలిన్యము ప్రవాహముతో జాల దూరము పోయి యచ్చట

విశ్లథమై యంతరించును. మఱికొన్ని ప్రవాహము లలో యీ యమ ప్రవహించు ప్రదేశ సమీప పట్టణ మాలిన్యమును నొద్దు వెంట నడిమి తరంగ ములచే నొత్తుకొంచు దనలో కలుపుకొని దానిని నాశనము చేయు శక్తి చాలక సముద్రము వరకు మలినమై పతి సంగమార్థముపోవు ననాగరక మైన భార్య వలె పోవును. అవధాని యటువంటివాడు. అతడు సోమరియూ కాడు. తెలివితక్కువనా డం తకుముందే కాడు. అతడు పెద్దపెద్ద యింగ్లీషు పుస్తకములు తెచ్చుకొని రాత్రులందు ప్రొద్దుపోవు వరకు చదువుచునే యుండును. తెలియని ప్రతి మాటకు విసుగులేక నిఘంటువు చూచును. క్రమ క్రమముగా నతడు కళాశాలా విద్యార్థులతో పరిచ యము చేసి వారివద్ద పుస్తకములు తెచ్చి చదువును. అతని ప్రతిష్ఠ రెండు రకములు. అతడు చేవాటు కాడని పదిమందికి తెలియును. ఏ విద్యార్థియైనను నతడు తన గదిలోనికి వచ్చినచో మొగమోటమి లేకుండ పొమ్మనిచెప్పును. అతడు గదిలో నున్నంత సేపు ఫౌంటెన్ కలములు, గడియారములు, డబ్బు ను నొక కంట చూచుకొనుచుందురు. అతడు పుస్త కము లెత్తుకొనిపోడు. ఒకవేళ చెప్పకుండ తీసి

కొనిపోయినను చదివి తప్పకుండ తిరిగి యిచ్చును. స్కూలుఫైనలు కాని, యింటర్మీడియేట్ కాని చదువుచున్న విద్యార్థులతనిని తప్పక రానిత్తురు. ఇంగ్లీషులో నేదైన తెలియని విషయము లున్నచో నతని నడిగి చెప్పించుకొందురు. అవధాని కేర్పడిన యీయింగ్లీషుభాషాపాండిత్యము దొంబిల్లలతో స్నేహము చేయుటచేతను, పుస్తకములు చదువుటచేతను మాత్రమే యేర్పడినది కాదు. ఒక ముసలి ప్లీడరు సోమశంకరముగారి స్నేహితుడు. ఆయన యిప్పుడు వృత్తి చాలించుకొనెను. ఇంగ్లీషులో చక్కని పాండిత్యము కలవాడు. న్యాయవాదవృత్తి చేసినన్నాళ్లు నతనికి భుక్తిగడవ లేదు. ఏ వ్యాజ్యము కోసము నెవడును నాయనవద్దకే పోలేదు. సోమశంకరముగారే యాయనకు నెలకిల్లు గడచునంత వట్టు వారితో వారితో చెప్పి కమీషన్లు వేయించుచు కుంటుపడకుండ బండి సాగతోలించినాడు. ఆయన కిప్పుడు వారసత్వపు టాస్తి గ్రాసవాసోదైన్యంబులపాలు చేయనంత సంక్రమించినది. అవధాని ప్రతిదిన మాయన వద్దకు పోవును. ఆయన యితనికి ఇంగ్లీషు నూరిపోయును.

అవధాని నాల్గవ ఫారములో ప్రవేశించి సగము

చదివినంతలో నతని హిందూదేశపు జదువు పూర్తి యయ్యెను. అతనికొక సంగతి గట్టిగా తెలిసెను. స్కూలు ఫైనలుపరీక్షకు చదువునాటికె న్నేండ్లుపట్టును. అందు తీర్ణు డగుట యన్నది యసంభవము. తాను చదువుకొనకపోయిన నేమి, తనతండ్రి చనిపోయిన తర్వాత తన కొక లక్ష రూపాయల యాస్తి వచ్చును. అతని కిప్పు డిరువది యేండ్లు. టెన్నిసు కాలిబంతి యాటలలో నఖండుడు. అప్పుడే నాలు గైదు మెడల్సు సంపాదించెను. శరీర మినుపముక్క వలె నుండెను. కనుక నీదేశపు చదువు తనకు లేకపోయినను మునిగిపోయినది లేదు.

అతని కొక కోర్కె యుదయించెను. పది పదు నేనువేలు ఖర్చుపెట్టి ఇంగ్లండు పోయినచో యేదో గొప్ప పరీక్షయం దుత్తీర్ణుడై రావచ్చును. ఆ పైని చూడు. కాని తండ్రి చనిపోవలయును.

విమల కిప్పుడు పదునేడేండ్లు. పిల్ల వయస్సుతో కొంత నేవళము తేరినను తొలినాటివలె నిలకఱచు కొనిపోయియే యుండెను. ఆ యింటిలో భవానీ సోమశంకరము లిద్దరకును లేని సంఘసంస్కార భావము వారి యశ్రద్ధవలన పెండ్లికాని విమల వయస్సుతో నున్నట్లే కనిపించెను. అందరును

భవాని పుట్టింటివారి సంప్రదాయములు సోమ శంకరముగారి యింట జెల్లుబడి యగుచున్న వను కొనిరి. రెండు మూడేండ్లుగా విమలలో బెద్ద మార్పువచ్చెను. ఆమె తన స్థితి తా నాలోచించు కొన నారంభించెను. తనకు బెండ్లి చేయుడని తల్లి దండ్రుల నెట్లడుగును? అప్పటికిని మాటలలో తల్లితో పలుమారులు కొంచెము కొంచెము వివాదసమయములలో సూచించుటయు నొకటి రెండు సార్లు బహిరంగముగా చెప్పుటయు చేసినది. అవధాని స్నేహితులు పలువురు తమయింటికి వత్తురు. అవివాహిత, పదునేడేం డ్లది యతని చెల్లెలింట నున్నదని యామె దర్శ నముకొరకు నోరగానున్న తలుపువాక గాజుల సవ్వడి వినిపించిన దొడ్డివంక వారి దృష్టిప్రచా రము సాగినను విమల కనిపించదు. కనిపించినను తల యెత్తదు. తలయెత్తుటకు వారు చేసిన సవ్వ డియు నిరర్థకమగును. ఆమె సరియైన వేళకు భోజ నము చేయదు. ఆమె చిన్నప్పటినుండియు నన్న గారివద్ద నేదో చదువుకొనుచునే యుండెను. ఈ మూడేండ్లు అవధాని యామెకు విద్యాగురువు. శిష్యురాలికి గురువునందుకన్న గురువునకే శిష్యు

రాలియందు గురుభావము. అవధాని చెల్లెలికి ఇంగ్లీ షులో తాను చదివిన బహువిషయములగూర్చి చెప్పవలసిన వాకబు అంతయు చెప్పెను. ఆమెయే సొంతముగా యింగ్లీషు గ్రంథములు చదివి కొంత తెలిసికొను స్థితిలో నున్నది.

ఆమెకు నీమూడేండ్లలో రెండుమూడు సంబంధ ములు వచ్చినవి. అందరు పెండ్లికొడుకులు రెండవ పెండ్లివారే.

ఒకాతడు ఢిల్లీలో నొక పత్రికాధిపతి. మరి యొకడు కోలారు బంగారపు గనులలో నెలకు నూటయేబది రూకల యుద్యోగస్థుడు. తల్లి యీ రెండు సంబంధములకు తూగెను. తండ్రి యీ మూడేండ్లుగ వ్యాధిగ్రస్తుడై యుండి భార్య యేది చెప్పినను నూకొట్టెను. విమల యే సంబంధ మునకు నొప్పుకొనలేదు.

విమలకు వయస్సు వచ్చినప్పటినుండియు గృహ ములో నొక మార్పువచ్చెను. తండ్రిచేతిలో నున్న ధనవిషయము వదలిపెట్టినచో తక్కిన సర్వవిష యములందు నింటిలో విమల చెప్పినది మాట. తల్లియు విమలమాట కెదురాడదు. చిన్న విష యములందు కూడ విమల యధికారమే. ఒకనాడు

అవధానికి జ్వరమువచ్చినది. అత డన్నము తిని పండుకొని నిద్రపోయినచో తన జ్వరము తగ్గిపోవు ననెను. విమల యుపవాసమున్నచో తగ్గు ననెను. 'నీవు శరీర వ్యాయామము చేసినవాడవు. నీ శరీరము శ్రమకోర్చుకొనును. నీకు జ్వర మెప్పుడు వచ్చిన నుపవాసము మానుకొని తిని పండుకొనుట కాదు. నీకు స్నేహితులతో తిరిగి కాఫీహోటళ్లలో తిను తిండికి జబ్బుచేయును' అని చెప్పెను. చివరకు అవధాని యుపవాసమే చేసెను.

తల్లి యెప్పుడైనను "నీ వింక వివాహాము చేసికొనవా" యనును. విమల "తల్లిదండ్రులు చేయవలయును. ఇవి స్వయంవరపు రోజులా? పదిమంది యాచకొడుకులను పిలిపింపుము. ఎవనికో యొకనికి పూలమాల వేయుదు" ననును. తల్లి కివి కట్టె విరుపు మాటలు. పెళుసుమాటలు. దానితో తల్లి సణుగుకొనుట; తద్విషయోపసంహారము.

వారి యింటిలో నప్పని యుద్యోగము పోలేదు. రెండేండ్లుగా నవధాని వానితోఁగలసి చెదురువాటు పనులు చేయుటలేదు. అప్పడికి పదియేండ్లనాడు సోమశంకరముగారి యింటిలో నెంత జీతమో యిప్పుడు నంతియే జీతము. వాని తల్లి చనిపోయి

నది. వా డొక్కడే. ఎట్లో ఒకట్లు జీవితము సాగించు చున్నాడు. ప్రతిదినము దండెములు, బస్కీలు తీయును. కొన్ని కాఫీహోటళ్లలో, ఒక సినిమా హాలులో వాని దాధ్వర్యము. విశాలమైన వక్షస్థలము, నినుపగుదియలవంటి చేతులు, నేస్తుతొండములవంటి కాళ్లు నొక బజారు బజారు వానిమాట కెదురులేని యసివారు. ఇతర వీధులలో వాని మాట నిరాఘాటమైన సూయాణము. సోమశంకరముగారి యింటిలోనున్న వ్యక్తురాలైన యవివాహితవంక కుత్సితదృష్టులు ప్రసరింపవన్నచో నప్పడి భుజావప్ర మప్రతిహత మన్నమాట. అప్పడు నవధానియు నాజానుబాహులు, అరవిందదళాక్షులు మాత్రమే కారు. ఆయసస్తంభ ప్రమాణ దేహులు. ఊరిలో పులులు. విమలముందు పిల్లులు. విమల కోపముగా నప్పనివంక చూచెనా వాడు రెన్నాళ్లీ ముంగిటికి రాడు. విమలకు కోపము వచ్చెనని తెలిసినచో నవధాని యా పూట పస్తుండును. విమల వచ్చి బతిమాలినచో వచ్చి భోజనము చేయును.

అవధానికి వచ్చిన సంబంధములకు లెక్కలేదు.

అతడు తన చెల్లెలికి వివాహము కాకుండ తాను చేసికో ననెను.

ఒకొక్కప్పుడు అవధాని తా నిట్లనుకొనును. తండ్రి చనిపోయినగాని యాస్తి తన చేతిలోనికి రాదు. అప్పుడుగాని విమల పెండ్లికాదు. విమలకు పెండ్లి చేసి తా నింగ్లాండునకు పోవును. విమలకు మంచి సంబంధము దొరుకవలయును. తన స్నేహితులలో నెవ్వరిని చూచినను చాలమంది కదివరకే వివాహమయ్యెను. కొందరికి సర్జికోట్లు, క్రాపింగులు, బూట్లు తీసివేసినచో మిగిలిన మూర్తులు యంబ్రహ్మలు. పైగా విమల తన మాట వినునా? తన కామె చెప్పును కాని, యామెకు తాను చెప్పువాడు కాడు.

ఇట్లుండగా “తాను నదే కోరెను, దైవము నదే కోరెను” అన్నట్లు జరిగెను. ఒకనాటి యుదయమున సోమశంకరముగారు ఎనిమిది గంటలకు మేడ దిగి రాలేదు. మూడేండ్లు తీసికొనినను నది యుబ్బసపు తీసికొనుట. ఆయన మొదటిసారి తాలూకా గుమాస్తా పదవినుండి సిరస్థదారయినప్పుడు కొనిన గడియారము నేటివరకు నిముసమైనను వారడి లేకుండ నెనిమిదిగంటలాయన మేడ దిగి

వచ్చు వేళకు కొట్టుచుండెను. ఆనాడు దాని విధ్యుక్తప్రకారము పది గంటలు కొట్టినను శంకరము గారు దిగిరాలేదు. అప్పుడు భవాని పోయి మేడ మీద చూచినది. పెద్దపెట్టున నేడ్చినది. పిల్లలిద్దరు మేడమీదికి పోయిరి. రామారావుగారికి కబురంపిరి. ఈ రామారావుగారే సోమశంకరము గారి స్నేహితుడు. అవధాని యింగ్లీషు గురువు.

పదియవనాడు విల్లుకోసము పెట్టెలు వెదకిరి. రిజిష్టరు కాని విల్లొకటి కనుపించెను. పదివేలు భవానికి, యిరువదివేలు విమలకు, తక్కినఖాయిదా పొలము, యిల్లు, కుమారునకు వ్రాసియుండెను. కుమారునిమీద నధికారమిద్దరు పెద్దమనుష్యులకున్నది. ఒకాయన రామారావుగారు. రెండవయాయన గురుమూర్తి. అవధానికి గురుమూర్తి ఎవరో తెలియదు. రామారావుగారు 'ఆయనది బరంపురము. ఆయన సంస్కృతాంధ్రములు చక్కగా చదివినాడు. నాకును మీ నాయనగారికిని స్నేహితుడ'ని చెప్పెను. ఆయనకు రమ్మని యుత్తరము వ్రాసెను. ఆ విల్లులో విమల వివాహము వీరిద్దరి యనుమతితో జరుగవలయుననియు నింకొక యేడాదిలో విమలకు మైనారిటీ వెళ్లకముందే వివాహము

చేయవలయు ననియు వ్రాసెను. అవధాని ఇంగ్లం డునకు పోవలయునన్నచో పంపించుటకు నేమియు నభ్యంతర పెట్టవలద నెను. వీరేశలింగముపంతులుగారి హితకారిణి ఉన్నత పాఠశాలకు విడిగా పదివేలు వ్రాసెను. తనపేర నొక యుచితవేతనము నొసంగ వలసినదిగా కాకినాడ రాజావారి కళాశాలకు నాల్గువేలు వ్రాసెను. తన యపరకర్మలకు రెండు వేలు వ్రాసి ఆ కర్మలలో గోదానము మొదలైన వానికి ఐటమ్వారీగా నొక పెద్ద జాబితా వేసెను. అతని దొక కీలు చెడిన మనస్సు. అయినను యీ విరాళములతో నాయనకీర్తి యతని యనంత రము మూడు పట్టణములలో బోరుకొనెను. లోక మందరు నుదారు డనిరి. ఆయన బావమఱదులు తమ పేరైనను విల్లులో లేకపోవుటచేత ముభావ ముగా నుండిరి. నగలతో, రంగు రంగు చీరలతో పనిలేని భవానికి పదివేలు కన్నులకు కనిపించెను. అజీర్ణవ్యాధి పీడితుని కన్నుల కెదురుగా మిఠాయి దుకాణ మున్నట్లయినది.

మూడవనాటికి గురుమూర్తిగారు వచ్చిరి. అవ ధాని గుర్తుపట్టెను. అప్పుడికి ఊరిలో తనకున్న మద్దతు యొక్క ఉమ్మసులో గురుమూర్తిగా

రన్న చో భయము కలుగలేదు. అవధానికి మనసులో కొంచెము కళవెళ తోచినను తమాయించు కొన్నాడు. ఎప్పుడో చిన్ననాడు తానట్లుచేసిన దానికి పెద్దతప్పేమిటి? చిన్న నాడేమిటి? మూడు నాళ్లేళ్ల క్రిందటివరకు చేసెను. అవును. అప్పటి వరకును బుద్ధి తెలియదు. అప్పటివరకును చిన్న నాడే. నాలుగేండ్లనుండి నేను చేసితినా? చెయ్య లేదు. ఇప్పు డసలు చెయ్యవలసిన పని లేదు.

గురుమూర్తిగారు మాటాడినను తనవంక చూచి నను పూర్వపుసంగతి యాయనకు జ్ఞాపకమున్నట్లే లేదు. ఆయన మరచిపోయియే యుండును.

విల్లులో తన తండ్రి యీయన పేరెందుకు వ్రాసెను? పది యేండ్లుగ నీయన తన యింటికి రాలేదు. తనతండ్రి యీ యూరు కదలలేదు. వీరిద్ద రకు నెప్పుడును ఉత్తర ప్రత్యుత్తరములు జరుగు చునే యుండెనా? తన తండ్రి కీయన అంత స్నేహి తుడా?

అయినను తనపైని వారి యధికారము ఇం కొక్క సంవత్సరము మాత్రమే!—

# 3

సాంవత్సరీకము లైనతరువాత బోవచ్చునని గురుమూర్తిగారును, కాదప్పుడే పోవుదునని యవధానియు, పోయి యేమి చేయుదు వని గురుమూర్తిగారు, పోయియేమిసేయునో తనకే తెలియ దని యవధాని. చెల్లెలి పెండ్లి యున్నది. తాను కూడ పెండ్లి చేసికొనవలయును. ఇది యైన తరువాత నింగ్లండు పోవుట యని గురుమూర్తి. అవధానికీ మాటతో కోపమువచ్చి నేనసలు పెండ్లియే చేసికొననెను. విమలకు సంబంధ మెచ్చట? అప్పుడే పెండ్లి యెట్లగును. సంబంధము చూడవలయును గదా. ఇది యంతయు అగునప్పటి కాలస్య మగును అని యవధాని చికాకుపడెను. గురుమూర్తి యది యొక మోస్తరు మనిషి. అవధాని కోపతాపములకు దనకు సంబంధము లేనట్లుండును. 'అబ్బాయీ, ఇదిగో వ్యవహారము. మీ తండ్రి యెంత యుదారుడైనను చివరి కెంత న్యాయము చేసి పోయినను, బ్రతికియున్న న్నాళ్లు వ్యవహారము కంగాళి చేసిపోయెను. నీ చెల్లెలి పెండ్లి చేయుట నీ విధి. నన్నడిగినచో నీ వింగ్లండు నకు పోకముందు వివాహము చేసికొనుట మంచిది.

తీర్థా నీ వకడి లక్క బొమ్మను తెచ్చినచో నిచ్చటి వ్యవహారము చిట్టెము కట్టును. తల్లి తండ్రులు నీళ్లులకు నీళ్లులు వదలుకొనవలయును. పైగా నీవచ్చుటికిపోయి చదువుటకన్న కేంబ్రిడ్జి సీనియరు యిచ్చటనుండియే చదువవచ్చును. ఒక యేడాదిలో నది పూర్తియగును' ఈ యేడాదిలో తాడ్రి యేడు పూర్తియగును' అనెను.

అవధాని గురుమూర్తి మాట ధిక్కరించుటకు నతని రక్తములోని ప్రతి బిందువును తొందర పెట్టెను. కాని యొక సన్నివేశము వాని తొందర నడగించెను. అతడు మేనమామల యింటికి నొకసారి పోయెను. జన్మకు శివరాత్రి యని యతడు మేన మామల యింటికి పోవుట కదియే మొదటిసారి. మేనమామలు పెద్ద యాసి కలవారు కారు. ఏదో చిన్ని చిన్ని యుద్యోగముల మీద బ్రతుకుచు కూడు గుడ్డలకు లోపము లేకుండ మనువారు. ఆ యుద్యోగము లంత చిన్నవి కాదు. ఆ కూడు గుడ్డ లంత పేదవియు కాదు. ఇద్దరు మేనమామలు చెరియొక వంద పాతికయును తెచ్చుచున్నారు. పెద్ద మేనమామ యిద్దరి కూతుండ్రకు వివాహ మాయెను. వివాహము కానిది పది యేండ్లదొకతె

కలదు. ఆమె పేరు సీత. చిన్న మేనమామ కిద్దరు కూతుండ్రు. ఇద్దరు నవివాహితలు. పెద్దది పదు నాలుగేండ్లది. రెండవ యామెకు యేడాది వారడి. పెద్దయామె లలిత, రెండవది శారద. ముగ్గురిలో సీత ముచ్చటయైన పిల్ల. అవిస్పష్టములైన యౌవ నోదయచిహ్నములామె యొడలియందు పసిపింద లుగా, అర్ధ వికసితాల్పబాలపత్రములుగా, గొంతుక సరిచేసికొను కోకిల యొక్క మొదలి చికిలి కూతలుగా, జార్చిన పింఛము మరల తొడుగుచున్న నెమలి చిన్ని తోకగా, మెట్టమీదికి త్రోయబడి పునస్సరస్తరంగప్రాప్తి కని తోక సవరించుకొను చిన్ని మీనులుగా, సవరించుకొనుచుండెను. ఆయింటి లోని కన్నెలు ముగ్గురకు తమ కన్నియతనము తెలిసినట్లే లేదు. తమ స్త్రీత్వభావము తమ మనః పదములందు తిరోహిత మయ్యెనో, అన్యభావ సమాచ్ఛాదితమై పొనుగవడ్డ నిప్పువలె నుండెనో తెలియదు. ఒక కొంత కొంత బెళుకు చూపుగాని, చీర కొంగు రువ్వుగాని, యౌవనభావహఠాత్ స్ఫూర్తి జనిత మధురభావ సముల్బణము యొక్క హేలాప్రయత్న నిరోధముగాని లలితయందు కని పించుచుండెను. సీత తరువాత లలిత యందగత్తె.

శారదయందు సౌందర్య రేఖయే కనిపించదు. కాని శారద కన్నులలో నొక విచిత్రమైన లాలస గోచరించుచుండెను. సీతా లలితలు ప్రసంగమునందు, విహారమునందు, బెరుకులేనితనము ప్రకటింతురు. శారద చూచిన చూపు, పలికిన పలుకు, పర్వతము తాకి యాగి ప్రక్కగా ప్రవహించి తొలగిపోయిన ప్రవాహమువలె యొక నిరోధమును వెడలించును. సీతా లలితల ప్రకృతులలో మధుర స్వాగత భావము కనిపించును. శారద ప్రకృతిలో స్వాగతము కొరకు నిరీక్షణ చేయవలసినట్లు తోచును.

అవధానియందు ప్రకృతి ద్విధా విభక్తమై యున్నది. పట్టి బలవంతముచేసి యింగ్లీషు భాషను బహు నిరోధముల కెదురు నడచి సంపాదించిన పట్టుదల యొకటి, సులభలభ్యమైన దానిని బెణుకు తొణుకులు లేకుండ నపహరించు ప్రకృతి యొకటి. ఈ రెండు ప్రకృతు లతనిని ముగ్గురు మరదండ్ర వైపునకు లాగజొచ్చెను. సీత చిన్నది. లలితకు సీతకు తారతమ్యపరీక్ష చేసినచో సీత యొదలి ప్రసన్నతాభావము బాల్యముచేత కలిగినట్లు తోచును. సీతలో నొక యత్యంత దూరమును నత్యంత సన్నిహితమును నైన భావము

రేఖగా తోచుచుండెను. ఆ భావము యొక్క సుస్థిరత్వము మనసును కొట్టినట్లుండెను.

అవధాని యచ్చట పది రోజు లుండెను. పది రోజులు ముప్పది రోజులుగా నుండెను. వారి నొక రొకరు నంతకు పూర్వ మెరుగకపోయినను బంధుత్వపు బలిమి, నలుగురి యాపదశాదేహాళనిహితత్వమును నాగరకతాపరిస్ఫోరకరూపభావములును, అత్యంత సన్నిహితులుగా జేసెను. అవధానికి శారద చూచిన చూపున కర్థము తెలియదు. సీత యర్థమైనట్లుండును. లలిత ప్రవర్తన హస్తామలకముగా నుండును. ఆ పదిరోజుల యనుభవములో లలిత తలిదండ్రులు లలితావధానులను భార్యాభర్తలుగ భావించుకొనిరి. లలిత యొక యమాయకురాలైన తాను కూడ నట్లేననుకొనెను. అవధాని మనస్సు చొచ్చి చూచినవా రెవ్వరును లేరు.

అవధాని పదిరోజు లింటివద్ద నుండును. పదునేను దినములు మేనమామల యింటివద్ద నుండును. ఇంగ్లండు ప్రస్తావనలో వేడి తగ్గినట్లు కనిపించెను. ఇట్లు నాలుగైదు నెలలు గడచినను ఏ వ్యవహారమును ముందునకు సాగలేదు. పగలెల్ల ష్కారనేసి

తిని, దివ్వె తెమ్మా దిగనేయుదు నన్నట్లు ముందు నకు పోవుచున్నట్లు కనుపించుటయేగాని నిలచినచోటు నుండి కదలినది లేదు.

విమలకు గురుమూర్తిగారు సంబంధము కుదర్చెను. పెండ్లికొడుకు మదరాసులో నొక యుద్యోగి. ఒక పత్రికలో సహాయ సంపాదకుడు. అతని కాస్తి యేమియు లేదు. అతని సుగుణశీలములకు గురుమూర్తిగారి శిఫారసే నికషమైనది. ఆ విమల తాను పెండ్లికొడుకును చూడవలె ననలేదు. అతనిపేరు మోహనరావు. పెండ్లి రేపనగా మోహనరావు రైలు దిగెను. పెండ్లి పీటలమీదనే విమల మొదటిసారి యతనిని చూచెను. గురుమూర్తిగారే యటు నిటు సర్వపరిపూర్తి యయ్యెను. ఆయన మాటను విమలామోహను లిద్దరు దైవశాసనముగా పాలించిరి. ఈ వివాహమవధాని కిష్టము లేదు. అవధాని విమలతో తన కా సంబంధము నచ్చలే దనెను. విమల యన్నగారి వంక నొక చూపు చూచెను. ఆ చూపులో నవ్వో, అధికారమో, కోపమో, అంగీకారమో, ఏదో యొక భావము గోచరించెను. మరునిము సము నుండి యవధాని మోహనరావు నెడల

సుముఖు డయ్యెను. పెండ్లియైన తరువాత విమల యొక్క రెండు నెలల ప్రవర్తన యవధానిని విమల యెడ పూర్వముకన్న వందరెట్లెక్కువ సోదరీప్రేమబద్ధునిగా జేసెను.

విమల యొక దేవత. తా నొక యారాధకుడు. తన యదృష్ట మామె ప్రసన్నతాధీనము. ఆమె భ్రూభంగరేఖ తనకు శిక్షాపథము. గాలిగా పెరిగిన తన యుచ్ఛృంఖలతకు నామె కట్టుకొయ్య.

ఉన్నట్లుండి యొక నెలలో హఠాత్తుగా నన్నియు సిద్ధము చేసి యవధాని ఇంగ్లాండునకు సిద్ధమై పోయెను.

# ప్రతీక్ష

## ౧

మదరాసులో మాంబళములో నొక క్రొత్త గృహముండెను. అదియును మదరాసులో క్రొత్తగా కట్టిన సర్వగృహములవలె నిప్పుపెట్టెల పంపిణీ మీదనే కట్టబడెను. కాని ఏదో యొక విషయము అది తెలుగువాండ్రయిల్లు అని చెప్పుచుండెను. చాకలిపేటలో ముందు వసారా దించిన గచ్చరుగుల వానియున్న కొంత నగిషీపని గలిగిన పెద్ద

ద్వారముల కిరువంకల చిత్రించబడిన శంఖచక్ర
ములు, వీధినాటకముల నేలిన తరువళ్లికేణి పార్థ
సారథిముద్ర, చెన్నపురి రెండవ కొసదాక వంద
యేండ్ల క్రిందటివరకు చెడని యాయన ప్రభావ
మును చెప్పునట్లే - మాంబళము త్యాగరాజ నగరు
లలో నిర్మింపబడిన కొత్త యిల్లు, ముక్కుపుడకలు,
అడ్డబాస, తాటంకములు, జూకాలు బావిలీలు
మొదలైన సర్వశిరోనయవాలంకారముల చేత
వర్జితమైన హూణాంగనాముఖమువలె శరీరచ్ఛాయ
మాత్రమే యలంకారముగ నుండును. ఆ యిల్లు
నట్లే యుండెను. కాని వాకిట ముగ్గు, గడపకు
కట్టిన యెండిన మామిడాకుల తోరణము ద్వార
బంధమునకు గజమెత్తున రెండువైపుల బెట్టిన
పసపు కుంకుమలు - నిజముగా పసపు కుంకుమలే.
రంగులు కావు. గడపదాటి లోనికి పొమ్ము. ఒక
చాప వేసి దానిపై నొక జంబుఖానా పరచి
యున్నది. గోడల కానుకొనుటకు గుండ్రని దిండ్లు,
బాలీసులు నున్నవి. గోడలలో నమర్పబడిన యల
మరలలో సమృద్ధిగా పుస్తకము లున్నవి. చూచు
చుండగనే యిద్దరు పిల్లలువచ్చి పెద్దపని యున్నట్లు
అలమరలు తెరచి లోపలనున్న యొక బొమ్మల

పుస్తకము తీసి చూచుచుండిరి. ఆ పిల్లలు ఒకడు బాలుఁడు, ఒకతె బాలిక. బాలున కారేండ్లు, బాలికకు మూడేండ్లు. బాలుడు పుస్తకము తెరచి తన చెల్లెలికి బొమ్మలు చూపించుచు నిట్లు చెప్పుచుండెను: 'ఈ బొమ్మ యెవరిదో చెప్పు.' బాలిక చొంగతో తడిసిన తర్జనీ మధ్యమాంగుళులతో బొమ్మమీద గీసెను. బాలుడు చెల్లెలి వీపుమీద నొక్క చఱపు చఱచెను. అది యేడువ మొదలు పెట్టెను. బాలుడు తన చొక్కా ముందుభాగముతో నా తడి తుడుచుచుండెను. తల్లి యింటిలో నుండి వచ్చి, 'ఎందుకురా దాని నేడిపించుచున్నావు?' అనెను. బాలుఁడు బిక్క మొగము వేసి 'నీవు ఆడించమంటే ఆడించటానికి బొమ్మలు తీసి చూపిస్తున్నాను. మామయ్య ఫొటోగ్రాఫు తీసి చూపించాను. దానిమీద ఉమ్మి వేసింది. అందుచేత కొట్టేను.'

తల్లి:—ఆ పుస్తకం నిన్నెవరు తీయమన్నారు?

బాలుడు:—మామయ్య యింకా పదిరోజుల్లో వస్తాడంటివిగా!

తల్లి:—అంటే ఆ పుస్తకం తీసి నిన్ను పాడు చెయ్యమన్నానా.

బాలుడు:—ఊరికేనే బొమ్మ తీసి పాపాయికి చూపించాను.

తల్లి:—పాపాయికి చూపించడం అంటే కొట్టటం కాబోలు.

బాలు డేడువ నారంభించెను. తల్లి కొంచెము తీక్ష్ణమైన చూపును సుకుమారీకరించుకొని, 'సరేలే పుస్తకం పాడుచెయ్యకు'మని లోనికిఁ బోబోయెను. పసిపిల్ల వెంటబడెను. కొడుకు 'అమ్మా! మామయ్య దగ్గరనుంచి వచ్చిన ఉత్తరం నాకియ్యి. నేను చదువుతా' ననెను.

తల్లి:—మామయ్య ఇంగ్లీషులో వ్రాశాడు. నీ కేమి తెలుస్తుంది?

కొడుకు:—కూడపలికి చదువుకుంటాను.

తల్లి:—వాడు దొరదస్తూరీ వ్రాస్తాడు. నీకేమి తెలుస్తుంది?

బాలు డుత్తరమిమ్మని సన్నని గారాము చేసెను. తల్లి యా పెట్టెలో నున్నది తీసికొమ్మనెను. అతఁ డా యుత్తరము తీసి చదివినట్లు ఊరకే నాల్గు పుటల యుత్తరమును తిరుగవేసినదే తిరుగవేయుచుండెను. ఆ యుత్తర మానాడే వచ్చెను.

మోహనరావు ప్రొద్దుననే లేచి పత్రికాలయము నకు పోవును. సాయంతన మారుగంటలకు ఇంటికి వచ్చును. ఒకొక్కకప్పుడు సినీమాకుగాని యేదో యుపన్యాసమునకు గాని పోయినచో రాత్రి తొమ్మిదిన్నరకు వచ్చును. అప్పుడు మాంబళము బస్సు దొరకనిచో మరునా డాదివారమైనచో కాలికి బుద్ధిచెప్పును. కానిచో నే ద్రావిడాన్న విక్రేతకో స్థలము కొలది హెచ్చింపు తగ్గింపుల రేట్లు చెల్లించి పత్రికాలయముననే నిద్రపోవును. నాడు మోహనరావు పత్రికాలయమునకు వెడలి పోయిన తరువాత యీ యుత్తరము వచ్చెను. దాని తర్జుమా యిది:

'ప్రియమైన చెల్లెలా!

నా ఐ. సి. యస్. పరీక్ష పూర్తియైనది. నా వెనుకటి యుత్తరములో నేను బయలు దేరుట మూడు నెల లాలస్యము కావచ్చునని వ్రాసితిని. నన్ను వెంటనే బయలుదేరుమని యుత్తరువు వచ్చి నది. శతవిధాల నన్ను జయపూరడవులలో అసి స్టెంటు కలెక్టరుగా వేయుదురు. నేను మద్రాసు ప్రాంతములలో వేయవలసిన దని యడిగితిని. వచ్చిన

తరువాత నొక నెలవరకు నే నుద్యోగములో ప్రవేశింపనక్కరలేదు. నిన్ను చూచి ఏడేండ్లయి నది. నిన్నేమిటి? అందరను చూడవలయునని యున్నది. మోహనరావు నడిగినానని చెప్పుము. నీ కొడుకును కూతును నేనెరుగనే యెరుగను. వాండ్రు నేను పంపించుచున్న నా చిత్రపటములను చూచి యాడుకొనుచున్నారని నీవు నాకు వ్రాసిన ప్రతియుత్తరములోనను వ్రాయుచుంటివి. వాండ్రకు నేనేమి తెచ్చిపెట్టవలయునో తెలియుటలేదు. అయి నను నా మొగము వారెరుగరు. వారి మొగము నేనెరుగను. ఎందుకు తెచ్చిపెట్టవలయును?

ఇట్లు
ఎ. చతుర్వేది.

అవధాని ఇంగ్లండు పోయిన మొదటి రెండేండ్లు ఉత్తరముల చివర నవధాని యనియే దస్కతు చేసెను. తరువాత నిప్పటివరకు నింటిపేరునకే గౌర వాతిశయము కలిపించెను. ఇది ఋషి సంప్రదా యము. పైకి పాశ్చాత్య సంప్రదాయముగా కను పించవచ్చును. ఈవ్యాఖ్యానము మోహనరావుది. అవధాని యింగ్లండు పోయినతరువాత నాల్గవ యేట తెలుగుదేశాని కొక్కయుత్తరమైనను వ్రాయ

లేదు. తరువాత మరల వ్రాయ నారంభించెను. ఇన్నియేండ్లు నెల కొక యుత్తరముగా విమలకు వ్రాయుచునే యుండెను. విమలకు మొదటి మూడేండ్లు వ్రాసిన యుత్తరముల బాణీ వేఱు తరువాత మూడేండ్లు వ్రాసిన యుత్తరముల బాణీ వేఱు మొదటి యుత్తరములలో నవధానికి విమల పరమ ప్రియ సోదరి. తన వంశ గౌరవమునకు పతాక. తన ప్రేమ కాస్పదురాలు. తన గౌరవాధి దేవత. తన తండ్రియందు తనయందుఁ గల దోష ములు కప్పిపుచ్చిన వంశత్రాణము. తరువాత మూడేండ్లలో వ్రాసిన మొదటి యుత్తరములు వట్టి యోగక్షేమముల విచారణ. చివర చివరకు విమల భాగత దేశాత్మ. భారతస్త్రీశక్తి నిధా నము. దేవతా స్వరూప. విమలవంటి యోగ్య శీలలు పాశ్చాత్య దేశములలో నుండరు. తాను విమల కన్నగారుగా నుండుటకు పనికిరాడు. విమ లకు స్వేంద్రియములమీద నున్న యధికారము దేవతాశీలనికషప్రాయము.

అతని కింగ్లీషు భాషలోనున్న ప్రభుత్వము, పలుకుబడి తాత్పర్యార్థము మాత్రమే చెప్పదగినవి. అందలి మెలకువలు, చమత్కారములు మోహన

రావున కాశ్చర్యములు. అవధాని యింగ్లండులో నొకనాడు ఉపన్యాస మిచ్చెను. అతని యింగ్లీషు భాషా వైశారద్యమునకు దొరలే శహబాసనిరట. చెల్లెలికి వ్రాయుచు నత డిది వ్రాసెను.

నాల్గు నెలలవరకు రాడన్న యన్న పదిరోజు లలో వచ్చుననుట విమలకు తన పాతికయేండ్ల జీవితములో నెన్నడు నెరుగని యానందము నిచ్చెను. తాను కాకినాడలో నుండగా నిట్టివార్త వచ్చినపుడు నానందానుభూతి నెరుగని యామె మనస్సునకు నిట్టి యానంద మనుభవించు శక్తి యుండెడిది కాదేమో? అన్నగా రింగ్లాండు పోవు నప్పటికి విమల మనస్సున కానందస్పర్శ కలుగ లేదు. మోహనరావును పెండ్లియాడుట యొక జంత్రపు బొమ్మగా పెండ్లియాడెను. ఏదో, ఎట్లో పెండ్లి యగుటయే ధర్మమన్నట్లు పెండ్లికి నంగీకా రము కాని యంగీకారము నొసంగినది. మోహనరా వెక్కువ యందగాడు కాదు. ఆస్తి కలవాడు కాదు. తా నెందు కతనిని వివాహమాడుట కంగీక రించెనో ఆమెకే తెలియలేదు. గురుమూర్తిగారి మాటయందు గౌరవము చేతనా? తండ్రి తన భారము గురుమూర్తిగారిమీద పెట్టెను. అతని

మాట కంగీకరించుట తండ్రిమాట యంగీకరించుటయా? మోహనరావుతో నేడాది సంసారము చేసిన తరువాత విమల మనస్సులో లోకము వికసించెను. మోహనరావు కోపమన్న దెరుగడు. అతడు వడపోసిన సజ్జనత్వము. అతని హృదయములోని సర్వావకాశము తనచేత నిండియుండెను. ఓయి మోహనుడా! నీవదివరకు నన్నెరుగవు. నేను నిన్నెంత యెరుగుదునో నీవు నన్నంతయే యెరుగుదువు. ఎవరికో లోకమునందలి లౌకిక కాములకు దర్శనమువలన, పరస్పరగుణానుభవమువలన, సౌందర్యము వలన, ధనమువలన గలిగిన ప్రేమోదయము హఠాత్సంభవమని సహజోద్భూతమని యాడుకొందురు. నీ యెడదలో స్త్రీమూర్తి పరబ్రహ్మసబ్రహ్మచారియా? నియమితైకదేశప్రత్యేకలక్షణాభిమాన రహితముగా నేక స్త్రీయందు సర్వస్త్రీత్వము సమాహృతి నంది యదృచ్ఛాలబ్ధయైన స్త్రీయందు ప్రతిబింబించునట్టి దివ్యసంస్కార మొక్కడు నీ మనస్సులో పరిణతి పొందినది.

విమలకు పోను పోను మోహనరావు చిత్తసంస్కారము నాత్మపరిపాకము తెలిసెను. కొన్నాళ్ల

వరకు తన యిరువదివేలయందు మోహనరావునకు చూపుండెనని ఒకరిద్దరనగా విని తాను కూడ ననుకొనెను. తన తండ్రి తన కిరువదివేల యాస్తి వ్రాసి యిచ్చెనని మోహనరావునకు దన పెండ్లి యైన పదినెలలవరకు తెలియదు.

'నే నెవరినో తెలియకుండ నన్నెందుకు వివాహ మాడితిరి?'

'గురుమూర్తిగారు చెప్పినారు గనుక'

'గురుమూర్తిగారు మీ కేమగును?'

'ఆంధ్ర సారస్వతమునకు ఆయన యింజనీర్. నా కేమియు కాడు. నా కాంధ్రసారస్వతముమీద నభిమానము. అంతియే.'

'మీ వలె మఱియెవ్వరును పెండ్లాడరు.'

'నీవు డిటో.'

విమలకు మోహనరావు సుగుణములతోపాటు నతని వాక్చమత్కృతియు నానందదోహద ప్రాయములయ్యెను. మూడేండ్లద్దెయిండ్లలో నుండిరి. తన పదివేలు పెట్టి యిల్లు కట్టుటకు భర్త నొప్పించుటకు విమలకు తల ప్రాణము తోకకు

వచ్చెను. ఆ యిల్లు మోహానరావు పేర పెట్టుట యసంభవమైనది.

'మన మిద్దర మొకటి కాదా?'

'ఇదిగో శేషము' అని మోహానరావు కొడుకును చూపించెను. అప్పటి కతనికి మూడవ యేడు.

'అయినచో పిల్లవాని పేరున పెట్టెదను'

'ఆ పని మాత్రము చేయకు. నే ననరాదు కాని పిల్లవానికి బాలగండము లన్నియు తీరిన తరువాత పెట్టుము.'

'అయినచో మీరు నా యింటికి రారు.'

'ఆదివారము లన్నియు నిచ్చటనే యుందును. ప్రొద్దుననే పోదును. సాయంకాల మా రింటికి వత్తును.'

'సినీమాలు లేనిచో'

ఇంత హంగామా జరిగిన తరువాత మరల పోరి పోరి యేడాదిక్రింద నిల్లు మోహానరావు పేరునకు మార్పించెను. పిల్ల లిద్దరు మోహానరావు ముక్కులో నుండి యూడిపడినారు. విమలా మోహానరావులు పరస్పరాత్మప్రవిష్టులైన తరువాత విమలలో మార్పువచ్చెను. అదివరకు నవ్వని

విమల యిప్పుడు నవ్వును. అదివరకు విసుగన్నది యెరుగని విమల యిపుడు పిల్లలమీద విసుగుకొనును. అదివరకు కన్నెత్తి యెవరివంకను, దేనివంకను చూడని విమల యిప్పుడు సామాన్యముగ దృష్టిప్రసారమును కుంచించదు. ఒకనాడు రామారావుగారు విమలను చూచి పోవుటకు వచ్చెను. పెండ్లియైన తరువాత నాలుగేండ్లకు, అప్పటికి వీరిల్లు కట్టుకొనిరి. ఆయన వాకిట నిలబడి గుమ్మములో నిలుచున్న విమలతో మోహనరావుగారిల్లు ఇదేనా అని యడిగెను. విమల 'బాబుగారూ, నేనే, లోనికిరం'డనెను. ఆయన కాశ్చర్యము వేసెను. నల్లగా నుండి యిలకరచుకొనిపోయి నట్లుండువిమల యెఱ్ఱపడి పుష్టసర్వావయవయై యుండెను. ఆమె కన్నులలో నొక ధగ ధగ కనుపించెను. ఆమె నడచినప్పుడు అధిగతానందరేఖా విస్ఫూర్తి గోచరించుచుండెను. ఇది మోహనరావు విమలలో తెచ్చిన మార్పు. క్రమక్రమవివర్ధితమై, క్రమక్రమవికాసితమైన సాధు సంసార యోగ ఫలము.

పవలెల్ల విమల పిల్లలతో నింటిలో పనితో నిబ్బంది పడుచున్నను ఆనాడు ఆరు గంటలకు

భర్త రావలయును, అన్నగారి యుత్తరము చూపింపవలయునన్న యూహాధారాసాంతత్యము విమల యెడదలో తొలగిపోలేదు.

౨

పర్లాకిమిడి కళాశాల యున్న కొండమీది చెట్లు చిక్కని యాకు తోడికి గింగురుమనుచుండెను. పవలే చీకట్లు క్రమ్ముచుండెను. మబ్బులు కప్పి యూరంతయు పవలు పన్నెండు గంటలవరకు వాన కురిసి దినము సాయంకాలము నాలుగుగంటలకు నేమియు నెరుగనట్లు చక్కగా నెండ కాసెను. ఆ యూరికి శోభ కోటగుమ్మమునుండి కళాశాల కొండవరకు నున్న విశాలమైనవీధి. ఆవీధి కటునిటు నున్న యూరంతయు కిచాలైన యూరు. పురీ శాన్యదిశాగతమైన పెద్దసరస్సు, దాని కట్టవెంట కొంతదూరముపోగా నున్న కొండలును, సమున్నతైకాంతస్థలములు. ఆబాటవెంట కట్టెలమోపులు శిరస్సునందు పెట్టుకొని దివారాత్రము లొక్కటే వరుసగావచ్చు నర్ధనగ్నశరీరులైన సవరల స్త్రీ పురుషుల యపరిపుష్ట శరీరావయవసర్వతస్సమీక్షితాంతరస్థిపంజరములు కదలుచున్న బొమికల

ప్రోవులవలె కనుపించును. కాని చెరువుమీది కొండలమీది చల్లని గాలి హృదయంగమముగ నుండును. పాపము, సవర లచ్చట నంత చిక్క యుండురు కాని గిరిగుహాంతర బిలేశయములకు నా సమృద్ధమైన చలిగాలి యెంత పరిపోషకమో ఆ చెరువునీరు, ఆ కొండలగాలి చలిజ్వరములకు యంతసృష్టిప్రథమబీజములు. తద్గిరిగుహాంతరాళ విష సర్పములకుకూడ చలిజ్వరమువచ్చునో. వేయేండ్లు ముదిసిన వృద్ధసర్పము ముడుతలువడి విప్పారుటలో బిగియని పడగ ముడుతలలో గూడ చలిజ్వరపు చాయ యుండను. చలిజ్వరమాతయు సవరలనే యాశ్రయించియుండును.

ఒకనాటి సాయంకాలమున ముగ్గురు స్త్రీలు చెరువునకు సమీపమున నున్న కొండరాళ్లపై కూర్చుండిరి. ఊరు దాటినతోడనే రైలుమార్గము. ఆ కొండకు రైలుమార్గమునకు నడుమ మేర యంతయు పొలములు. ఈ పొలములకు చెరువు లకు నడుమ రాతిబాట. ఆ స్త్రీలలో నొకతె యిరువదియేండ్లు దాటినది. రెండవయామె కిరు వదియో, యిరువది దాటలేదో! మూడవయామెకు పదునారు పదునేడేం డ్లుండ వచ్చును, ముగ్గురిలో

పెద్దదియు, ముగ్గురిలో చిన్నామెయుకలిసి, రాతిపై కూర్చుండిరి. మిగిలినయామె వారికి కొంచెము దూరములో నొక రాతి మీద కూర్చుండెను. కొంచెముసేపు కూర్చుండును. మరి కొంచెముసేపు లేచి యటునిటు తిరిగి యేకొండపూవులో, కొండా కులో కోసికొని, దూసుకొని వచ్చును. బెత్తముల వలె పొడుగుగా పెరిగిన తీగలు కోసి, యాకులు త్రుంచి కొరడావలె చేతిలో పుచ్చుకొని వచ్చును. వచ్చి మరల రాతిపైని కూర్చుండి యా బెత్తము మొదట పుచ్చుకొని కొసతో నందుబాటులో నున్న రాళ్ళను చెట్లను స్పృశించుచుండును. పెద్ద యామె 'సీతా! బావ పదిరోజులలో వచ్చునట. నాన్నగారికి జాబు వచ్చినది' యనెను.

సీత 'నాన్నగారు నాతో చెప్పలేదేమి?' అని శారదవంక చూచెను. ఆ చూచుట నీతో చెప్పినా యన్నట్లుండెను. శారద యా మాట వినినంతనే తన మొగములో నొక కదలిక కలిగి నట్లు తెలిసికొని వెంటనే యా కదలిక నదుపులో పెట్టుకొనెను. తన వంక చూచుచున్న సీతవంక చూడనేలేదు.

లలిత:—బావ వచ్చిన నేమి? రాకున్న నేమి? దాని కేమి పట్టినది?

సీత:—నీకు, నా కెంత పట్టినదో దానికి నంతియే పట్టినది. మువ్వురకును మేనత్త కొడుకే గదా! అతడు ఐ. సి. యస్. పరీక్షనిచ్చి కలెక్టరుగా వచ్చుచున్నా డనగా బంధువు లందరి కానందము కాదా?

లలిత:—ఏమో నాకేమి తెలియును? దానికతని సంగతియే పట్టినట్లు లేదు. దాని వంక చూడుము. అది కలెక్టరును పెండ్లి చేసికొనునా? దానికి గవర్నరో, మరియింక నంతకన్నగొప్పవాడో కావలయును.

శారద కనుబొమలు ముడిచి యక్కగారివంక చూచెను.

లలిత:—మన రెండు కమ్మా. దానికి ముక్కుమూరెడు, సిగ బారెడు.

సీత:—బావ కింకను పెండ్లి కాలేదు కదా. ఎవరిని చేసికొనునో?

శారద:—మన ముగ్గురిలోనన్నా?

లలిత:—మన ముగ్గురిలో నైనచో తప్పక నిన్నే చేసికొనును. నీవు చాలా యందకత్తెవుకదా.

శారద:— అందరి యందము నొకటే రీతిగా నుండదు. ఒకరి యందము మొగములో నుండును. మరి యొకరి యందము మనసులో నుండును.

లలిత:— సరే, నాయందము మొగములో నున్నది. నీయందము మనసులో నున్నది. సీత యంద మెచ్చట నున్నది?

శారద:—నన్నడిగెదవేమి? సీత నడుగుము.

లలిత:—సీతా, నీయంద మెచ్చట నున్నదే. ఆత్మలో నున్నదా.

సీత:—ఈమాట లెందుకుగాని బావ యెప్పుడు వచ్చును? బావ పరీక్ష యయ్యెనా? కలెక్టరుగ నే ప్రాంతముల వేయుదురో.

శారద:—సామాన్యముగ నటవీప్రాంతములలో వేయుదురు.

సీత:—ఇది యంతయు నడవియే కదా.

శారద:—అడవియు, అడవి మృగములును.

లలితకు కోపము వచ్చెను. ముగ్వురును కొంత సేపు మాటాడకుండ కూర్చుండిరి. ప్రొద్దు క్రుంకెను. సంజ వెలుగురేక లన్యోన్య ప్రతిస్పర్థులవలె యొక రేకకన్న యొక రేక కెంజాయ లలముకొను చుండెను. ఎఱ్ఱని సంజతరణికాంతి కొండనీడలు

పడినంత మేర మిశ్రితారుణశ్యామలకాంతులై యొదిగీ యొదుగని కోపభావముగా బరిణమించెను. దూరాన ఊరి ప్రక్క చెరువు కెరటాలమీద నీటి ప్రబ్బలులు పూచినట్లుండెను. చెరువు క్రింది సాగు వరిచేల వామనమైన సస్యకాండాలి తుదలు మెలివెట్టిన కంటికోసల మాందాళి పిసాళింపులవలె జగాజిగులు పోయెను. నడచుచున్న ముగ్వురు అక్కసెల్లెండ్ర నడచుచున్న వేగమున నటునిటు వ్రాలిన పావడా కుచ్చెలల తొలగుదల కలిగిన నిముసములలో పాంజేబు పట్టాలకు కనకమయాభరణభ్రాంతి కల్పించుచుండెను. తైల సంస్కృతి లేక యాధునికనాగరికతా సమనుప్రాప్తములైన శృంగారలేపనాంజన పరిసంస్కృతములైన పొడి పొడియైన శిరోజములపై లేచిన యొకటి రెండు తలవెండ్రుకలలో గ్రుచ్చియెత్తుకొన్న యెఱ్ఱ సంజ వెలుగులు శృంగార సామ్రాజ్య పట్టమహిషీ చిహ్న కనకమయాల్పతర కిరీటచ్ఛాయా భ్రాంతి కల్పించెను. వారి చీరలచెంగులు అనురక్తుడైన ప్రియుడు సమాకర్షించినట్లు తదీయహృదయాంతర రాగచ్ఛటాభివ్యాప్తి కలిగినట్లు గులాబీరంగులు ప్రకటించెను. ముగ్వురు మాటాడకుండ నడచిరి.

సీత వారిద్దరిని పలుకరించుటకు చేసిన రెండుమూడు ప్రయత్నములు విపరీతానుకూల్యతాడిముతై యొత్తి గిల్లెను.

లలిత తాను గృహమునకు బోయినంతనే దీపము వెలిగించి చదువుకొన నారంభించెను. ఆమె యింటర్మీడియేట్ రెండవ సంవత్సరము చదువు చుండెను. మొదటియేడే తప్పవలసినది కాని పైకి వేసిరి. ఆమె యవధాని పరదేశ మేగిన యారేండ్లును అవధానిమీద యాశ పెట్టుకొనెను. అతడు పోకముందు నాలుగైదు నెలలు మెరిపించిపోయెను. తమ యింటిలో తా నతని భార్యగా నలుగురు నాడిరి. అత డా రోజులలో నా ప్రసంగము వారించ లేదు. అతడును తానును పది పదునొకండుసారులు వాహ్యాళిపోయిరి. అప్పుడతడు చెప్పిన మాటలు ప్రతిదియు తన్నతడు ప్రేమించినట్లే యుండెను. శారద యందక త్తె కాదనెను. అతని కామెమీద నిష్టము లేదన్నమాట. అతనికి సీతమీద లేదు. సీత నాటికి పసిపిల్ల. అతడు పరదేశములకుపోయిన మొదటి మూడు సంవత్సరములును తనకు నాలు గైదు లేఖలు వ్రాసెను. తరువాత వ్రాయనిమాట నిజమే. అతడు చదువులలో పడియున్నాడు. అచ్చ

టనే ప్రవేశపరీక్ష నిచ్చి, అచ్చటనే ఐ. సి. యస్. చదువుట సామాన్యమానవుడు చేయదగిన పని కాదు. చదువు నొత్తిడిచేత తనకు వ్రాయలేదు గాని మరియొక్క విషయము కాదు. నాలుగేండ్ల క్రింద వ్రాసిన యుత్తరములన్నియు తనవద్ద భద్రముగా నున్నవి. లలిత వాని నెన్నిమార్లు చదివెనో తెలియదు. మరల వానిని తీసెను. పెట్టె యట్టడుగున సిల్కుజాకెట్ల క్రింద క్యాలికోబైండు చేసిన అట్ట తీసెను. దానిలో నాయుత్తరము లుండెను. ఆయుత్తరములలో కొన్ని వాక్యములు లలిత యెఱ్ఱసిరాతో క్రీగీట్లు పెట్టెను. కొన్ని వాక్యములకు నక్షత్రముల గుర్తు పెట్టి కాగితము వెనుక వైపున తాను కొన్ని సమాధానములు వ్రాసెను. అవి యన్నియు మఱల మఱల చదివెను. అవధాని లలితకు వ్రాసిన యుత్తరములు తెలుగులో వ్రాసెను. అతని తెలుగు వానకాలపు తెలుగు. ఆ తెలుగులో వర్ణక్రమములు, అన్వయములు ఉండవు. అది గ్రాంథికము కాదు. వాడుకభాష కానేరదు. ఆ భాష కొక్కటే పోలిక. సూటు బూట్లు వేసికొన్న నీగ్రోవాని వంటిది. కారునలుపు దేహచ్ఛాయకును క్రాపింగునకు నేమిసంబంధము?

కారుసలుపు శరీరములకును గౌనులకు నేమి సంబంధము? పాముకుబుసమువంటి యొడళ్లు కల పాశ్చాత్య స్త్రీల శరీరము లెంత కనిపించిన నంత యందము. తదితర దేశ స్త్రీల శరీరములు రంగు రంగు చీరలచే నెంత సమాచ్ఛాదితములైన నంత యందము. కాని లలిత మనస్సునకీ వివక్షలేదు. ఆమెకు తెలుగు బాసలో విపరీతపు వాక్యవిన్యాసము విపరీతమో సులలితమో తెలియదు. దానిని గూర్చి విచారణ లేదు. అది బావవ్రాసిన యుత్తరము. ప్రత్యక్షరము లలిత హృదయములోని నెత్తురు బిందువువలె నుండెను.

లలిత భోజనమునకు రానిచో నెవ్వరును పిలువరు. ఆమె యీ లేఖలను చదివి చదివి మరల పెట్టెలో పెట్టెను. తనగదిలో మంచముపై బరుండి కొంతసేపు శారదమీద కోపము వహించెను. కొంతసేపు సీతపై నసూయపొందెను. అట్లే యుండి యుండి నిద్ర పోయెను. రాత్రి రెండుగంటలకు మెలకువ వచ్చెను. ఆకలి యయ్యెను. అందరును నిద్రపోవుచుండిరి. తనపెట్టెలోనున్న నాల్గుబిస్కట్లు తిని మంచినీరు త్రాగి మరల బండుకొనెను. బావ న్నాలుగేండ్లనుండి మరల తన కేల యుత్తరము

వ్రాయలేదు? నేడు తన తండ్రిపేర నుత్తరమేల వ్రాసెను. తనమీద ప్రేమయే లేనిచో తన తండ్రి కన నుత్తరమేల వ్రాయును. తా నింటర్మీడియేట్ చదువుచున్నది. అందకత్తె. అన్నివిధముల నతనికి తగిన భార్య.

మరల నాతనికు నిద్ర పట్టెను.

శారద యింటికిం బోయెను. పోయినంతనే చర చర వడమటింటి లోనికిం బోయెను. ఇంటిలో ఆమె నాయనమ్మయును, మేనత్తయు నిద్దరును వంటకత్తెలు. నాయనమ్మ ముసలిది. ఆమె యల్లె క్రిందపడుచు లేచుచు వంటచేయును. ఒకప్పుడా ముసలిది, మరి యొకప్పుడు మేనత్తయు వంట చేయుచుందురు. ఆ యింటిలో మరిగొకరు వంట చేయుటకు వీలులేదు. తక్కిన వా రెవ్వరికి మడి లేదు. వారిద్దరికే మడి. తక్కినవారందరు కొందరు ప్రొద్దుననే స్నానము చేయుదురు. తక్కినవారు భోజనమునకుముందు స్నానముచేసి కంచముముందు కూర్చుందురు. కాఫీలుమాత్రము మడికానివారే కాచుకొందురు. మడికానివా రెవ్వరు? లలితా శారదల తల్లి. అప్పుడప్పుడు లలిత. వేరొకప్పుడు సీత. శారద యీ యింటిలో రాచపోకిళ్లమారి.

ఆమెకు వేళకు కాఫీ లేనిచో, తగిన సమయములో నన్నము సిద్ధముకానిచో నామ్ములు ధూములు చేయును. ఆమె యీ కోపమే కొంపలో పెద్ద శిక్ష. ఆ శిక్ష చాలనిచో భోజనమునకు రానని, చేయనని, యాకలి లేదని మూడు ప్రీవీకౌన్సిలు తీర్పులు కలవు. అవి మూడును బ్రహ్మాస్త్రము, బ్రహ్మశిరోనామాస్త్రము, పాశుపతాస్త్రము. వానితో భూమ్యాకాశములు తలక్రిందు లగును. కులపర్వతములు కదలాడును. సప్తపాథోధులు సళపెళ కాగును. నాయనమ్మ, మేనత్త, తల్లి, తండ్రి యొకరితరువాత నొకరు వచ్చి బతిమాలి, బామాలి ఒక చిన్న నగయో, అంతకు ముందొక వారము పదిరోజులలో శారద తనకోర్కె వెల్లడించిన ఒక వస్తువును కొని యిత్తుమని వాగ్దానము చేయుటతో రాజీ కుదురును. ఆమె తన యభియోగము నెత్తివేసికొనును.

శారద వచ్చుచునే వంట యైనదా యని యడిగెను. ఆపూట వంటచేసినది మేనత్త. ఆమెకును నాయనమ్మకును కొంత భేదము కలదు. వారి ధోరణులే వేఱు. నాయనమ్మ మనుమరాండ్రను

బతిమాలుకొనును. సముదాయించును. వారి యధి
కారమునకు లోబడి మాటాడును.

'అమ్మా ముసలిదానినే. తల నొప్పిగా వుంది. ఆలస్యముగా మడికట్టుకొంటిని. నీవు స్నానము చేసిరా, ఇంతలో పూర్తియగును' అనియొకప్పుడు; 'బంగారుతల్లులు-షికారు వెళ్లి వచ్చినారు కాబోలు. కడుపులో నప్పుడే యెలుకలు దూరినవి' అని చిబుకము పట్టుకొని ముద్దాడుట లొకప్పుడు. మేనత్తతరహా యిదికాను. ఆమె వంటమైనచో భోజనమునకు రమ్మనును. లేనిచో నాగవలయు నని చెప్పును. మేనకోడండ్రు కోపించినచో నామె కూడ తన భారతమును విప్పును. 'పనియా పాటయా, వేషాలు వేసికొనుట. ఊరివెంట బలా దూరు పోయివచ్చుట. చదువులు, ఉద్యోగములు చేయుదురో, ఊళ్లేలుదురో? రేపు మగలు వచ్చిన తరువాత వంటవానిని పెట్టి చేయించుకొనుడు, ఆ వంటవానికి జబ్బుచేసినచో నేమిచేయుదురు ? రామ రామ. గిద్దెడు బియ్యము పొయ్యిమీద పెట్టి దింపుకోలేరు. ఎన్నాళ్లు చేసినను, నేనును ఆ ముస లిదియును చేయవలయును' అని సాదించును. దానికి మేనకోడండ్రొక్కొక్కప్పుడు 'యీమాత్రపు

వంట మేమును చేయగలుగుదుము. మేము చేసి నచో మనకు పనికిరాదుకదా' యందురు. ఆమె 'యీజన్మకు నేను మాలకూడు తినను. రేపు మీ మగలకు చేసిపెట్టుడనును.

ఒక్కొక్కప్పుడు సాఫీగా నిట్లు సాగిపోవును. మరియొకప్పుడు వాద ప్రతివాదములలోఁ గారము బలిసినచోఁ దండ్రివచ్చి యప్పగారిని కోపపడును. అప్పుడు కొంచెములో తేలిపోవును.

ఈనాడు శారదవచ్చి యడిగినంతనే వంట కాలేదు. మేనత్తతో వివాదము లేకుండ శారద పోయి గదిలో లోన గొళ్లెము వేసికొని పండు కొనెను. ఆమె మనస్సులో గోపముగా నుండెను. ఈనాటి కోపమునకు వంట కేకపోవుటకుఁ గార్య కారణ సంబంధము లేదు. అది చెరువుగట్టునుండి వెంటఁ దెచ్చుకొన్న కోపము. కొంతసేపటికి తల్లియు, తండ్రియు, నాయనమ్మయు వచ్చి తలుపు తీయుమని బతిమాలిరి.

అట్లొక గంటసేపు జరిగిన తరువాత దాని నైష్ఫల్యము తెలిసి వారి దారిని వారు పోయిరి. శారద యొక గ్రంథమును తీసి చదువ నారంభించెను. ఆమె యింటర్మీడియేట్

మొదటి సంవత్సరము చదువుచుండెను. తరగతి పుస్తకములు చదువబోగా నామెమనస్సు వాని మీద నిలువలేదు. పాఠ్యగ్రంథము కాసి యొక నవల తీసి చదువుచుండెను. వారి తండ్రి విజయ నగరము పోయినపుడెల్ల ప్లాటుఫారముమీద బుక్ స్టాలులో నెనిమిదణాల చౌకపారు నవలలు కొని తెచ్చుచుండును. అపరాధ పరిశోధక నవలలు, ఖూనీ నవలలు, అమెరికాలోని పశువుల కాపరులం గూర్చిన నవలలు—ఇవి.

శారద యట్టినవల యొకటి తీసి చదువనారం భించెను. రెండు పుటలైనతరువాత తా నక్షర ములు కన్నులతో చూచుచుండెనే కాని యర్థ మును మనసుతో భావించుటలేదని తోచినది. మరల మొదలుపెట్టెను. మరల నట్లేయయ్యెను. ఆ పుస్తకము పారవేసి మరియొక పుస్తకమును తీసెను. ఆ పుస్తకమును మొదలే పెట్టలేదు. పుస్త కము ప్రక్కమీదనే యుంచి యాలోచింప నారం భించెను.

తాను నిజముగా నందకత్తెకాదు. మూడేండ్ల క్రిందట బావ తనకొక యుత్తరము వ్రాసెను. ఈ యేడేండ్లలో తన కతని వద్దనుండి వచ్చిన

దొక్కటే యుత్తరము. తాను బావను ప్రేమించి నదా? బావ యనినచో మనసులో మిక్కిలి యిష్ట ముగా నుండును. కాని యతడు లలితకు భర్త యగుట తమ యింటిలో నందరు ననుకొనుచున్న విషయము. కనుక నామె కతనిమీద మనస్సు లేదు. లేదనుటకు వీలులేదు. ఇంగ్లండులో ఖర్చు పెట్టినపాతికముప్పదివేలుపోయినను, మిగిలినయాస్తి యేబదివే లుండును. పైగా కలెక్టరుగా వచ్చుచుం డెను. సహజ పరిస్థితులలోఁ దన యక్కగారికై నిర్దేశింపఁబడిన పురుషునిమీద నేచెల్లెలికిని మనస్సు పుట్టదు. కాని లలితాశారదలమధ్య ప్రకృతుల భేదము చేతను, వయస్సులోని తారతమ్యము తక్కువ యగుటచేతను, లలిత యెప్పుడు సూటి పోటిమాట లనుటచేతను, శారద కామె యందు గౌరవభావము లేదు. అప్పగారనిన యూహ లేదు. నిజమునకు అవధాని పరదేశములకు పోకముందు తమయింటికి వచ్చుచు పోవుచున్న కొన్ని నెలలలో నామె కతనిమీద కొంత యనురాగము కలిగిన దనియే యామె యిప్పు డనుకొనుచుండెను. తన యందలి యతని ప్రవర్తనయు నదియొక విలక్షణ ముగా నుండెను. తనతో వాహ్యాళికి పోలేదు.

తనతో ఎక్కువ ప్రసంగించలేదు. తానే ప్రసంగమున కెడమీయలేదు. కాని తననుగురించి బావ తా నందగత్తె కాకపోయినను తానలభ్యయగుట, ప్రసంగ సులభ కాకుండుట, మృదుసమాకృష్టత తనకడ లేకుండుట, లభింపచేసికొనుటకును, ప్రసంగ ప్రసన్నురాలిని చేసికొనుటకును, ఆకర్షించుటకు ప్రయత్నించినట్లును లీలగా నామెకుతోచెను. నాలుగేండ్ల క్రింద వ్రాసినయుత్తర మా భావముల దృఢపరచెను. శారదయు నాయుత్తరమును లలిత తనయుత్తరమును పట్టుతాపితాలలో మరగుపరచినంత భద్రముగా కాకపోయినను భద్రపరచినట్లే జ్ఞాపకము. ఆమె లేచి పెట్టెయంతయు వెదకెను. ఉత్తరమందులో లేదు. ప్రాంత యుత్తరములు గ్రుచ్చిన తీగలో కల యుత్తరములన్నియుఁ బరిశీలించి చూసెను. వానిలోనను లేదు. ఎచ్చట నున్నది? తన పుస్తకములలో నెచ్చటనైన దాచితినేమోనని ప్రతి పుస్తకమును పుటయు పుటయు విదలించి చూచెను. కనిపించలేదు. చివరకు నాలుగేండ్ల క్రిందటి తన దినపత్రికలో హాో డైరీలో అట్టలో నున్న కాగితపుజేబులో దొరికెను. ఉత్తర మిట్లున్నది:

'ప్రియమైన శారదా!'

నీకు జాబు రాయటమంటే భయంగా వుంది. వీడు యెందుకు నాకు రాయటం అనుకుంటా డేమో. (అనుకుంటావేమో అనుటకు బదులు.) నీవు బంగారపు ఉన్నివి. (గోల్డెన్‌ఫ్లీస్.) నేను జాసనును యగుదునా. నన్ను మరచిపోకు.

ఇట్లు-నీ బావ,

**అవధాని.**

ఇదే యుత్తరము. ఈజాబునకు తలయుకాని తోకయుకాని కలదో లేదో! ఉన్నచో తనకు తెలిసెనో లేదో. ఈ యూహాలలో లాంతరు నూనెలేక కొడిగట్ట నారంభించెను. కొంతసేపటి కారిపోయెను. గర్వితురాలైన శారద తలుపుతీసి యింటిలోవారిని దీపముకోసము పిలువలేదు. అట్లేనిదురపోయెను.

సీత యింటికి వచ్చెను. లోనికి పోయిచూడగా మేనత్త వంటచేయుచుండెను. నాయనమ్మ యొక గదిలో మంచము వేసికొని పండుకొనెను. ఆమె నాయనమ్మవద్ద కూరుచుండెను. కన్ను మూసు కొనియున్న యా వృద్ధురాలు కనుతెఱచి చూచి

సీతయని గ్రహించి, 'అమ్మా భోజనము చేసినావా' యని యడిగెను.

సీత:—వంట కాలేదు.

వృద్ధురాలు తన ముడుతలు పడీపడని చేతితో సీత రెండుచెక్కిళ్ళపై చేతులువేసి నిమిరెను. అట్లు కొంతసేపు కూర్చుండగా మేనత్త భోజనమునకు రమ్మని పిలచెను. సీత భోజనమునకు లేవబోవు టయు, శారదను భోజనమునకు పిలుచుచు తలుపు తట్టుటయు, నామె రాకపోవుటయు, శాదని నిర్ధారణ మైనతరువాత నలుగురు భోజనమునకు వచ్చుటకు నొక గంటసే పాలస్యమైనది. అప్పటికి రాత్రి తొమ్మిదిగంట లయ్యెను. ఆమె పినతండ్రి వివేకానందుడు భోజనముముందు కూర్చుండి తన కూతుండ్రడ చిల్లి ఖజ్జాలు, బుల్లిబుల్లి కోపాలు వస్తువుగా నొక యుపన్యాసము ప్రారంభించెను. అతని భార్య శాంతమ్మకూడ అందులో జోక్యము కల్పించుకొనుచుండెను.

వివేక:—సీతచూడు, బంగారుతల్లి. దానికి కోపములు, తాపములు లేవు.

శాంత:— పిల్లలను మీరే పాడుచేయుచున్నారు.

మేనత్త:—దాని దుంపతెగ, కొంచెము కాక పోయిన కొంచెమైనను అదుపులో పెట్టుకొనరా యేమి? నాకెందుకు. నేను ఏమన్నను ఊరు ఉరిమి మంగలము పైనిపడును.

శాంత:—ఇప్పుడేమి మునిగిపోయినది. వాండ్రకు నిజముగా నాకలియగుటలేదు కాబోలు.

వివేక:—ఎందుకు కాదు? కోపాలు వచ్చి గదులు విడిగానున్నవికదా యని బిడాయించుకొని కూచుందురు. ప్రతిదానికి నీవేమో పెద్దఒత్తాసు.

శాంత:—ఒత్తాసు కాకపోయినచో పిల్లలను చదువు మాన్పింపుడు. ఏ రెండవ సంబంధము వానికో, పండ్లూడిన వానికో కట్టిపెట్టుడు.

వివేక:—అట్లు కట్టిపెట్టుడు నని నేనన్నానుటే? పిల్లలకీ చిట్టిచిట్టి కోపాలు పనికిరావని నేనను చుండగా నేదో యప్రస్తుతముగా మాటాడెదవేమి?

శాంత:—ఔను. నే నేదన్నను తప్పే. మీరును మీయప్పగారును మీ యిష్టము వచ్చినట్లు చేయుడు. ఈ యింటిలో నాకేమున్నది. అధికారమా, చట్టుబండలా?

మేనత్త:—నే నేమన్నా నే శాంతా. నామీద పడిపోయెదవు.

శాంత:—అదిగో, కృష్ణా గుంటూరు జిల్లాల మాటలు.

మేనత్త:—అందర మా జిల్లాలవారమే. ఏదో నా తమ్ముళ్లకు పదిరా ళ్లీ ప్రాంతాలలో దొరికినవి గనుక యిచ్చట చేరినాము. ఇంతకూ వాడుగూడ కులాసాగా నున్నచో నీ తిప్పలు లేకపోయెడివి. వాని కింతకూ నేలమీద నీళ్లు ప్రాప్తిలేవు. వాని దారిని వాడుపోయెను.

సీత తండ్రి మైదేండ్ల క్రింద చనిపోయెను. అతడు గుంటూరులో మరణించెను. సీతతల్లి యామెకు చిన్ననాడే పోయెను. అప్పు డాయన పర్లాకిమిడిలో తమ్ముని యున్నచోట నుద్యోగము సంపాదించి యిద్ద రన్నదమ్ములు నొక చోటనే యుండిరి. సీతను నాయనమ్మ చేతులలో పెట్టి పోషించుకొనుచు వచ్చెను. సీత యప్పగార లిద్దరు నప్పటికి క్రొత్తగా కాపురమునకు పోయిరి. ఈ రీతిగా సీతభారము పినతండ్రిమీద పడెను. సీత తండ్రిబాపతు ప్రావిడెంటు ఫండు రెండువేల రూపా యిలును, ఇన్సూరెన్సు ఒక రెండువేల రూపాయ

లును, తండ్రి యామెకు మిగిల్చి యిచ్చిపోయిన యాస్తి. ఆ నాల్గువేలును వివేకానందుని వద్ద నుండెను.

మేనత్త చిన్నప్పుడే విధవరాలయ్యెను. ఆమె మొదటి నుండియు వివేకానందుని యింటిలోననే యుండెను. అందుచే నామెకు అన్నగారియందు కన్న తమ్ముని యందును, తమ్ముని సంసారమందును నభిమానము మెండు. వీరి సంసారమునకు సంస్కారాభిలాష మొదటినుండియు లేదు. లలిత పుట్టుట మొదలు వారిసంసారములో మతాభిప్రాయములలో మార్పువచ్చెను. అప్పుడు వివేకానందుడు రాజమహేంద్రవరములో కొన్నాళ్లుద్యోగము చేసెను. కాకినాడ కళాశాలలో మరి కొన్నాళ్లుండెను. ఆ దినములలో నతనికి బ్రహ్మసమాజపు భావములేర్పడి క్రమముగా వృద్ధిపొందెను. అంతకు పూర్వమే భవానిని సోమశంకరముగారి కిచ్చిరి. చెల్లెలి వద్ద నుండవచ్చునని కొంత యూహతో కాకినాడలో నతడుద్యోగస్వీకరణ చేసెను. కాని యత్తని బ్రహ్మసమాజ భావములు పిఠాపురములో సమసించలేదు. అందుచే నతడు పర్లాకిమిడి పట్టెను. అన్నగారు పోయినంతనే సీత

భారము తనమీద పడుట వివేకానందునకు సగ మిష్టము, సగ మనిష్టము. శాంతకు నిష్టానిష్టములు లేవు. కాని భర్త సీతయందు ప్రేమగా నుండు చున్నాడు గనుక తాను గూడ ముభావముగా నుండెను. సీతను కుసుమితను, అవివాహితగా నుంచుట మేనత్తకుగాని, తల్లికిగాని యిష్టములేదు. ఆనాల్గువేలతో నొక సంబంధముచూచి యామెకు పెండ్లి చేయుమని వారిద్దరు పదే పదే చెప్పిరి. కాని వివేకానందునకు నచ్చిన సంబంధము రాలేదు. ఐనను ఏకగర్భ జనితలు కాకపోయినను పెద్దపిల్ల లకు కాకముందు చిన్నదానికిఁ బెండ్లి చేయుట యెందుకని యాయన యుద్దేశము. అందుచే నిజము నకు తగిన ప్రయత్నము చేయలేదు.

సీతకు, తన కూతుండ్రకు ప్రకృతులలో, నల వాటులలో భేదము లున్నవి. సీతకు తనతండ్రి పోయెనని తాను తన పినతండ్రిమీద నాధారపడి యుంటిననని అది యొకరీతిగా పరాయి యిల్లని మనసులో భావము. ఆ యింటిలో నామె మిక్కిలి చనవుగా నొక్క నాయనమ్మతోనే యుండును. మేనత్త సీత నెక్కువప్రేమగా చూడదు. సీతయు నామెను మిక్కిలిగా పలుకరించదు. ఆమెచనవు

ఆమెగారాబము, నాయనమ్మవద్ద. కొంత చనవు పినతండ్రివద్ద. లలితా శారదలతోఁ గలసియుండు టయే కాని యెక్కువ కలుపుగోలుతనము లేదు. అసలు పిల్లయే యొకరీతి. ఆమె స్కూలుఫైనలు చదువుచుండెను. కళాశాలలో గాని, పాఠశాలలో గాని చదువు బాలికలమీద తోడి విద్యార్థులకు బహువిచిత్ర భావసంకరములైన భావములుండును. ఒకతె నడక, చూపు, కామోద్రిక్తములని, మరి యొకతె గడుసరియని, యింకొకతె ప్రతారణ పరురాలని యిట్లనేకము లనేకములు. సీతనుగూర్చి తోడి విద్యార్థులుగాని, యుపాధ్యాయులుగాని యొక్కటియే భావింతురు. ఆమెకు పదునేడేండ్లుం డినను, ఆమె మనస్సులో స్త్రీత్వభావన లేదు. కాముకీత్వము లేదు. ఆమె నవ్వినచో అచ్ఛమై, యకలుషితమై, మనుష్యసహజమైన నవ్వుకాని, యా హాసము పరభావసూచి కాదు. ఆమె వేసి కొను దుస్తులే లలితాశారదల దుస్తులకన్న భిన్న మైనవి. ఆమె యెప్పుడును సామాన్యములైన చీరలే కట్టును. వాయిల్ గుడ్డలు, లేసు అంచులు, కక్షభాగమాత్ర పరివ్యాప్తములైన రైకచేతులు నామె యెరుగదు. మొగమునకు పౌడరు లద్దదు.

ప్రక్క పాపట తీయదు. చెవులకు వెలతక్కువ లోల
కులు, భుజస్పర్శులు పెట్టదు. పాంజేబులు లేని పాద
ములతో తిరుగదు. చేతులకు రెండు బంగారు
గాజులే కాని రంగురంగుల గాజులు తొడుగదు.
నడచినచో అంచనడక యనికాని, గజగమనమని
కాని, యొయ్యారపు నడకయనికాని పేర్కొనుటకు ఏస్ఫూర్తియు
నుండదు. అందుచేత నామెయందు సౌందర్యము
లేదని చెప్పరాదు. ఆమెయం దొక సౌందర్య
మున్నది. ఆ సౌందర్యము ప్రతినేత్రమును సమా
కర్షించదు. కుత్సితభావములను రేకెత్తించదు.
అల్పమై, అధఃకృతమై, నీచమైన భావములు సహజ
ములైన యువకు లామెవంకనే చూడరు. ఉదాత్త
లమై, సుకుమారమై స్త్రీగౌరవభావ మెరిగిన
యువకు లామెవంక చూతురు. చూచి తమ చెల్లెం
డ్రను చూచినట్లు చూతురు.

ఈ యామె రూపము సీతా హృదయగత
భావములకు నుపోద్ఘాతము. ఆమె మనస్సులో
తాదృగ్వయోవతియైన బాలికకున్న భావములు లేక
పోలేదు. ఆమెకును నవధానిపైని యూహ కలదు.
అది ప్రేమయగునో కాదో యామెకే తెలియదు.
ఆ యూహలు హిమాలయశిఖరమువంటి యుత్తా

లత్వము కలదు. ఝుంఝామారుత తాడిత సముద్ర మహాతరంగమువంటి యుత్తాలత్వము కాదు.

ఏడేండ్ల క్రిందటి యవధానిగతభావము సీత యెడదంగో తన యనుభవముచేత నిర్మించుకొన్నది కాదు. ఇంటిలోనినలుగురుననుకొనుటవలనకలిగినది. ఆగృహములో నప్పటప్పటికి ప్రసంగములతో స్త్రీకి స్వయముగా వరు నెన్నుకొనుటలో స్వాతంత్ర్యము కలుగవలెనను‌ట వినిపించుచుండును. స్వయంవర మనునది యెట్లుండునో యామె మనస్సునకు తెలియదు. పతి యన్న భావము మనసులో గలదు. ఒకనిని పతిగా నెన్నుకొనుట యెట్లు? పతిని ప్రేమించవచ్చును. ఒకనిని ప్రేమించి పతిగా స్వీకరించుట యెట్లు? లోకములో పురుషు లనేకు లున్నారు. తన కీడుజోడైనవానినే పతిగా నెన్నుకొనవలసి వచ్చినచో నా యీడుజోడైనవారు పలుమంది కలరు. చాలమంది దర్శనీయులే. అందులో నెక్కువమంది తెలివికలవారే. చాలమంది శాస్త్రులుండును. ఇందొక్కనిని తనకు యోగ్యుడని నియమించుకొనుట యెట్లు? ఒకనితో నెక్కువ పరిచయము కలిగినచో నా పరిచయము వృద్ధియై ప్రేమగా కనుపించునా? అతడే సర్వేతర పురుషుల

కన్న తనకు పరమయోగ్యుడని, తన్ను దా వంచించు కొనుటయా? పరమార్థమైన విషయమా? పది మంది స్త్రీలు పదిమంది పురుషులను ఎవరికి వారు సర్వోత్కృష్టులుగా భావింతురు. ఇవి వారి వారి ప్రకృతుల బలమా? యాథార్థ్యమా? సీత కీ విష యమునందు భావనాపరంపరయేగాని యనుభూతి లేదు. ఆమె ప్రకృతి యనుభూతిముఖమై లేదు.

ఒక నిలచియున్న ప్రవాహము నిమగ్నమై యున్న యెడకు సహజముగా పోయి యచట మరల పడియకట్టుటయే తెలిసిన ప్రకృతి యామెది. అంతరుజ్వలద్బడబాముఖవహ్నివిధూతమైన పొంగు లొలసి యందరాని మెట్టలందుకొని యచట తనకు తగిన పల్లమున్నచో నిలుచును. లేనిచో ప్రతి జల బిందువు వెనుకకు మరలించుకొను సముద్రతరం గము వంటి ప్రకృతి కాదు. ఆమె ప్రకృతిని చూచి శారదకు నిరాదరణ. లలితకు పరిహాసము. ఇం టిలో నందర కామె పసిపిల్లగానే కనుపించును.

ఆనా డామె భోజనముచేసి కొంతసేపు దీపము వద్ద కూరుచుండి పండుకొనెను. ఆమెకు వేరే గది లేదు. ఇంటిలో నున్న రెండు గదులును లలితా శారదల యమలులో నుండును. వివేకానందుడును

శాంతయు వృద్ధులు కాకపోయినను వారికిని గది లేదు. సీత కొంతసేపు లలితా శారదలను వారి యూహలను గూర్చి పరిభావించెను. అవధాని యంత స్పృహణీయుడా? కావచ్చును. అతడు లలితను పెండ్లియాడును. అతడు వచ్చి లలిత తన కక్కఱలేదనునేమో? అప్పుడు తన పినతండ్రి తన్నతని కిచ్చునేమో? తానే యతనిని స్వయంవరమేల చేయరాదు? సీత పెదవిమీద నొకచిరునవ్వావెలసెను.

## 3

తా నింటికి వచ్చుచున్నానని యవధాని తల్లి పేర నుత్తరము వ్రాసెను. ఆ యుత్తరము కాకినాడ వచ్చెను. కాకినాడలోవారు మదరాసునకు దానిని పంపించిరి. మరల నచ్చట విమల పర్లాకిమిడి చిరునామాకు పంపించెను. పర్లాకిమిడినుండి యా యుత్తరము మరియొక చిరునామాతో గుంటూరు పోయెను. గుంటూరునుండి చిరునామా మారి కాశీ, గయా, ప్రయాగలు తిరిగితిరిగి పూర్ణ యాత్రా స్పెషల్ వెంట కొన్నాళ్ళు భ్రమిసరించి మరల కాకినాడ వచ్చెను. ఆ స్పెషల్ కోస మెదురు చూచుచుండెను. ఆ స్పెషల్ యింకనూ రాలేదు. భవాని భర్తపోయిన మొదటిదినములలో కొన్నాళ్లు

కూతునింట నుండెను. ఆమెకు మోహనరావుతో నేమియు పడలేదు. ఇరువదివేలతో వచ్చిన తన కూతునకు మోహనరావు తగిన భర్త కాడు. అతడు వట్టి పెంబేద. ఈ సంబంధమునకు భవాని చాల సార్లు గురుమూర్తిని నిందించెను. మొదట తన మాటలకు విఘల యూరుకొన్నట్లు కనిపించినను క్రమక్రమముగా నామె తన భర్త పక్షమున మాటాడుట భవానికి వింతయు రోతయునై మదరాసు నుండి పర్లాకిమిడి పోయెను. పర్లాకిమిడిలో నామెకు గిట్టలేదు. భవాని భర్త యున్నన్నాళ్ళు తనకు తెలియకుండ సంస్కారపుటూహాలలో తదూహా ప్రచారవీధులలో పరిభ్రమించెను. కాని భర్త పోయిన వెంటనే ప్రాతప్రకృతి, ప్రాతసాంప్రదాయము నామెలో తలసూపెను. రాత్రులందు భోజనము మానివేసెను. ఆ మడికి మొదలు తుద లేదు. తాను ధోవతి నెండవేసికొని కట్టుకొనిన నిముసములో నెవరో దగ్గరకురాగా వారుతగిలినారేమో యన్న యనుమానముతో మైలపడితి నని మఱల స్నానముచేసి మరల నా ధోవతి తడుపును. ఆమె కట్టు ధోవతులు ఉన్నవి నాలుగు. పగలు పన్నెండు గంటలలో నున్న నిముసములు ఏడు వందల యిరు

వది. విభాగము కూడ కుదురలేదు. దీనితో పాటామెకు ముక్కోపము బలిసినది. హరికథలు, భజనలు, వీధినాటకములు కొల్లలు కొల్లలుగా సంవత్సరము మొదలు చివరవరకు గణపతి నవరాత్రములు, దేవీనవరాత్రములు, ఏవో ఏవో పండుగలు, శివరాత్రులు, శ్రీ రా మ న వ ము లు. కాకినాడలో నున్నచో ఆకామావైలు సమృద్ధిగా నామె స్నానములకు జాగరణములకు నెడమిచ్చెను. ఒక యేడాది ఏదునర్థము మదరాసు పర్లాకిమిడుల మధ్య నెడమెడముగా తిరిగెను. ఒక పదిరోజులు బరంపురములో గురుమూర్తిగారి యింటిలో నుండెను. ఆమె యెచ్చటను నతికినది కాదు. తనకు పదివేలున్నవి అను నొక యంతరూహయో, తనకు సహజముగనుండి భర్త యున్న నాళ్లలో రూపుకట్టక తరువాత మూర్తి తాల్చిన యొక స్వాతంత్ర్యమో యామెను, ఒక చోట నిలువనీయలేదు. ఆమె మదరాసులో నున్నను పర్లాకిమిడిలో నున్నను అచ్చటివారిని ఏదో యొత్తిడిపెట్టుచునే యుండెను. విమలకడ నున్నచో మూడువేళల నామె సంబంధమును గూర్చి పుల్లవిరుపు మాటలే. నోటిలో నాలుకలేని విమలకు

కూడ తల్లిని వెళ్లిపొమ్మనక తప్పినది కాదు. పర్లాకిమిడిలో మేనకోడళ్ళమీద నవులు చలాయించ బోయెను. ప్రతి పూటయు నన్నగారియు, మరదలియు, మేనకోడండ్రయు ననాచారములు ఆమెకు వివాదహేతువు లయ్యెను. ప్రతిదానికి లుసకరించుట, రుంజుట, ఎదురుమాటకు సాదించుట, కోపించుట కానువాయితమైపోయెను. పర్లాకిమిడిలో నిద్ద రప్పాసెల్లెండ్రును కలసి వారి యింటిలోని సంఘసంస్కారాచరణరూప మయిన యనాచారముపై దాడి వెట్టిరి. ఒకనాడు లలిత 'ఆ వెధవ ముండ కీ వెధవ ముండ తోడయ్యె' ననెను. ఆ మాటకు అర్థ తాత్పర్యములు, దండాన్వయములు, వ్యాఖ్యానములు, భాష్యములు ప్రబలి 'నేను వెధవముండను కాదే. చూచిపోద'మని వచ్చితిని కాని, నీ మోచేతిక్రింది గంజి తాగుటకు రాలేదు. నేను మహారాజువలె నుండుటకు నాభర్త నాకు పదివేలు వ్రాసి పోయెను. మీ పడి పంచల బ్రతుకవలసిన స్థితి నాకు లేదు' అని యా సాయంకాలమే కాకినాడ పోయెను. అచ్చటనే యీ యారేండ్లును ఉండెను. తన కొడుకువద్దనుండి తన కెప్పుడును జాబు రాలేదు.

'వానికి నేనేమి తల్లిని, వానికి తల్లియు చెల్లెలును విమల. పర్లాకిమిడికే యుత్తరము వ్రాయునట. నే నా కోతిమూకయంత చేయను కాబోలు. వాని కంటికి వా రప్సరసలు కాబోలును. మేనక, తిలో త్తమ, రంభ.' ఈ యేకరువు పెట్టుట రామారావు భార్యతో. రామారావు భార్య నలుబదియైదేం డ్లది. రామారా వేబదియేండ్ల వాడు. రామారావు నలుబదియేండ్ల వానివలె కనుపించును. అతని భార్య యిరువదియేడ్లదివలె గనుపించును. ఆవిడకు నీవిడకు స్నేహము. హరికథలు మొదలైనవాటికి ఇద్దరును కలసియే పోదురు. ఉండియుండి ఒక నెలక్రింద పూర్ణయాత్రా స్పెషల్ బయల్దేరు చుండగా నీ జన్మ కిదియే చారితార్థ్యమని ప్రోత్సా హముచేసి రామారావును నతని భార్యను గూడ ప్రయాణముచేసి లాభసాటి తీర్థయాత్రకు బయలు దేరెను. అందుచే నుత్తర మంద లేదు.

౪

గురుమూర్తిగారికి గూడ నొక యుత్తరము వచ్చెను:

ప్రియమైన గురుమూర్తి గారికి,

నేను మీకు నెలకింద వ్రాసినట్లుకాక వెంటనే బయలుదేరి వచ్చుచుంటిని. నా దగ్గర డబ్బు నేను బొంబాయి చేరునప్పటి కైపోవును. నాల్గువందలు తీసుకొని మీరు బొంబాయికి వచ్చినను సరే, లేనిచో మా చెల్లెలు విమలకు పంపించినచో నామెయును మోహనరావును బొంబాయికి వత్తురు. మీరు నాకు పంపించిన రెండు నోట్లలో నొకటి నేను బొంబాయి చేరునాటికి లిమిటేషను పట్టును. కనుక మీరు బొంబాయి వచ్చినచో నచ్చటనే తిరిగి వ్రాయవచ్చును. దాని వడ్డీ ఫాయిదాలు సుమారెనిమిది వంద లగును. రెండవనోటు లెక్క చూడలేదు. తాకట్టు దస్తావేజు వ్రాసి రిజిష్టరుచేసి పంపితు నంటిరి. ఇంతవర కది జరగలేదు. నేను వచ్చిన తరువాత మీ యాస్తివైనము విచారింతును. మీరు నా భూములమీది పన్ను వసూలు చేయుటకునైన ఖర్చు లెక్కలు అప్పుడప్పుడు వ్రాయుచువచ్చిరి. అంత ఖర్చెందుకైనదో నాకు తెలియదు. మీరు కలకత్తా వెళ్లినప్పుడు చేసిన ఖర్చు నా పేర వ్రాసిరి.' మీకు గూడ నేదియో పనియున్నదని వ్రాసితిరి కదా! 'ఆ ఖర్చంతయు నాపద్దులో నెం

దుకు వ్రాసినారో తెలియదు. తక్కిన సంగతు లన్నియు నేను వచ్చినతరువాత మాటాడుదును. వెంటనే రైతులవద్ద వసూలుచేసి నాలుగువందలో యైదువందలో నాకు చేరునట్లు చూడవలెను.

ఇట్లు,
ఎ. చతుర్వేది.

ఈ యుత్తరము గురుమూర్తిగారు చూచెను. అంతకు నెలనాళ్ల క్రిందనే రైతులవద్దకు పోయి రెండు వందలు వసూలు చేయుటకు గురుమూర్తి తలప్రాణము తోకకువచ్చెను. అప్పుడు రెండువేలు పంపించవలసి వచ్చెను. కొంత యాస్తి తక్కువ ధరకు విడుదల పెట్టవలసి వచ్చెను. గురుమూర్తి తన సంసారము కష్టములతోపాటు అవధాని చదువునకు డబ్బు పంపించుటకును అతని యాస్తిమీద నజమాయిషీ చేయుటకును, నీ యేడేడులును, మిక్కిలి యిబ్బందిపడెను. మొత్తముమీద నవధానికి మిగిలిన యాస్తి సరియైన ధరల కమ్ముడుపోయినచో బాతిక ముప్పదివేలకన్న రాదు. మూడేండ్ల క్రింద నవధాని యొక్కసారిగా బదివేలు పంపించుమనెను. అంత ఖర్చేందుకని గురుమూర్తి వ్రాసిన యుత్తరములకు తూలుమాటల సమాధానము

వచ్చెను. అప్పుడు పంపిన డబ్బులో గురుమూర్తి నాల్గువందలు వాడుకొని యవసరము వచ్చినది వాడుకొంటి నని యవధానికి వ్రాసెను. తరువాత లెక్క సరిచూతు ననెను. కాని వెంటనే యవధాని 'మీరు నాకు పెట్టిన ఖర్చులో రెండు వందలు సరియైన ఖర్చులుకాదు, మీరు వాడుకొనిన నాల్గు వందలును యీ రెండువందలును కలిపి వెంటనే ప్రామిసరీ నోటు వ్రాసి పంపించవలసినదని వ్రాసి పంపెను. గురుమూర్తికి కోపము వచ్చెను. ఆ కోపము వెంటనే యారు వందలకు నోటు వ్రాసి పంపుటతో తీరెను. తరువాత జరిగిన మూడేండ్లు గురుమూర్తి యవధాని యాస్తి యమ్ముటకుగాని, పంట వసూలు చేయుటకుగాని తనకైన యెల్ల ఖర్చులును అవధానికి కట్టలేదు. తన క్రిందనే కట్టుకొనెను. వాని యన్నింటికి మరల నాల్గువందలు నోటు వ్రాసి యవధానికి పంపించెను. ఈ నోటెందుకని గాని, ఈ సారి ఖర్చులు వ్రాయలేదేమనిగాని యవధాని యడుగలేదు. ఎప్పటికప్పుడు పైసలతోసహా లెక్కలు వ్రాసి పంపించవలసినదే. గురుమూర్తి యానాములో నొక చిన్న చెక్క యుండగా దానికి

బేరముపెట్టి నాల్గువందల కమ్మెను. ఆ డబ్బు విమలపేర పంపించెను.

గురుమూర్తి యప్పుడప్పుడు కాకినాడ పోయి భవానిని కలుసుకొనును. ఆమెకుమారుడు వ్రాసిన యుత్తరములలోని సంగతులామెకు చెప్పును. 'మీరు కాకినాడకు పోయి హోటలులో భోజనము చేసినట్లు వ్రాసినారు. అక్కడ మా అమ్మ ఉండగా పదిరోజులు పూటకూటి యింట నవసరముగా నెందుకు ఖర్చుపెట్టవలయును. రామారావుగారి యింటిలో నుండవచ్చును' అని వ్రాసినాడమ్మా యనగా భవాని "అక్కడ వాడెంత ఖర్చుపెట్టుచున్నాడో, యీ అయిదారు రూపాయిాలలో ననే వాని సొమ్ము పోయినదా? ఒక్కసారి పదివేలు పంపించుమన్నాడు. దానితో నేమి చేసినాడో తెలియ"దని యామె యనెను. ఒకయేడాది గురుమూర్తికి కూడ అవధాని యుత్తరములు వ్రాయలేదు. ఒక్కసారిగా పదివేలు పంపించిన తరువాత సంవత్సరమువరకు నవధానిజాడ మెవ్వరికిని తెలియలేదు. అదివరకతని చిరునామాకు గురుమూర్తి వ్రాసిన యుత్తరములు తిరిగియే వచ్చెను. తరువాత సంవత్సరమునకు నవధాని

మరల యుత్తరములు వ్రాసెను. ఒక యేడాది తన చదువు భగ్న మయ్యెనని మాత్రము వ్రాసెను. అది యెందుకో యెవరికిని తెలియదు. గురుమూర్తి సామాన్య సంసారి. ఆయనకు శ్రీకాకుళములో పది యెకరముల పొలముండెను. దానిమీది పంట రైతు లిచ్చినంత యిత్తురు. ఈయనంత యీయరు. బరంపురములో రెండిళ్లున్నవి. ఒక దానిలో తా నుండును. రెండవదానిమీద పదిరూకలద్దె వచ్చును. ఆయన వ్రాసిన వ్యాసములకు నెలకు పది పదునొకండు రూకలు వచ్చినచో వచ్చును. రానిచో రావు. ఆయన భార్య నిత్యరోగిని. ఒక కుమార్తె యున్నది. ఆమెను పార్వతీపుర మిచ్చెను. ఆ యల్లుడు 'జామాతా దశమ గ్రహః' 'పెండ్లికి నేను నీకు రెండువందలు నగలక్రింద నిచ్చి నాను. దాని వడ్డీతోసహా వెంటనే యీయక పోయినచో నీకూతును పంపివేయుచున్నానని యత డుత్తరము వ్రాయగా, కూతురు తన్ను భర్త దిన దినము కొట్టుచున్నాడని తండ్రికి తెలియచేయగా, నప్పుడు గురుమూర్తి యవధానికి పంపించుటకు తెచ్చిన డబ్బులో నాల్గువంద లల్లునకు పంపించెను. అదికాక యారు వందలు వృథాగా గురుమూర్తి నెత్తికి చుట్టుకొనెను.

# ఆగమనము

## ౧

దిగిన వానకాళ్లు దీర్ఘపాదములుగా గలవాడు, నాల్గువైపుల నల్లని గడ్డతో సంతరించిన గుడారమువంటి మేఘములు ప్రధానమూర్తిగా కలవాడు, మెరుపుతీగ యతని ఆంతర విద్యాదేవతవలె యుండి యుండి మెరపించువాడు, ఆబద్ధమాలలై గర్భాధానక్షణపరిచయ వశమున సేవించుచున్న బలాకలుకలవాడు, ఉచ్ఛిలీంధ్రమైన ధాత్రియానందము బికిన చెల్లెలివలె నెదురు చూచినవాడు, వర్షర్తువు చమదెంచెను. అతడు కురిసినదిలేదు, పెట్టినది లేదు. ఈధారణి యుబలాట మేఘ యుబలాటమో, చల్లబడి పచ్చికబయు లయ్యెను. నాల్గయిదు దినములు మబ్బులుపట్టి కురియుదును, కురియుదునని 'నీ కూటికుండలో దూకెదను' అని కొమ్మమెక్కి యాడిన గంగిరెడ్ల వానివలె నురుమజొచ్చెను. 'నీ కూటిలో భాగము పంచుకొనెదను. నీవు నాకు బిచ్చము పెట్టు'మని గంగిరెడ్లవాని యుద్దేశము. అసలు యాథార్థ్యమంతియే. కాని యా గంగిరెడ్లవాడు తన మాటలో సూచించిన ధార్ష్ట్యము యాచకుని మాటవలె కాక నధికారి

బెదరింపు వలె నుండెను. అయినను భారతదేశము లోని యాతిథ్యభావము యాచకునికి గృహస్థ భావము నాపాదించు నంతటి యుదారము. ఆ మేఘుడుత్తరత్ర తానిచ్చినది పదింతలుగ సమాకర్షించువాడు. వేసగిలో ధాత్రిమీది సర్వనదనదీ సరఃపాథోనిధానము దొంగిలించి యావిరిగా లాగి మరల నా ధాత్రిపై గొంత క్రుమ్మరించెడుమాట నిజమే. కాని యెంతటి జలము సముద్రాలమీద పారబోయును? పర్వతముల నడవుల దయాగుణము కాక మేఘుడు తాను తీసికొనినచోట ప్రత్యక్షముగా నీయడు. కొండలమీది నీటికి యడవుల లోని వాగులకు నిమ్నాభిసరణము సహజగుణమై నదులు, చెరువులు, కాలువలు తమ జలముతో నిండించుచున్నవిగాని, యా మేఘుడు మింటి నడికొప్పున నిలచి నీల్గి యధికారమంతయు తాను పుట్టినతోడనే తన మొగమున వ్రాసికొని పుట్టినట్లు తర్జించును. పరువెత్తును. అతడు సముద్రము మీద పారబోసిన నీటికి వెలలేదు; ఫలము లేదు. ఆ సముద్రములో నీళులు తక్కువనియా ఈమేఘుడచటికి పోయి వర్షించును. ఆ సముద్రున కింక చాలునని తృప్తియున్నదా? వాడొక పరమ

రాక్షసుడైన కుండోదరుడు. జలమునుండి యగ్ని దేవు డుద్భవిల్లెనట. అగ్నిదేవుడే పూర్ణాహుతి రాయడు. వాని జనకతనూ ప్రాచుర్యస్థానమైన యీ సముద్రుని పూర్ణాహుతి మఱియు పేటురేగి పోయినది. ఈ మహాజలము, యీ మహా జనము నకు కాకుండ తాను దొంగిలించుచున్నది చాల దన్నట్లు, తుపానులు, ఝంఝులు వానికి కోపము వచ్చినప్పుడెల్ల విసరును. ఈ సముద్రము దమా యకమైన జనమునకు భక్తి. అతనిలో స్నానము చేసిన తమ మచుగడకు నోకానొక తరింపువచ్చు నని గుంపులు గుంపులై తీర్థయాత్రలకు పోయి నట్లు పోవుదురు. వా డా సమయమునం దెంతటి యానుకూల్యము ప్రదర్శించును. తరంగము లను చేతులెత్తి యభివాదనము చేయుచున్నట్లుండును. జనము కానుక లిచ్చిన కదళీఫలములు, జేమపండ్లు బంగారు చాయగల గుమ్మడిపండ్లు తన తరంగముల మీద నుయ్యాల లూగించును. స్వీకరించునని పిచ్చుజనము అభిప్రాయము. కైవర్తులు వాని నన్ని టిని సేకరించుకొని మరల నీజనమునకే యమ్ము దురు. ఇది యొక విచిత్రమైన యధికార చక్రము. పాప మీ జనములు, నదీసరస్సు నిచ్చునది యధి

కము, స్వీకరించునది యల్పము. ఆ మేఘుడు వడ గండ్లతో కొట్టినను, ఉరుము లురిమి బెదరించినను పిడుగులతో పడఁజఱచినను పూర్వపు గ్రీష్మర్తు తాపనష్టమైన చేతములు చల్లపడినట్లే సంతోషింతురు. ఆ సముద్రుడు పొంగి యొక్కసారి తమపై విరుచుకొని పడకుండుటయే యాతడు చేసిన మేలన్నట్లు వానికిఁ గానుక లర్పింతురు.

నాల్గునాళ్లు మబ్బులు మూసి మూసి మదరాసులోఁ గుండపోతపోసెను. తారురోడ్లమీద గొన్ని చోట్ల సీలమండబంటి, పిక్కబంటి నీరు ప్రవహించెను. సూర్యుఁడు కనుపించలేదు. ఒక నిడివిజల్లు వచ్చి తటపెట శిరోభుజతాడనము చేసి పోవును. మరియొక ఏటవాలు జల్లు వచ్చి పృష్ఠవక్షో భాగములు గదాఘాతములవలె చరచి పోవును. ఒక నాజూకుగొడుగు వెనుకకువిరుచుకొని,శిరస్త్రాణము కాదుకదా బెత్తములనన్నింటినివిరిచిప్రోగులువెట్టును. ఆ విపరీతప్రసరణము జరిగిన గొడుగును గాలి కెదురుగా పట్టినచో తిరిగి ఛత్రమగును. కాని యంతలో గగ్గోలుపడిన యా ఛత్రవంతుని బుద్ధి గాబరాపడి తడియునుగాని యూహింపదు. ఆ ఝుంఝుకు నా మేఘునకు, నావాత్యకు, యీయమాయకుని

యమాయకత తెలియును. ప్రక్కన బోవుచున్న బుద్ధిమంతుడు 'ఓయీ! గొడుగు గాలి కెదురు పట్టుము, మరల సరిగా నుండున'ని చెప్పెను. ఆ మాటయే వినిపించుకోడా జానపదుడు. అది యేమి మనుష్యప్రకృతియో, ప్రక్కబోవుచున్న యొక కిగ్గాడి, కాదు కాదట్లే యుంచుకొమ్మని పరిహాసము చేయును. ఆ గొడుగువాడు వెళ్ళ — వానికి పరిహాసకుని మాట యథార్థమనిపించును. ఎందుచేతనో ఈ జానపదుని మనస్సు తన యనాగరకత చేత దన యనూహాశాలిత్వముచేత, నాకిగ్గాడికి సమీపవస్తువుగా భాసించి యా యుత్తముడై, నాగరకుడై, తోడిమానవుల కష్టమునకు సానుభూతి చూపు పెద్దమనుష్యుని మనస్సు విజాతీయము వలె భాసించును. అబ్బో! సజాతీయత తెలిసికొనుటయు నంత కష్టమైన విషయముగా భగవంతుడు సృష్టించెను కాబోలు.

మదరాసులో వట్టి వానలే కురిసెను. బావురుకప్ప లెదుళ్లైదుళ్లయి వేదపారము చేయలేదు. సర్వ బ్రాహ్మణులు ననాచారదూషితులైన యీ కాలములో వేదమేమో యన్న భ్రాంతి పుట్టించు ధ్వనులుకూడ కలుగరాదు. ఎట్టిని ఆర్ద్రి

పురుగులే కనుపించవు. బాలకుల కేళీవిలాసములే లేవు. వానలో తడియుట, వానవల్ల ప్పయాటుట, కాగితములు పడవలు వేసికొనుట, పొలములలోనికి పోయి వర్ష శోభ చూచుట నివి యన్నియు చెన్న పురి బాలకు లెరుగరు. పుస్తకములు తడియును, లాగూలు తడియునన్న ధ్యాసయే. వాన వచ్చినచో నొక్క యానందము సర్వధా భాసించును. ఆనాటికి తమ విధ్యుక్త ధర్మమునుండి విడుదల కలుగును, సెలవు వచ్చును అని మాత్రము.

అంతటి వానలో మదరాసు రెన్నాళ్లు మునిగి తేలెను. ఆరాత్రి మరియు ఘోరముగా ముంచి వేసెను. తెల్లవారినను వెలుంవలేదు. ఆలస్య ముగా వచ్చిన బొంబాయిమెయిలులో నేడుగంట లకు నవధానియు మోహనరావును దిగిరి. విమల పిల్లలను తీసికొనిపోవుట యిబ్బంది యని తాను బొంబాయి పోలేదు. రబ్బరుతో చేసిన కోటులో దొరటోపీలో పైనిపుచ్చుకొన్న గొడుగులో స్టేషన్ బైటకు వచ్చినను అవధాని తడియలేదు. మోహన రావు ఖద్దరులాల్చీ యుత్తరీయమును వానకుతడిసిన మాత్రమే కాక నవధాని గొడుగుచువ్వల చివళ్ల నుండి పడుచున్న నీటి బిందువులచేత గూడ తడి

సెను. అతని గుడ్డలు తడియుట అట్లుండగా నవధాని గొడుగుచువ్వ లుండియుండి నెత్తిమీద బొడువనారంభించెను. పార్కుస్టేషన్లో నెలెక్ట్రిక్ బండి నెక్కిపోదమని మోహనరావు, టాక్సీమీద పోదమని యవధాని. అవధాని మోహనరావు నల్పబుద్ధియని భావించి టాక్సీవానిని పిలచెను. వానలో నందరును టాక్సీలకోసమే బయలుదేరిరి. వీ రాలస్యము చేయుట మూలముగ టాక్సీ దొరకలేదు. అప్పుడు మోహనరావు స్నేహితు డొకాయన తన బంధువులు రాలేదని వారిని తన మోటారులో నెక్కించుకొనిపోయెను.

ఇంటికడ విమల పెసరట్లువేసి, యిడ్డెనలు చేసి కాఫీకాచి సిద్ధముగ నుండెను. తెల్లవారకముందు పిల్లలకు తలలు దువ్వి నీళ్లుపోసి యుదికిన దుస్తులు కట్టి సావడిలో పిల్లలను జంబుఖానాపై పోక్తాతనముగాకూరుచుండబెట్టి యెదురుచూచుచుండెను. భర్తయు నన్నయు దిగిరి. అవధాని హఠాత్తుగా విమలను కౌగిలించుకొని రెండుబుగ్గలపై ముద్దిడుకొనెను. విమల దిగ్భ్రాంతురాలయ్యెను. మోహనరావు నాల్గుదినములనుండి బావమఱంది పాశ్చాత్య దేశపు టలవాటులు గ్రహించినవాడు కనుక

నవ్వుచు నిలుచుండెను. వానలో తడిసిన యవధాని రబ్బరుకోటు విమల యప్పుడే తాల్చిన చీరను తడిపెను. విమల కొంచెము కలవరపడెను. అయినను ఏండ్లు గడచిన తరువాత చూచిన యన్నగారి దర్శనమువలన కలిగిన యానందములో నా కలవరము మునిగిపోయెను. విమల కొడుకు పేరు తానాజీ, కూతురు రోహిణి. తానాజీ తన పేరున కప్రతిష్ఠ వచ్చునట్లు భీరువువలె ముడుచుకొని బెదరు చూపులతో కూరుచుండెను. రోహిణి మినుకుమినుకు మనుచు తానాజీప్రక్క నానుకొని యతని డొక్కలో నొదిగి కూరుచుండెను. అవధాని పూర్వముకన్న నొకటిన్నరమనిషి యయ్యెను. చలిదేశములో జాలకాల ముండుటచేత నతడు మునుపటికన్న రెట్టింపు మెత్తబడెను. చిబుకము క్రింబెదవి నడుమనున్న గుంటలో నల్లని వెంట్రుకలు గుమ్ముగా పెరిగియుండెను. మీసములు తుమ్మెద రెక్కలవలె మెలితిరిగి యుండెను. కపోలములు నితర ముఖావయవములు పరిపుష్టమై గాంభీర్యమును వెల్లడించుచుండెను. చెవులకు సగమువరకు బెంచబడిన పుస్తీలు నూనెరాచిన కాకి యీకలవలె సోగదేలి యుండెను. తానాజీ రోహిణులు

నిశ్శ్మశ్రుకము నిమ్నకపోలము సాధువైన తండ్రి మొగమే యెరుగును. తండ్రితో నెప్పుడైన నింటికి వచ్చిన స్నేహితులు కూడ తండ్రివలెనే యుందురు. మోహనరావు అయిదడుగుల నాలుగంగుళముల మనిషి. అవధాని ఆరడుగు లుండెను. ఆయెత్తునకు తగిన ఒడ్డుతో నవధాని ఆ పసిపిల్లల కన్నులకు రాక్షసునివలె కనుపించెను. గుడ్లగూబ కూత విని కాకులు కిక్కురు మనకుండ చెట్ల జొంపములలో దాగియున్నట్లు వారిద్దరు గోడమూలకు పోయి నక్కియుండిరి. విమల యన్నగారికొఱకు భర్త కొఱకు వేన్నీళ్లు పెట్టెను. స్నానము చేయుడనెను. మోహనరావు స్నానము చేసెను. అవధాని తరువాత చేయుదునులే యనెను. ఇంటిలో కూర్చుండుటకు కుర్చీలేదు. అవధాని యటునిటు చూచెను. అతనికేమియు తోచలేదు. తన లాగుతో నెచ్చట కూర్చుండవలయునో తెలియలేదు. విమల సర్వము నొక్క నిముసములో నెరిగికొనెను. వెంటనే యన్నగారిని స్నానము చేయుమని బలవంత పెట్టెను. అతడు బూటు సూట్లను విప్పి స్నానము చేయబోయెను. విమల ప్రక్క యింటికి బోయి సాయంకాలము పంపింతుమని రెండు కుర్చీ లడిగి తెచ్చెను.

విమల చీర పూర్తిగా తడిసిపోయెను. విమల తన యన్నగారు వచ్చినతోడనే పిల్లలనుగూర్చి యడుగు చునుకొనెను. అత డడుగనే లేదు. అవధాని స్నానము చేసి వచ్చి కుర్చీలు చూచి యింతకు ముందు లేనివి యిప్పుడెచ్చటినుండి వచ్చెను? అన్న యూహాయు లేకుండ బల్ల కోసము వెదకెను. మోహనరావు ఒక కుర్చీ కిటికీవద్ద వేసి యచ్చట గడ్డము చేసికొ మ్మనెను. అవధాని గడ్డము చేసికొనుటయు ఫలాహారము చేయుటయు యుగపత్క్రియావ్యవసాయ మాచరించెను. విమలకు కొంచె మసహ్యాము వేసెను. కాని యప్పుడే వచ్చిన యన్నగారిని నేమి యను టకును తోచినదికాదు. గడ్డము చేసికొనుట పూర్తియైన తరువాత తడితువ్వాలుతో మొగమం తయు తుడిచి యద్దములో పదికోణములనుండి గీకిన కొంచెముమేర గడ్డమును వందసారులు పరీ క్షించి 'విమలా, అమ్మ యెచ్చటనున్నది?' అనెను. విమల 'కాకినాడలోనే యున్నది' యనుచుఁ గొడుకు కూతుండ్రను పిలచి యన్నగారికి చూపించెను. తానాజీ దగ్గరకు పోలేదు. రోహిణి బిగ్గరగా నేడువ నారంభించెను. అవధాని బిగ్గరగా నవ్వెను గాని పిల్లలను దగ్గరకు తీసికొనలేదు.

మఱునాడు వర్షము వెలిసెను. విమల భర్తతో చెప్పి రెండు పేముకుర్చీలు, రెండు పడకకుర్చీలు ఒక బల్ల కొనిపించి తెచ్చెను. మోహనరావు మదరాసులో నున్న సర్వ బ్రాహ్మణోద్యోగులం వలెనే ద్రావిడదేశమో, ఆంధ్రదేశమో-ద్రావిడ ప్రాబల్యదేశము గనుక ద్రావిడాచారముల ననుసరించి ప్రొద్దున స్నానముచేసి కట్టిన మడుగు దోవతియే మరల రేపు ప్రొద్దుటివరకు మడియే గనుక దానితోనే భోజనము చేయును. అవధానికి ధోవతులే లేవు. మెడలో జందె మంతకుముందే లేదు. భోజనమువేళ చొక్కా నూడతీయ లేదు. విస్తరిలో భోజనము చేయుటకు మిక్కిలి యిబ్బంది పడెను. చంచా యడిగి తీసికొని దానితో తిన నారంభించెను. మూడవపూట మేనమామ చంచాతో తినుచుండుట రెండు పూటలుగా చూచిన తానాజీకి కడుపుబ్బ నవ్వువచ్చెను. విమల ప్రపంచకము చూడనిది. కాకినాడలో తన తండ్రి మడి కట్టుకొని భోజనముచేయుట యెరుగును. రామారావు గురుమూర్తులట్లే చేయుట యెరుగును. మదరాసు వచ్చిన తరువాత మడికట్టుకొనకుండ కూడ భోజనము చేయుదు రనుట భర్తను చూచి గ్రహిం

చెను. విస్తరిలో నన్నము తినుటయే చేతకాని వారిని, లాగూలతో చొక్కాలతో భోజనము చేయువారిని ఆమె యిదివరకు చూడలేదు. ఆమె మదరాసులో నేడేండ్లున్నను యిల్లు విడిచిపోయిన పాపమున పోలేదు. ఈ యేడేండ్లలో నొక పది సార్లకన్న - నదియును భర్త బలవంతముమీాద — ఎక్కువసార్లు సినిమాకే పోలేదు. ఒకటి రెండు క్రిస్టుమస్ పండుగలలో భర్త స్నేహితులు భార్యలతో సహా తమ యింటికి నతిథులుగా వచ్చినప్పుడు పార్కు, మూర్ మార్కెట్టు, తిరువళిక్కేణి సముద్ర తీరము, అడయారుపోయి చూచివచ్చెను. దానితో నామె చెన్నపురీజ్ఞానము పరిపూర్ణమయినది. ఆపిచ్చి బాగుల ఆమెకు అన్నగారి యీా రెన్నాళ్ల కవళి కలు చూడగా, పోయి యెచ్చటనో సముద్రమధ్యమునఁ బడవేసి నట్లయిన దామె ప్రాణములకు.

ఒకనాటి మధ్యాహ్నము విమల — ఏమిరా అన్నయ్యా! నాయనగారి సాంవత్సరీకములు పెట్టకుండనే వెడలిపోయితివి. ఇప్పుడు పెట్టుదువా? ఇన్నాళ్లును ఆబ్దికములే లేవాయెను. ప్రాయశ్చిత్తము చేయించుకొని కర్మ మొదలుపెట్టవలయును కదా.

అవధాని:—నాకు నిటువంటివానిలో నమ్మ కములు లేవు.

విమల:—అమ్మ ప్రాణములు ఉస్సురుమనును.

అవధాని:—నేను పెట్టవలయునని నీకున్న దా?

విమల:—ఉన్న దా యేమి? నీవువత్తువని నాయన గారి కర్మల చేయుదువని నే నేడేండ్లుగా నాశపడు చుంటిని.

అవధాని:—నీవు చేయక తప్పదనుచో చేయు దును.

విమల:—అది యేమిటి? తండ్రికి కర్మలు చేయుట నేను చెప్పినచో చేయుదువా?

అవధాని:—విమలా! యీ మాటలు నాకు తెలియవు. నీవు చేయుమన్నచో చేయుదును.

విమల:—నేను నీకు నీ తండ్రికన్న గొప్ప దాననా?

అవధాని:—అమ్మాయీ! మన నాన్న వట్టి లోభి. ఆయన యనగా నా కేమియు గౌరవము లేదు.

విమల:—నే ననినచో గౌరవమా?

అవధాని:—గౌరవమా? నీవు నా కొక ఆదర్శ స్త్రీవి. నే నింగ్లాండులో నీ వంటి స్త్రీ కనుపించు

నేమో నని యేడేండ్లు వెదకితిని. నా కెచ్చటను కనుపించలేదు. నీవు మనుష్యురాలవుకాదు. నీకున్న ఓర్పు, సహనము, శాంతి, నా కెచ్చటను కనుపించలేను. ఇంగ్లండులో గూడ గొందరు త్తమశీలలు కలరుగాని నీ వంటిది లేను. మన నాన్నగారు నీయెడల కనుపరచిన ముభావము, నీపెండ్లివిషయములో నాయన చేసిన యశ్రద్ధ, నీ పోషణ విషయములో, మన తల్లితండ్రులు కలిపించుకోని జోక్యము నే నీ యేడేండ్లును మరచిపోలేదు. పైగా నీవివాహ విషయమున నీవు ప్రకటించిన క్షమ యెంతయు ప్రశంసనీయము. గురుమూర్తి సంబంధము కుదిర్చి నాడు. నీవు చేసికొన్నావు. అతనిని నీవు చూడ వలయునని కూడ ననలేను. ఈ రీతిగా యథా ప్రాప్తమైన భర్తను స్వీకరించి సర్వవిశ్వాసము విధిలో-భగవంతుడే యనుకొమ్ము — వానిలో నుంచెను వ్యక్తులు నాకు కనిపించలేదు. ఒక్క కోటు కుట్టించుకొనుటకు పది గుడ్డలు తీయుదుము. ఆ రంగు నచ్చను. ఈ చార నచ్చదు. తీరా కోటు కుట్టించిన తరువాత నొక కత్తిరింపు కాలాను గుణము కాదని కోటును తొడుగుకొనుటయేమాని వేయుదుము. అట్టి సందర్భములో నీ వైరాగ్యము

నా కాదర్శప్రాయమైనది. కాని నే నొక్క పూచిక పుల్లయంత విషయములో కూడ నిన్ననుసరించ లేను. ఈవఱకు లేదు. నీవు నా మనస్సులో గురువుగా నున్నావు. నీ వాజ్ఞాపించినచో చేయుదును. నీవు వలదన్నచో మానివేయుదును. నే నింగ్లాండులో నెన్ని కష్టములు పడితినో నీకు తెలియదు. చెప్పుటకునువీలు లేదు. ఎట్టి సంఘటమైనపరిస్థితులలోనైనను నీ యోరిమి తలచి నీవు నా సోదరి వగుటను భావించి నీ యూహా ఒక చుక్కానిగా ననేకములైన మానసోద్వేగపు తుపానుల నొడ్డుకొన్నాను. నే నొక్కటియే మాట చెప్పుచున్నాను. నీవు ప్రసన్నరాలవై నన్ను చూచి సోదరప్రేమతో నవ్వితివా నా కది యొక రక్ష. నా యందు కోప భావముతో నీవు మొగము పెడద్రిప్పుకొంటివా నా కది యొక శిక్ష."

ఈ యుపన్యాసమంతయు నవధాని ఇంగ్లీషులో నన్నే యిచ్చెను. విమల ఇంగ్లీషుభాష తెలిసినదైనను నతని యుచ్చారణ సరిగా గ్రహించలేకపోయెను. అయినను ఆమెకు భావ మంతయు సరిగానే గోచరించెను. అతడీ యుపన్యాస మిచ్చుచుండగా తానాజీ మేనమామ కెదురుగా రెండు చేతులను

వెనుక పెట్టుకొని నిలుచుండి గంభీరమైన మొగముతో వినుచుండెను.

విమల యీ యుపన్యాస వర్షమునకు నోర్వ్చుకొనుటకు నూపిరి తీసికొనుటకు నాలుగైదు నిముసములు తీసికొనెను. కడచిన నాల్గు నాళ్లుగా విమల తా నేమనిన తన యన్నగారికి గోపము వచ్చునో యని యూహించుచు నతడు చేయుచున్న యే యాచారమును దన కిష్టము లేకపోయినను నూరకుండెను. ఒకటి రెండు సారు లతడు చేయు నాచారములు కావని యనబోవుటయు నంతలో దా నూరకుండుటయు నత డవి మాని వేయుటయు జరిగెను. ఆ జరిగిన రెండు మూడు సంగతులు నిప్పటి యతని యుపన్యాస భావములతో సమసించి చూడగా నిజమే ననిపించినది. ఆమె కొక ధైర్యము కలిగెను. తాను చేయుమన్నచో నన్నగారు తంత్రికర్మలు చేయును. మొదట నతడు యజ్ఞోపవీతమును ధరింపవలయును.

ఆమె మరునాడు అన్నగారికి నాల్గు ధోవతులు తెప్పించెను. రెండు జరీ యుత్తరీయములు తెప్పించెను. ఆనాడు ప్రొద్దున భోజనము వేళకు అవధానిని ధోవతి కట్టుకొమ్మనెను. అతనికి కట్టుకొనుట

చేతకాలేదు. మోహనరావు కట్టుకొనుట నేర్పెను.

విమల:—ఇన్నాళ్లకు బావమరది పరిచర్య చేయుట యేమియో తెలిసినది.

మోహ:—ఇది బాగున్నదే. ఎదురు మేనరికము. అతని చెల్లెలు భర్త నగుటచేత నా కతడు పరిచర్య చేయవలెను.

విమల:—అతడు కలెక్టరు. మన మేమున్నది.

మోహ:—అయినచో నా భార్య నామాట వినుట నీ యేడేండ్లతో సరిపోయినదన్నమాట. ఏమయ్యా అవధానీ! నీ వచ్చుటనే యెవతెనో పెండ్లి చేసికొని హూణదేశవాసివైనను కాకపోతివి. నీ రాక మూలముగా నా భార్యకు నా మీద నగౌరవమైనచో బాబూ! నీవు పెండ్లలకడ నాకొంప వదలిపొమ్ము.

విమల:—రాక రాక వచ్చిన బావమరదికి మంచి మర్యాద.

మోహ:—'స్వయం తీర్ణః పరాం స్తారయతి' నాకు మీ యన్నగారిమీదకన్న నీ మీదనే యెక్కువ ప్రేమ.

విమల:—బాగున్నది. బావగారిని చూచినంతనే ప్రేమ ముదురుపాకమున బడుచున్నది.

మోహ:—ఇది ప్రేమ కాదు. సరాగము. ప్రేమ యిద్దఱు నొంటరిగా నున్నప్పుడు బలియును. సరాగము మూడవ మనిసి యున్నప్పుడు బలియును.

ఈ ప్రసంగము జరుగుచున్నప్పుడు విమల యొక విచిత్రపు సిగ్గుపోయెను. ఆ సిగ్గులో చనవు, మాధుర్యము, బెరుకు, ఆనందము, మిశ్రితములై యుండెను. మోహనరావులో నొక గాఢమైన ప్రేమ రేఖయు, చమత్కారమును, ఆనందమును సమ్మిశ్రితమై యుండెను. తల్లిదండ్రుల యీ మాటలను వినుచు తానాజీ నిలుచుండి తల్లి మాటాడుచున్నప్పుడు తల్లి వంకను, తండ్రి మాటాడుచున్నప్పుడు తండ్రివంకను మొగ మోరగాపెట్టి నవ్వుచు జూచుచుండెను. అవధాని యీ ముగ్గురివంక నొకే విధముగా జూడజొచ్చెను. అతని కీ సంసారసౌఖ్యము చాల క్రొత్తగా నుండెను. విమల యేడేండ్లు సంసారముచేసి భర్త మాటల కింకను సిగ్గుపడు టెందులకు? అవధాని యిరువదియేండ్లు వచ్చువఱకు తన యింటిలోననే యుండెను. ఆయింటిలో ప్రపంచపు గోడే లేదు. నాలుగైదు నెలలు పర్లాకిమిడి మరదండ్ర మార్గ్య మెరుగని కేళీప్రధానమైన

ప్రేమ మై కాని ప్రేమలో వెన్నెల విహారము చేసెను. తరువాత నెంతయో కొంత సంసారపు సన్నివేశములు పరదేశములోనివే చూచెను. అతని కీ సంప్రదాయమే క్రొత్తగా నుండెను. భార్యాభర్తలు మాటిమాటికి కౌగిలించుకొనుట గాని, ముద్దిడుకొనుటగాని లేదు. ఒకరి మనస్సులలో నొకరియందొకరి కున్న గౌరవము మనస్సుతోనే యాగక శరీరమునందుగూడ బ్రసరించి యా భావ మొక పవిత్రమై, పరప్రత్యక్షమునం దనాచరణీయమై, మధురభావ స్ఫోరకమై, మృదుతరపరామృష్టమై, ఏండ్లు గడచినను క్రొత్తదన మింతయు చెడనిదై శరీరసంసర్గ ప్రధానభావేతరమై చిత్రముగా భాసించెను.

ఆనాడు మొదలు మదరాసు వదలినవరకు నవధాని దోవతులే కట్టెను. మదరాసులో నున్న పెద్ద యధికారుల దర్శనము చేయుటకు పోయి నప్పుడు మాత్రమే హూణుల దుస్తుల ధరించెను. కర్మ లారంభించకముందే జందెము వేసికొనవలయు నని విమల యొకసారి యన్నంతనే యతడు జందెము కొని తెప్పించి వేసికొనెను.

ఏ వ్యక్తిలో నే ప్రకృతి రహస్యముగా నిమిడి

యుండునో యెవరికిని తెలియదు. ఆ ప్రకృతి బహిర్గత మగువేళకు, అట్టివేళ ప్రాప్తించుట యా ప్రకృతికి వ్రాయబడియున్నచో, నది బహిర్గతమగును. అదివరకు మన్నుతిన్న పామువలె నుండు మనిషి యొకవేళ ప్రజ్వలత్ప్రతిభావాహినియై ధగధగలాడును. లోకములో పలుకుచుండిని గూర్చి చెప్పుకొనుచుందుము. 'వానికి పెండ్లియైనది గా. దానితో వాని తెలివితేటలు బయటికు వచ్చిన'వని కాని, 'వాని తండ్రి చనిపోయినాడు. అదివరకు ఎచ్చట నుంటివే గొంగళి యనగా వేసినచోటనే యుంటి నన్నట్లుండెడివాడు, వ్యవహారమంతయు తనకు దానే చూచుకొని చిచింద్రీవలె సంసారము నడుపుచున్నా'డని కాని. ఇట్లెన్నో. విమలలో నొక శక్తి నిగూఢముగా నున్నది. అది యధికార శక్తి. ఆమెకు వివాహాము కాకముందే యీ యధికార శక్తి యిల్లు చక్కదిద్దుటలో, అవధానిని అప్పని సామాన్య గృహ విషయములందు నడుపులో పెట్టుటలో వ్యక్తీకరింపబడెను. వివాహమైన తరువాత నామెలో ననుభూతముకాని శరీరసౌఖ్యజనితానందము ననుభవించుటతోడనే క్రమక్రమముగా వర్ధితమైన దానియందలి రుచి నాస్వాదించి రక్త

నాళములకు పట్టించుకొనుటలోననే సరిపోయినది. ఆమెకు గల విచిత్రమైన మేధాశక్తి నుపయోగించుటకు నామె జీవితములో నింతవరకు మార్గము కుదురలేదు. ఒకమాట తనది తన యన్నగా రెప్పుడు వినెనో రెండవమాట వినిపించవలె నను కోర్కె అప్పుడే యుదయించెను. పదిమాటలు విన్నంతనే యధికారము స్థిరముపడెను. పైని మిగిలినది యీ యధికారము నిలబెట్టుకొనుట. ఆయధికారము చలాయించుటకు పదిత్రోవలు పదిస్థలములు చూచుకొనుట.

అవధాని చెల్లెలితో నామె పిల్లలతో కాకినాడ పోయెను. అచ్చట మాతృదర్శనము చేసెను. ఆమె తీర్థయాత్రలు చేసి తిరిగివచ్చెను. గురుమూర్తి రామారావులు అవధాని చదువునకు మిక్కిలి మెచ్చుకొనిరి. దీని వెనుక యంత్రము నాడించునది విమల యని వారికి తెలియదు. తండ్రి కర్మలకు విమల వేయిరూపాయీలు ఖర్చుపెట్టినది. అందులో ఐనువందలు తానిచ్చెను. ఐనువందలు విమల యీయగా అవధాని వలదనెను. వలదనుటలోనే వలయుననుట కనిపించెను. విమల యిచ్చినందుకు అవధాని సంతోషించినాడనుట విమల గ్రహిం

చెను. అప్పుడు విమలకు నధికారరహస్య మొకటి తెలిసినది. అధికార మచ్చముగా నధికారమువలె నుండరాదు. అధికారి కూడ కొంత లొంగినట్లు కనిపించవలెను. అప్పుడు క్రిందివాడు అధికారి చెప్పినమాట శిరసావహించును. అధికారి యాం దున్న యాథార్థ్యము కనిపించను. విమల బుద్ధి పూర్వము విమలయే యెరుగని క్రొత్త క్రొత్త లోతుల త్రవ్వకో సాగినది. అన్నగారి మీద తాను వహించిన యధికారము నిలబెట్టుకొను మార్గములలో నిది యొకటి. అతనిని తాను కొంత దూరము రమ్మన్నచో సగము దూరములో నత నిని పోయి కలిసికొనుట యధికారములోని మార్ద వము. క్రియాఫలము యొక్క నిశ్చయము.

పితృకర్మలైన తరువాత సర్వజనులు సంతోషిం చిరి. అప్పటికి నిరువదిరెండుదినములైనది. ఇం కొక యెనిమిది దినములలో దాను పోయి యుద్యో గములో బ్రవేశింపవలయును. ఆనాడు సాయంకా లమే విమలయు, మోహనరావును మదరాసు వెడలిపోయిరి. కర్మలకు పర్లాకిమిడి వారు రానే రాలేదు. ఈ యెనిమిది దినములును పర్లాకిమిడిలో గడుపవలయు నని యవధాని యూహ.

మరునాడు ప్రొద్దున తాను పల్లాకిమిడికి బయలు దేరుచు నవధాని గురుమూర్తిగారిని పిలచెను.

"మీరు నాకు వడ్డీతోసహా పదమూడు వందల రూపాయ లీయవలయును. మీ పొలము శ్రీకా కుళములో నున్నదట. ఈ పదుమూడుదినములు నేను వాకబు చేసితిని. ఆపొల మంతకన్న నెక్కువ చేయదట. మీరు నాకు తీర్చెడిది లేదు. పెట్టెడిది లేదు. ఆ పొలము నాపేర వ్రాసి కాగితములు పంపించినచో నేనును నా దస్కతులుచేసి పంపింతును. మీరు తరువాత రిజిస్టరు చేయించవచ్చును." అనెను. గురుమూర్తిగారికి మాట రాలేదు. పెదవు లెండిపోయెను. ఏమనుటకును తోచలేదు. నోటికి రాని యూహ మనసులో నొకడాడెను. "వీని యబ్బగాడి కచ్చియుండియా, యేడేండ్లును వీని వ్యవహారము చూచిపెట్టితిని. నెలకు పదునేను రూకల జీతము కట్టుకొన్నను నీ యేడేండ్లును పదునాల్గు వందల రూకలగునే? దానిపైని వడ్డీ యటులుంచుము. ఇంతకును ఇతనికి నే నీయవలసినది పన్నెండువందలే. అందులో నారువందలు అన్యాయముగా కట్టుకొన్నది." మరల నొక యూహ జనించెను. 'పోనీ! నాకు మగపిల్లవాడుకూడ లేదు.

కూతునకు నీ రెండింట్లును వ్రాసి యిత్తును. సోమ శంకరము చనిపోవుచు నా కితనిని అప్పచెప్పి పోయెను. ఇది యొక లక్షణమైన పుత్రత్వము' అని గురుమూర్తి 'సరే నాయనా వ్రాసి పంపింతును' అనెను. నాయనా యని గురుమూర్తి అదే మొదటిసారి యన్నది. అవధాని గురుమూర్తివంక చూచెను. ఎవని జేబునుండి తాను రూపాయి యేడణాలన్నర కాజేసెనో ఆ మొగము కనపించెను. అవధానికొక వైముఖ్యము తోచెను.

౨

అప్పుడు తన దొరల దొరల దేశము వెళ్ళినప్పటి నుండియు నిర్వ్యాపారుడయ్యెను. అతని కుద్యోగము లేదు. కొన్నాళ్లు ఒక సినిమా హాలునకు బందోబస్తుదారుగా నుండెను. అతనికి దారివెంట బోవుచుండగా జేబులవంక చూచుట యలవాటయ్యెను. రెండుసారులు రాచరికము వారి కందాలో తిన్న రాజబంధు వగుటచేత పోలీసువా రీతనిని మరచిపోలేదు. మరల నతనిని అతిథిగా తీసుకొనుటకు వారు సర్వప్రయత్నములు చేయుచునే యుండిరి. వృథాగా వారి సొమ్ము తినుట యెందుకని యప్పుడును కొంచెము నీతిగానే యుండెను. అప్పటి మన

సులో నొక యూహపుట్టెను. తానును రాచరికము వారును ఒక పక్షమువారు. భారతజాతీయసభా మనుష్యులు రాచరికమువారి యతిథులై నప్పటినుం డియు పరులు వచ్చి తమ యింటిలో భోజనము చేయుటతోనే ఎక్కువ వ్యయమగుచున్నది. మన కొంప మనమే త్రవ్వుకొనుటయా యని యతడు తలంచెను. అతనికి రాచపోకిళ్లు బలసెను. ప్రజల సొమ్ము తినవలయును గాని రాచరికపువారి కం దాలో శేవిణీ వేయుట నీచముగా కనుపించెను. దొంగతనము వృత్తి కాదా యని యొక యూహ. పూర్వకాలములో దొంగతనముకూడ నొక కళగా భావించెడివారట. అతనికొక విద్వాన్ పరీక్ష నిచ్చిన యొక చిన్నకవితో స్నేహము కుదిరెను. ఆ కవికి నుద్యోగములేదు. సంతతధూమ్య పొదివి కొన్న మొగముతో మొగిలుచాయ సినీవాలీ చంద్రబింబమువంటి మొగముతో నణా లేక గడ్డము చేయించుకొనుటకు సమర్థము కాని గడ్డముతో ప్రకాశించు మాత్రము దిగంతములందలి యాకాశ నైల్యమునకు వియ్యము నెఱపగా మాసినగుడ్డలతో నతడు కాకినాడ వీధులవెంట బహాదూరు పోవును. ఆ కవి తన్నుగూర్చి యితరులన్న 'బలాదూరు'

మాటకు బహాదూరని వ్యాఖ్యానము చేసికొనును. ఆ కవిగాని యొడలిలో రక్తమాంసము లుండవు. కాని యతడు పెద్దరౌడి. నిజముగా నతడెవరిని కొట్టి నదిలేదు. మీాదత్ బాజా యీాకవి బంటు నిలిచిన చోటనెల్ల అప్పడి యేన్గుచూపు కాపుదల యుండును. ఈ కాయను చంపుటకే వీలులేదు. ఆ కవి వలన అప్పనికి చాలవిషయములు తెలిసెను. తమకు మిక్కిలి దగ్గరగా నున్న ద్వారపూడి పూర్వ మొక ప్పుడు చోరవిద్యకు నాస్థానభూమిగా నుండెనట. ఆ చోరశిఖామణులను పెద్దాపురము, మొగలితుర్రు, విజయనగరము మొదలైన పూర్వ సంస్థానాధీశ్వరులు పొగడిరట. తెగడ లేదు. మృచ్ఛకటిక మను సంస్కృత నాటకములో నొక బ్రాహ్మణుడే చోర వృత్తి జేసెనట. అరువదినాల్గు కళలలో దొంగతన మొక కళ. దేశీయములైన కళాపోషణలేని యీా రోజులలో 'ఓరీ నా కవిత్వమునకు నాదరణము లేదు, నీ చౌర్యవిద్యకు నాదరము లేదు' అని యాా కవి యప్పని నోదార్చుచుండును.

అవధాని దొరలదేశము పోయినతరువాత తాను స్వతంత్రముగా తన వృత్తి సాగించుచుండెను. అవధాని మరుగున నున్నన్ని దినములు నావృత్తిలోని

లోతు పాతు లతనికి తెలియలేదు. పూర్వమువలె దేలికగా రక్షకభటు లతనిని బట్టుకొనుటకు నేడంత వీలులేదు. అతని చేతిక్రింద పదిమంది యున్నారు. అతని జట్టులో నెవనిమీద నభియోగము వచ్చినను అప్పనితో జెప్పకుండ నతనిని చెఱలో పెట్టుటకు వీలులేదు. ఒక్కొకప్పుడు దొంగిలించిన సొమ్ము నిచ్చివేయుటతో సరిపోవును. మఱియొకప్పుడు లోపాయికారీగా సర్దుబాటగును. బాధుత్వములో నామాత్రపు మొగమోటమి యుండదా?

అప్పుడు మరియొక విద్యలో నారితేరెను. ఆ యూరిలో నతడు త్రొక్కరాని యశీలవతి గడప లేదు. అతని కామము బతిమాలదు. ఆజ్ఞాపించును. అనంగీకృతినంది శిక్ష వేయును. అతడు పగటి దివిటీవలె వెలుగుచుండును.

అవధాని తిరిగి వచ్చినాడన్న వార్త యప్పడికి చెవులలో పోసిన సమపాళమైన యమృతమువలె నుండెను. 'మా దొరగా రేయూరిలో కలెక్టరుగా నుందురో, నే నా యూరిలో నుందును. మఱల దొరగారివద్ద నౌకరీ చేయుదును.' అని యతడు పలుమారులు తనక్రింది యుద్యోగస్థులతో జెప్పు చుండెను. సోమశంకరముగారి పదూరు గడచిన

తరువాత పదిదినములు అవధాని కాకినాడలో నున్నట్లు పూర్వాధ్యాయమున చెప్పితిమి కదా! ఒక దినమున అప్పడు అవధానివద్దకు పోయెను.

'బాబూగారూ! నేను మరల మీవద్దకు వచ్చెదను. నన్ను తీసికొనిపోండు' అని యడిగెను. అవధాని వానితో మాటాడునప్పుడు పూర్వపు పరిచయము వదలిపెట్టలేదు. కాని తన వెంట నప్పుడే రావలదనెను. మూడు నాలుగేండ్లు తన యుద్యోగ మొకేచోట నుండదని, అప్పటివఱకు స్థిరపడదని, స్థిరపడినతరువాత వానిని దీసికొని పోదునని యతడు చెప్పెను. ఇద్దరును చిన్ననాటి కబురులు చెప్పికొనిరి. అవధాని తిరిగి యీ దేశము వచ్చినతరువాత నెవరితో మాటాడినను నప్పనితో మాటాడినంత యాప్యాయముగా లేదు. వారు మాటాడుచుండగా గురుమూర్తిగారు దూరముగా కనిపించుట తటస్థించెను. అప్ప డాయన వంకకు కన్ను గిలిపెను. అవధాని నవ్వెను.

అప్పనితో మాటాడుటవలన నవధాని కొక్క విషయము తెలిసెను. అతని మాతృభాష నతడు మరచిపోలేదు. ఇతరులతో మాటాడుచుండగా నింగ్లీషుభాష యెంత ధారాళముగ వచ్చునో అప్ప

డితో తెలుగంత ధారాళముగ వచ్చెను. అవధాని తానింక తెలుగు మాటాడలే ననుకొనెను. ఇరువది యేండ్లు మాటాడిన మాతృభాష అతని హృదయములోఁ బొనుగువడ్డ నిప్పువలె నణగియుండెను. అప్పుడు ఆ పైనున్న తెల్లని దుమ్మును ఉఫ్ అని యూదెను.

మదరాసులో కురిసిన వర్షము లు తూర్పుతీరము వెంటబడి గంజాంజిల్లావఱకు ప్రాకుటకు బదునెని మిది దినములు పట్టెను. పర్లాకిమిడిలో ముసురు పట్టెను. కొండలు నడవులు సమృద్ధిగానున్న యాదేశము మేఘునకు ప్రతాపభూమి యయ్యెను. చిటిపొటి సెలయేళ్ళు గురుగురులాడుచు, బలములేని నేల బురబురలాడుచు పిసాళించెను. వర్షర్తు శోభ గిరి ప్రదేశములలో చూడవలయును. దూరానికి మసకలుగా కనుపించు కొండలును, శిఖరములును ప్రాలిన మొయిళ్లలో దాచబడి నేల మట్టము పోసిన కట్టలవలె గనుపించును. ఒక చిన్న కొండ యొకప్రక్క కనిపించుచు రెండవప్రక్క మహానీలజలచ్ఛాదితమై చివర కనుపించక మిక్కిలి పొడుగైన కొండయేమోయన్న భ్రాంతి కల్పించు

టయు మెట్టునుండి క్రిందికిబడు సెలయేళ్లు దూరాన పొదలలో నిరికికొని తదగ్రసమానత మేఘములలో నంతరించినట్లు కనిపించుటయు, నప్పుడే జల్లుపడి తొలగిపోయిన మొగిలు వశమున సద్యః ప్రియ సమాగమ పరిత్యక్త వధూ సౌందర్యమును వెల్లడించుచు, రెండు నిమేషములక్రింద తడిసిన రాళ్లు మరు నిముసము: వీచిన గాలికి తడి యారుచు నారుచు, నొక విచిత్రమైన పాదరస మభివ్యాపించిన శోభ వెడలగ్రక్కుటయు, ఏనాటిదో గ్రీష్మపు వెట్ట సన్నగా నూదుచున్న కొండగుహాలు, కోష్ణప్రియా మధురకోప నవ్యానుభూతి కలిగించుటయు నాప్రదేశములయందలి బహుళ శోభైకదేశములు. పర్లాకిమిడిపై వానలు కురియుట యొక విలక్షణముగా కురియును. ఎప్పుడో వర్ష ధారా సాంతత్యము. సామాన్యముగా నెడపెడ జల్లులు కొట్టుటయు మరల తొలగిపోవుటయు; ఆ దేశములో కాపులను పైనుండి క్రిందికి ముంచి యెత్తవలయునని మేఘుడు పడు మహాప్రయత్నము లేదు. అతనిని మిక్కిలిగా నొడ్డుకొన వలయునని వారి ప్రయత్నము లేదు. గిడుగులు, శిరస్సులకు ధరించుకొని నిత్యము పని చేయు నచ్చటి పొలము కాపులకు మేఘు డొళ్లు

తడుపునని భయమేలేదు. వారి రక్షాప్రయత్నమంతయు శిరస్సులకు మాత్రమే. ఆ జనము మేఘుని యందు మహాప్రత్యయము కల జనము. శరీరము మేఘుడు తన వర్షధారలకు నెంతగా గురిచేసినను వారు శిరస్సుమాత్రము శుభ్రముగా చూచుకొందురు. ఆ పొలము చలిజ్వరములకు నిల్లు. ధనవంతులు నధికారులు బలిసి యుండినను పొలముచేయు రైతుమాత్రము బక్క-చిక్కి శల్యమాత్రావశిష్టుడుగా నుండును. ఆ రైతు కడుపునకు చాలని తిండితో నధికారుల నిత్యభయముతో దిన దిన గండము నూరేండ్లాయువుగా మనుచుండును.

తా నుద్యోగములో జేరకముందు అవధాని పర్లాకిమిడిలో నొక వార ముండి పోవుటకు నిశ్చయించుకొని తాను వచ్చుచున్నానని పర్లాకిమిడికి జాబు వ్రాసెను. ఆ జాబు చూచినప్పుడు వివేకానందుని యిల్లు రామచంద్రుడు వచ్చుచున్న వార్త విని శబరి యాశ్రమము పొందినంత యలజడి పొందెను. వివేకానందుడు తనకున్న భారములలో నొక భారము తగ్గినంత తేలికపడెను. శాంతమ్మ యల్లుడు వచ్చు నన్నంత యుత్సాహము పడెను. వారు పది పదునేడేండ్లు పర్లాకిమిడి నివాసము

చేయుటవలన నాహారపదార్థములలో, జాతి మార్పు పొందినను నింగువ కట్టిన గుడ్డవలె యచ్చముగ కారము నుప్పును మరచిపోలేదు. అన్ని యాహార పదార్థములందును బెల్లము కలుపుకొనుట, చివరకు నావకాయలోగూడ బెల్లమే వేసికొనుట, యన్ని కూరలలో బెల్లము మిశ్రముచేయుట యలవాటయ్యె నప్పుడప్పుడు ఉప్పు కారములు తినుటకు కలదు. అతడు వచ్చుచున్నాడని వడియాలు నప్పడాలు చేసిరి. శాంతమ్మ యాడుబిడ్డతో నల్లుడు వచ్చినపుడు కూరలలో బెల్లము వేయవలదని చెప్పెను.

లలిత బావ వచ్చుచుండెననగా నొక విచిత్రపు గదలిక పొందెను. ఆమె యవధాని రాకముందే పూటకొక చీర ధరించుట మొదలుపెట్టెను. ఏపుస్తకము చదువబోయినను అక్షరమక్షరము మధ్య రెండు క్రొత్తక్షరములు వచ్చి కనిపించుచుండెను. ఆమె రెన్నాళ్లు కళాశాలకు సెలవుపెట్టెను. ప్రాత యుత్తతములు తీసి చదివినవే వందసారులు చదువుట యామెకు పని యయ్యెను. శారద మరియొకరీతిగా నుండెను. ఆమె సహజముగా తక్కువ మాటలాడును. ఆ రెండుమూడు రోజులు నామె వాచాలత

మించిపోయెను. ప్రతి మాటలో నేదోయొక సూచన. లలిత యున్నప్పుడు ఆ సూటిపోటి మాటలకు మితిలేక పోయెను. లలిత యచ్చముగా నింగ్లీషు భాషయే చదువుకొనెను. శారద కొంచెము తెలుగు సంస్కృతములు కూడ చదివెను. ఆమెకు నాయికానాయకుల భేదములు, సహాయులు, దూతికలు నీ సంగతి తెలియును. పరాచికము లన్నియు సీతతో చెప్పినట్లు లలిత వినుచుండగా నాడును. 'సీతా! అభిసారిక యనగా నీకేమో తెలియునా? భర్తకొఱకు నొక సంకేత స్థలమునకు నలంకరించుకొనిపోవు నాయిక' అని శారద సీతతో ననెను. ఇది వంద సూటిపోటిమాటల చివరిది. లలితకీ మాటతో కోపము వచ్చెను. "శారదా! నోరుమూయుము. నేను భర్తకొరకు నియమిత స్థలమునకు పోవుటలే"దనెను. శారద-'నీవు పోవుచుంటివని నేనన్నానా? నీవు పోవుచుండుట లేదు గనుకనే యీ ప్రసక్తి నీదికాదు. నిన్ను గురించి నిజముగా నేను చెప్పవలయు. నన్నుచో నభిసారిక యని యేల చెప్పుదును. వాసక సజ్జిక యని చెప్పుదును. ఒసేవు సీతా, వాసక సజ్జిక యనగా నీకేమో తెలిసినట్లు నటించెదవేమి? భర్త వచ్చు

నసగా నలంకరించుకొని యన్నియు సిద్ధముచేసి యెదురుచూచు నాయికపేరు వాసక సజ్జిక' యనెను దానితో లలిత కరకాలి మంట నెత్తికి వచ్చెను. అప్పుడు వారు కాఫీ త్రాగుచుండిరి. లలిత పోర్సిలేన్ గిన్నెయు సాసరును నేలకువేసి కొట్టెను. అవి పగిలిపోయెను. చిన్నప్పుడు లలిత కోపము వచ్చినచో బుగ్గమీద కొట్టుట,దండమీద గిల్లుట చేయుచుండెను. మూడునాలుగేండ్లనుండి యది మానుకొనెను. ఒకసారి శారద తిరిగి కొట్టుట, తల్లిదండ్రులు జోక్యము కలిగించుకొని లలితను చీవాట్లు పెట్టుట జరిగెను. అప్పటినుండి లలిత శారదను కొట్టుట మానెను.

ఆమె యిప్పుడు కోపమువచ్చినచో గిన్నెలు పగులకొట్టుట, పుస్తకములు నేలమీద విసరివేయుట, ఏదైన కాగితము విషయములో తగాదా వచ్చిన ఆ కాగితము చింపివేయుట యొక పూట భోజనము మానివేయుట- ఇట్లే కోపము తీర్చుకొనుచుండును.

అవధాని వచ్చుచున్నాడని వారితండ్రి యొక క్రొత్త టీసెట్టు కొనెను. ఇప్పుడు పగులకొట్టిన గిన్నె ఆ సెట్టులోనిది. ఆ మ్రోతకు తండ్రి వచ్చి

చూచెను. సామాన్యముగ నతడు కూతుంద్రను కోపించడు. కాని యుపధానికోసము తెచ్చిన యీ గిన్నె యిట్లు పగిలిపోగా నతని కోపము వెనుక ముందు చూడ లేదు. ఆయనకు సహజముగ కోపమే రాదు. సహజముగా మూఢవిశ్వాసములు లేవు. అయినను ఆ గిన్నె పగిలిపోవుట యొక యశుభసూచకముగా నాయన కనిపించెను. అని పించినది కోపోద్వేగములో మాటగా బయటకు వచ్చెను. ఒక్క కోపపుసమయమునందలి మాటలో కొన్ని యేండ్లు కాదు. హృదయాంతర్నిగూఢము లైన భావములును త్రవ్వకొనివచ్చును. ముగ్గురు కూతుంద్రకు పెండ్లి కాలేదని యతని మనస్సులో సంవత్సరములుగా దాగియున్నది, ఒక దిగులప్పటి కోపమునకు తీక్ష్ణమైన మాటగా బయటకు వచ్చును. అత డిటు లనెను. 'నీ యదృష్టము కొలది గిన్నె పగులగొట్టితివి. అతడు వచ్చి నిన్ను పెండ్లి యాడునని యనుకొంటిని. నీవీ గిన్నె పగులకొట్టు టతో నా విషయము తేలిపోయినది. ఇట్టి దౌర్భా గ్యపు మొగముల నతడు పెండ్లియాడడు.' ఈమాట లతో నొకసాధుజలమైన సరస్సులో రాయివిసరెనట్లు య్యెను. లలిత వెక్కి వెక్కి యేడ్వ నారంభించెను.

ఆ యేడుపు పట్టుకోరాకుండ నుండెను. శారద మొగములో కత్తివాటు వేసిన నెత్తురుచుక్క లేదు. దీనికంతకు నామె తానే కారణ మనుకొనెను. లలిత యచ్చటనుండి చరచర లేచిపోయి తన గదిలో తలుపు వేసికొని యేడ్చుచుండెను. సీత వేటకాని పొంచిన స్థలమునుండి దూరముగాబోయి యెచ్చటనో భయముపోని కన్నులతో, భయమువలన కలిగిన గగుర్పాటు తీరని మేనితో సర్వశరీరాణు సంచలనము తోచుచున్న లేడిపిల్లవలె లేచి, నాయనమ్మ కడకు పోయెను. వివేకానందుని కోపము ప్రదర్శింపబడుట మాత్రమే లలితయందు. ప్రసరించుట ముగ్గురియందును. ఆ సంగతి ముగ్గురకును తెలియును. సీత తానేమి చేసెను. ఆయింటిలో తానుండుటయే తప్పుగా సీత కనేకములైన పర్యాయము లనుభవము కలిగెను. తనకు తన తండ్రియే వివాహము చేసి పోయినచో తన యప్పగార్లవలె దానుకూడ సుఖముగా నుండెడిది. ఇప్పుడట్టి సుఖము లేదు.

ఈ సందర్భముతో మూడవనాడు అవధాని వచ్చువరకు వారి యింటిలో దుమ్మైకొనెను. వెలుతురు లేదు.

అవధాని రాకతో నాయింటిలో నొక్కసారిగా నా మూన్నాళ్లటి ముడుచుకొనుటలు, బిగింపులు విరమింపు కలిగి యందరి మొగములలో నుత్సాహామే రేకెత్తెను. అతనిరాక పర్వత ప్రాంతములందలి యిసుక నేలమీాద కురిసిన వర్షము వలె నుండెను. ఆ వర్షము ఏమూలనో రాళ్లమధ్య నొకమూల మన్నుపట్టినయెడ నొక మొలక మొలిపించవచ్చును. తక్కిన సైకతస్థానమంతయు నీళ్లలో మునిచియెత్తును. త్రవ్వినంత మేర తడి కనుపింప జేయును. కాని మొక్క మొలపించునా? బీజాధానయోగ్యత కలిగించునా? తార్కికులు అది క్షేత్రదోష మనవచ్చును. క్షేత్రమునకు బీజమునకు నవినాభావసంబంధము కర్మలో నైననుండును. ఒకటియే వర్షము గిరిశేఖరముల, పల్లపు భూముల, మెట్టచేల, నూషర స్థలముల వర్షించును. భిన్న స్థలములయందు భిన్న ఫలదాత యగును. ఫలదాత యగుననుటకన్న భిన్నముగా ఫలించునని చెప్ప వచ్చును. ఈ వర్షబిందువులు జీవబీజములు. ఆ జీవుడు పూర్వ సత్కర్మవంతుడేని మంచి క్షేత్రము నందు నిహితు డగును. దుష్టకర్మ చేసినవాడేని

యూషరములందు వర్షించును. కాన కర్తృత్వము వర్షముననే పట్టుచున్నది.

లలితా శారదా సీతలు బావరాకతో రెన్నాళ్ల క్రిందటి వివేకానందుని కోపముతో అంతర్నిగూఢమైన ప్రేమభావములతో పరస్పర మాత్సర్యము వివాదములు పోయి యతనిని ప్రసన్నుని చేసికొనుటకే ప్రయత్నించిరి. బావ యేది కావలయునన్నను సీతయే తెచ్చియిచ్చును. లలిత శారద యేమనునో యను భయముతో ముందడుగు వేయలేదు. శారద యవధాని వచ్చిన మొదటి పూటయే యుత్సాహమును ప్రకటించెనుగాని మరుపూటనుండి తనసహజస్థితినే పొందెను. లలిత తాను పడిన యుత్సాహమంతయు తనలోనే యడుముకొనెను. ఆమె కొకసంగతి తెలిసెను. మనసులో నున్న కోర్కి బయటకు వెలిపుచ్చరాదు. లోకము సానుభూతిమనస్కమగుటకు ముందే నిందాబుద్ధియగును. రంధ్రాన్వేషియగును. ఆ లోకము ఊరిబయట కానక్కరలేదు. ఇల్లు కావచ్చును, చెల్లెలు కావచ్చును. కాఫీగిన్నె పగులగొట్టినప్పుడు తండ్రి యనినమాట లలితగుండెలో బాకువలె గ్రుచ్చుకొనెను. ఆ పుడు నిముసమునకు సెలవేయుచుండెను. 'ఈదౌర్భాగ్యపు

మొగమును అత డసలే పెండ్లిచేసికొనడని'. తానొక పూట నవధానికి కనుపించక యుండినచో నతడు తన్ను గూర్చి లలిత యేదని యడిగినచో తనయందతని ప్రేమ తగ్గలేదని యనుకొనవచ్చునని లలిత భావించి యొకపూట యతనికి గన్పించకుండ తనగదిలోననే యుండెను. ఆపూట మైపోయినతరువాత తన్నత డడిగెనో లేదో యెవనిని కనుగొన్నదో తెలియునో యామెకు తెలియలేదు. శారద నడుగుట యామె యుద్దేశములోననే లేదు. తల్లి నడిగినచో నామె యేమనుకొనునో? ఎన్నివిధముల నూహించినను అడుగదగిన దొక్క సీతయే. సీత పసిపిల్ల. శారదకు వలె దానికి మాత్సర్యము లేదు. దొడ్డిలో సీత నొంటరిగా కలుసుకొని "ఏమే సీతా, బావ యెచ్చటికి పోయెను?"

సీత:—శారదయు నతడును కలిసి కొండకడకు షికారు పోయిరి.

లలిత:—('న న్నడుగలేదా' యన్నమాట నోటి దాకవచ్చి తమాయించుకొని) నీవు వెళ్లలేదేమి?

సీత:—అత్తయ్య 'యింట్లో పనియున్నది, నీవు వెళ్ల వద్దనెను.

లలిత:—నాన్నగారు నన్నుకూడ షికారు తీసుక పొమ్మని చెప్పలేదా

సీత:—చెప్పలేదు.

లలిత కన్నులలో నొక కోప ముదయించెను. ఆ కోపము ఎవరిమీద అని ప్రశ్న పుట్టినచో ప్రస్తుత మెవరిమీదను అని కాదు. దాని భవిష్యద్వృద్ధి సూచించు బీజములు ప్రస్తుత మస్పష్టముగా నున్నను క్రమముగా నది తల్లిదండ్రులమీద వృద్ధి పొందునని ఎచ్చటో వ్రాసియున్నది. లలితయొక విధురించాలనముతో మేడమీదికిపోయెను. ఆ నడిచిన నడక, ఆ విదలించిన చీరకొంగు విదల్పు, ఆ యూగిసలాడిన జడ, ఆ వేసిన పాద విన్యాసము, నాచులో చిక్కుకొన్న కాలు విదలించిన హంసది, గొంతు జీరుకపోయి కోకిల ముక్కుతో రాచిన మావి చివురిది, పైని గరుడి యాడిన నీడ పడిన పాపడుచుది, కొండచిలువ కాటును విదలించుకోగా రెక్కచాచి విచిత్రచంక్రమణము చేసిన నెమలి పడుచుది. సీత యా నడకనుచూచి నివ్వెరపోయెను. తాను లలిత నేడేండ్లుగా నెరుగును. ఈ కోపమూమెయం దిదివరకు చూడలేదు. ఎందుకు చూడలేదు? లలితకు కోపమెప్పుడు వచ్చినను అట్లే

యుండును. చూచుటలో తనలోనే యేదోమార్పు వచ్చెను. సీత తాను మూన్నాళ్ళ క్రిందటి సీత యేనా? సీత తనలో తాను పట్టరాని సీత మున్నెప్పుడు కాలేను. సీతలో నొకకలవరము జనించెనా? తాను వాహ్యాళికి పోకుండచేసిన మేనత్తమీాద నొక సన్నని యసూయ సీత యెడదలో నేల కలిగెను. ఈ రీతిగా మేనత్త పూర్వ మెన్నిసార్లో యాపెను. అప్పటప్పటి కేమి భేదము? బావ పరదేశము లేగి వచ్చినాడు. కలెక్టరుద్యోగములో నున్నాడు. పెద్ద యాస్తిపరుడు. అందగాడు. (అవధాని నిజమున కందగాడు కాడు. కాని దీర్ఘ శరీరుడు, కఠిన బాహువు, ఉన్నత వక్షస్కుడు.) అతనితో గలసి వాహ్యాళి పోయినచో నంతటి గొప్పవానికి తాను మేనమరదలని నలువురు తన వంకనే చూతురు. అవధానిగారి మరదండ్రని జనము చెప్పుకొందురు. స్త్రీలు తనవంక నొక యసూయతో చూతురు. పురుషు లొకగౌరవముతో తిలకింతురు. బావతో వాహ్యాళి పోవుట యదియొక యనుభవము. బావ తనతో మాటాడగా, పలుకరించగా పరిహాసమాడగా, నది యొక మనస్సునకు పెట్టిన చక్కిలిగింత. ఈ యానందము మేనత్త తనకేల

లేకుండ చేసెను. లలిత కోపముతో, నూహాలో సీత కీ ధోరణి కలిగెను. మూన్నాళ్ళనుండి తన యెదలో నేదో తెలియకుండ నున్న బరువుయొక్క నిజమైన యర్థమిది కాబోలు. తనకున్న యీ యాశలో తప్పేమున్నది? ఇది యన్యాయము కాదు. అసభ్యము కాదు. అవాంఛనీయము కాదు. నెల, రెండు నెలలనుండి యా యింటిలో తన స్థితిలో మార్పు వచ్చెను. ఏదో సూచనగా నాయనమ్మ తన డబ్బు తన పినతండ్రి వాడుకొనెనని చెప్పినది. తరువాత నలుగురును దానిని మాటలక్రింద బెట్టి వెలికి బోకనీయలేదు. తన కప్పుడా యూహాయు తోచలేదు. అవధానికి లలితకు వివాహము, వివాహ మని ఘోషించిన యిల్లు బావవచ్చినతరువాత నా ప్రస్తావనయే యేల చేయదు? ఇంటిలో ననే లలితమీదకన్న శారదమీద నెక్కువ యభిమానము. లలిత కోపమువచ్చి భోజనము మానివేసినచో నెవ్వరును పిలువరు. బలవంతముచేయరు. బతిమాలరు. శారద కొక వేయి నీరాజనములు పట్టుదురు. తన మేనత్త తన్నిందుకని వెడలవద్దని చెప్పియుండును. శారదయును, బావయును, చనవుగా నుండవలయును. అయినచో లలిత, కానిచో

శారద, యవధానికి భార్యలు కావలయును. తాను వారి మార్గమున కడ్డంకిగా నుండునని మేనత్త వల దన్నది. ఇది మేనత్తయూహయేనా? పినతండ్రి పిన తల్లుల భాగముకూడ కొంత యీ యూహలో నున్నదా? అయినను తానేమి బావను ప్రేమించెనా? బావ భర్తకావలయునని యనుకొనెనా?

ఈ యూహలో మేనత్త పిలిచెను.

అవధాని శారదలు వాహ్యాళిపోయిరి. నడచినంతసేపు శారద దూరముగానే నడచెను. కొండదగ్గరకు పోయి రోడ్డుకు దూరముగా మనుజులు కనిపించని చోట నిద్దరును కూరుచుండిరి. శారద యవధానికి దూరముగా కూరుచుండెను. అవధాని యింగ్లండులో స్త్రీలు, వారి యాచారములు, వారిపోకిళ్లు, కొన్ని తన యనుభవములు మంచి చమత్కారముగా చెప్పెను. శారద పగులబడి నవ్వెను. ఒకసారి యీ కథ చెప్పుచు లేచి నిలుచుండి తన కూర్చున్న చోటునుండి శారద కూర్చున్న యెడకు, నచటినుండి తన కూర్చున్న రాతి యెడకు పోవుచు వచ్చుచు, మధ్య నొకసారి శారద చేయిపట్టుకొని "యిట్లు జరిగినది సుమా" అని లాగెను. శారద వెంటనే తన చేయి వెనుకకు తీసికొనెను. ఆమె

మొగములో నొక దూరభావము వెంటనే తోచెను. అవధాని సమగ్రముగా నామె ప్రకృతిలో నున్న బిగువు గ్రహించి, గ్రహించని వానివలె యూరకే తన చెప్పుచున్న కథారసనిమగ్నునివలె నటించెను. మరల నామెను తాకలేదు. ఆమె మరల నవ్వు టకు పదినిముసములు పట్టెను. ఆ నవ్వుకూడ మునుపటివలె కథానిమగ్నానందముకాక మర్యాద హాసమువలె కనుపించెను.

అవధాని :—శారదా! నీ వసాధ్యురాలవు.

శారద :—అనగా?

అవధాని :—నేను చెప్పినవిషయము లన్నియు చాల నున్నతభావసంబంధములు. నీవు వాని నన్నింటిని చక్కగా గ్రహించినావు. స్కూలుఫైనలు పరీక్షయైన వారికి నీయంత తెలివితేట లుండుట కష్టము.

శారద:—మనము మేనత్త మేనమామ బిడ్డలమే కదా! నీ తెలివితేటలు కొంత నా యొద్దను నుండును.

అవధాని :—శారదా! మేనత్త మేనమామబిడ్డలము కనుకనే నీ వట్లు నాతో మాటలాడ గలిగితివి.

శారద :—నే నేమి తప్పు మాట యనలేదే.

అవధాని :—ఏమియు ననలేదు. నీవే చెప్పితివి కదా. మన యొకరి తెలివితేట లొకరికి సరిపోయిన వని.

శారద :—నేనాడుదానను. నీవు మగవాడవు. నీవు పరదేశములు పోయి పెద్దపెద్ద చదువులు చదివి వచ్చితివి. నీకును నాకు పోలిక యేమి?

అవధాని:—అట్లనకుము. నాకొక సంగతి బాగుగా తెలియును. స్త్రీ పురుషులు కలిసినపుడు పురుషునకు తాను చదువుకొనిన చదువే చదువుగా భాసించును. స్త్రీకి చదువుకోని చదువు కొంత భాసించును. స్త్రీ, స్త్రీయగుటలోననే ఆ చదువున్నది. నాకీ విషయమును గూర్చి యెప్పుడు నాశ్చర్యమే.

శారద తల వంచుకుని కొంతసేపు, అతని వంక చూచుచు కొంతసేపు మాటాడకుండ నుండెను.

అవధాని:—ఏదియో యాలోచించుచున్నావు.

శారద :—ఏమియును లేదు.

అవధాని:—కా దేమియో చెప్పుము.

శారద:—నీ వీ విషయము నింత యూహించుటకు
నింగ్లండులో నీ వెచ్చట దొరికినది?

ఈమాటతో నవధాని తలక్రిందులయ్యెను. చమత్కారముగా నవ్వి యామెమాట తేలికగా త్రోసి పుచ్చవచ్చును. కాని యవధాని యాత్మలో నున్న ఏదో యొక రహస్యమో, ఒక కలవరపాటో, అతని నట్లు చేయనీయక యతని మొగములో, నతని కన్నులలో నొక తీక్ష్ణభావమును స్ఫురింప జేసెను. శారద యాభావమును గుర్తుపట్టెను. ఆమె గుర్తుపట్టెనని యవధానికి తెలిసెను. మరల తిరిగి యింటికి బోవుచుండిరి. ఇంకనూరిలోనికి బ్రవేశింతు రనగా నవధాని, 'శారదా! నీ కెన్నేండ్లు?' అని అడిగెను. శారద ఎందుకనెను. అని తిరిగి 'పం దొమ్మి దేండ్ల'నెను.

ఇంటికి బోయిరి. రాత్రి భోజనములకు నంద రును గలసియే కూర్చుండిరి. ఆ సమయములో శారద మరల నవధానితో బరాచికములు, హాస్య ములు, చమత్కారములు జరుపజొచ్చెను. చేయి చాచినచో దూరమ్ము, చాపకున్న నందుబాటులో నుండును. ఇది చమత్కారమైన ప్రకృతి.

లలిత నలుగురితో గలిసి భోజనమునకు వచ్చు టయా? రాకపోవుటయా? రానిచో దనకుఁగోపము వచ్చినదని నలుగు రనుకొందురు. ఆ కోపమెందు లకు వచ్చినట్లు? నిజమైన సమాధానము నలుగురికి తెలిసినచో నవ్వుబాట్లగును. ఎవరికి స్ఫురింపక పోయినను శారదకు తప్పకుండ స్ఫురించును. అది తనమీఁది మాత్సర్యమువలన సన్నగా కొంటెగా నూదును. నలుగురకు తాను లోకువయగుచు. అందుచే నామె లోనున్న స్త్రీ సహజమైన వివేకము భోజనమునకు నలుగురితోపాటు పొమ్మనియే బోధించెను. భోజనముముందు తల్లి 'ఏమే లలితా! ఒంటిలో సుస్తీగా నున్నదా?' యని యడిగెను.అది యుపశ్రుతిగా నందుకొని లలిత భోజనము చేసినంత సేపు సుస్తీ నభినయించెను. అంతటితో మరల లలిత ప్రస్తావన నెవ్వరును చేయలేదు. లలితకు గుండెలో నోర్చరానియంత కోపము వచ్చెను. తనకు సుస్తీ యేమిటి? ఎచ్చటనుండి వచ్చెను? తల్లి యట్లడుగుట యేమిటి? తన కిష్టములేనిచో నవధానిని శారదకే యీయవలయునని యున్నచో యిచ్చుకొననిమ్ము. తల్లిదండ్రులు లిత్తుమనుచుండగా నెవరు వలదందురు. తా నవధానిని కావలయు

నన్నదా? వారే యిత్తునన్నారు. సరే యిత్తురను కొన్నది. "అమ్మా! నీవు బావతో షికారు పోలే దేమి? నీవు గదిలో ముసుగుపెట్టుకొని పండుకొం టివి. ఆచీరకాదు. బావ కీ చీర యిష్టము. మీరిద్దరు కలసియున్నప్పుడు అతనికి నీమీద ప్రేమకలుగునట్లు గా ప్రవర్తింపుము" అని తల్లి యిట్టిమాటలు చెప్ప వలయును కాని "నీకు సుస్తీగా నున్నదా? కారపు పొడి వేసుకొని తినుము. ఏమిటీ వెధవ మాటలు. నా కొడలు మండిపోవుచున్నది". ఈ ఊహాపరం పర లలితలో నైదు నిమేషములు సాగెను. ఆమె చివర కా యొత్తిడి పట్టుకొనలేక చారును మజ్జిగయు తినకుండగనే లేచిపోయి చేయి కడుగుకొనెను. మేనత్త 'అదియేమే?, అదియేమే!' అని యాతుర్దా పడుచున్నను తండ్రి 'దానికి శరీరములో సరిగాలేదు కాబోలును పోని'మ్మనెను. లలిత పోయి గదిలో పండుకొని కోపము, చిరాకు, తల్లిదండ్రుల యెడ ద్వేషము ననవసరముగ సీతాశారదలయెడ నేవ గింపు నూరకే యనుభవించెను.

'తండ్రి! తండ్రి. దానికి శరీరములో సరిగా లేదు కాబోలునట. ఎందుకు లేదు? ఎప్పుడును నేను వీరి నిజమైన కూతునే కాదు. వారి ప్రేమ యంతయు

శారదమీదనే. నామీద నెప్పుడు శీతకన్నే! శారద యేమో బొప్పి! పసిపిల్ల. పాలు త్రాగుచున్న పిల్ల. నేను నలుబదియేండ్ల దానను. నాకు లోకమంతయు తెలియును. నా యాకలిదప్పులు నా యవసరానవసరములు, నా మంచిచెడ్డలన్నియు నాకు తెలియును. అది పసిపిల్ల గనుక దానిని వేయికన్నులతో కాచికొనవలయును. దానినడుమ, నానడుమ నొకభేదమే కదా వారడి. తల్లిదండ్రుల కింత పక్షపాతము పనికిరాదు. ఛీ ఛీ,' అని యీయూహాలే త్రిప్పి త్రిప్పి పది రకములుగా ననుకొని కొంతసేపు కన్నీళ్లుపెట్టుకొని చివరకొక పుస్తకము తీసి చదువ నారంభించెను. ఆకలి వేయజొచ్చెను. కోపము కొలంది నట్లే నిద్రపో నెంచెను. కన్నుమూసినను నిద్ర పట్టలేదు. ఆకలి కొంతసేపటిలో దప్పికగా మారెను. మఱి పది నిముషములలో నాకలి దప్పికలు రెండును కలసి యేదో యొకపదార్థము లోనికి పోవలయు ననిపించెను. చివరకు తెంపుచేసికొని గదితలుపు తెరచి యింటిలోనికి పోయెను. అందరును నిద్ర పోవుచుండిరి. పడమటింటిలో లలిత మజ్జిగ తప్పేల కోసము వెదకెను. ఆ వెదకుటలో నుట్టిమీద పెట్టిన నేతిగిన్నె చేతినుండి జారి క్రిందపడెను.

నేయి నేలమీాద నొలికిపోయెను. ఆ ధ్వనికి మేన త్త యు, తల్లియు, తండ్రియు మేల్కొని యింటిలో నికి వచ్చి చూచిరి. రెండువీసెల నేయి ఆనాడే ప్రొద్దున తెచ్చిరి. సగానికి సగము నేలపాలాయెను. పడమటింటి నేల గచ్చు చేయకపోవుటవలన క్రింద పడిన నేయి మేనత్త యెత్తుచుండగా మంటితో కలసి వచ్చుచుండెను. వివేకానందుడు విసువుకొని 'యీా మన్నుకూడ నందులో తగులబెట్టకుము. వేణె యొక తప్పెలలోనికి దీయు' మని యనగా నా తగులపెట్టుట యన్నశబ్దము లలితను కోపముచేతనే కాక సిగ్గు చేతను, భయముచేతను తగులబెట్టెను. లలిత పడమటింటిలోనికి వచ్చిన పని తెలిసిన తరువాత తండ్రిచేసిన వ్యాఖ్యానము: 'నీ కాకలిగా నున్నచో ఎవరు తినవద్దన్నారు? అందరిని యిచ్చట బతిమాా లుటకు ఎవరు పడియున్నారు? అందరు దొరసా నులే. నానెత్తిమీాద కూర్చున్నారు' అని.

మరునాడు పర్లాకిమిడి ప్రజలు అవధానికి స్వాగత సభ చేసిరి. ఆ దినమెల్ల నవధాని తన పని తాను చూచుకొను చుండెను. సభ నాల్గు గంటల సాయంవేళ మొదలు. రెండు గంటలు మాత్రమే జరుగవలయును. సభకు వివేకానందుడు, భార్య,

ముగ్గురు కూతుండ్రును వచ్చిరి. కాలముగడచినచో నందరి మనస్సులలోను శోకములు నుత్సాహములు చల్లారును. లలితకూడ నిందుగ ముస్తాబై వచ్చెను. శారద తన మొగములో నిత్యముగా నుండు నొక పరిహాస రేఖను కూడ తోచనీలేదు. ఏమైన మార్పు కలిగినచో సీత మొగములో కలిగినది. ఆమె కొక యకారణోత్సాహము కలిగెను. అది యెందుకో తెలియలేదు, సభయంతయు నవధానిని పొగడుటతో సరిపోయినది. వివేకానందుని కుటుంబము నంతకు నాపూటతో నొక క్రొత్త మర్యాద, యొక నూతన గౌరవము కలిగెను. అవధానికి స్వాగతపత్రము చదివినప్పుడు, పుష్పమాల లలంకరించినపుడు, వారి కుటుంబమంతయు నా నమస్త గౌరవము ప్రతివారును తమకు తమకే జరిగినట్లు సంతోషించిరి. అప్పుడొక వివేకానందునిస్నేహితుడైన పెద్దమనిషి లేచి నిలుచుండి అవధాని యవివాహితుడని, సౌశీల్యవంతుడని, శీఘ్రుమే వివాహము కావలయునని యాశీర్వదించుచు నొక పుష్పమాల నతని మెడలోను, మరియొక పుష్పమాల లలిత మెడలోను వేసెను.. ఊరిలో కొందరకు కర్ణాకర్ణిగ లలితను అవధాని కిత్తురని తెలియును. వారందరు

సంతోషించిరి. శారదా సీతలు మిక్కిలి సంతో షించిరి. శారద మొగములో నొక విచిత్రమైన మందహాస మంకురించెను. ఆ మందహాసములో లలితకు జరిగిన గౌరవమునకు, ఆమెయొక్క యాశా ప్రోద్భలకమైన యీసన్ని వేశమునకు నొక యుత్సా హము, నామె తనయందు పొందిన మాత్సర్యము నందు వృథాసందేహ మన్న యొక సాధునిందయు గోచరించెను. సీత మొగములో నొక నిండుదనము తోచెను. ఆ నిండుదనములో నొక సంతోషము లేకపోలేదు. లలిత మొగములో నొక భయము, ఒక సిగ్గు, ఒక భావాసహ్యాత కలిగెను. పెదవిమీాద నుదయింపబోయిన మందహాసము విరుపుపొందెను. అవధానికి తనకును లలితకు నొక్కసారిగ పుష్ప మాలలు వేయుటవలన మనస్సులో నొకకలవరము కలిగెను. అతడు కూర్చున్నవాడు కూర్చున్నట్లే కన్నులలో భయముపడెను. చూచినవారది మధుర లజ్జ యనుకొనిరి. అతని కనులు, మొగము జేగు రించెను. చూచినవా రుద్వేగప్రకృతి యనుకొనిరి. అతడు లేచి నిలుచుండి 'వలదు వలదు. ఆమెను నేను వివాహాము చేసికొనుటకు వీలులేద'ని చెప్పెద ననుకొనెను. అతడు లేవలేదు, నిలుచుండలేదు.

అతని నోటివెంట మాటయు రాలేదు. సభ యై పోయిన తరువాత వివేకానందుని కుటుంబమంతయు స్వగృహోన్ముఖులై పోయిరి. అది యేదో కూడ బలుకు కొన్నట్లు, నందరు లలితయు నవధానియు కలసి వాహ్యాళికి పోదురన్నట్లు ప్రతి చిన్నమాట యందు, చూపునందు, చేతయందు నవధానికి స్ఫురించెను.

చివరకు తప్పను లేదు. దారిని నడచినంతసేపు లలిత యొక మార్గ్యమునే వెల్లడించెను. అతనికి కొంత దూరదూరముగా పోవుట, అతడు మాటాడి నప్పుడు మిక్కిలి దగ్గరగా నడచుట, మాటిమాటికి తన కన్ను లతనిమీదనే నిలుపుట-యిట్లు నడుచు చుండెను. అవధాని లలితతో సాదాగా మాటాడు టకు నొక్క యరగంట పట్టెను. అప్పటి కతని మనస్సులోని యొక విచార ముపశమించెను. కడ చిన సాయంకాలము శారదావధానులు కూర్చున్న చోటనే నేడు లలితావధానులును కూరుచుండిరి. కూర్చున్న తరువాత పది నిముసములవరకు నిద్దరును మాటాడలేదు.

లలిత:—బావా! మాటాడకుండ గూర్చుందువేమి?

అవధాని—ఏమి మాటాడమందువు?.

లలిత:—నిన్న శారదయు, నీవు నిక్లే కూరుచుండిరా?

అవధాని:—శారదతో మాటాడుటయే కష్టము.

లలిత:—అయినచో నాతో మాటాడుట తేలికయా? మాటాడవేమి?

అవధానీ:—ఎట్లు? ఏమి మాటాడవలయునో తెలియుటలేదు.

లలిత:—నీ విం॰గ్లండునకు పోయిన తరువాత మొదటి మూడేండ్లు నుత్తరములు వ్రాసితివి. తరువాత మానితివి. ఆ మానివేయుటయే యిప్పుడు మాటాడక పోవుటకు హేతువా?

అవధానికీ మాటతో నేదో మనోవికారము కలిగెను. కలిగి-

అవధాని:—కాదు, కాదు, లలితా! ఏదో యాలోచించుచుంటిని. అవును. నీకప్పుడుత్తరములు వ్రాసితిని. ఆ యుత్తరములలో ననవసర ప్రసంగము చాల చేసితి ననుకొందును.

లలిత:—అది యనవసరప్రసంగ మనుకొనుచున్నావా?

అవధాని:—కాదు, కాదు. ఏదో వ్రాసితిని.

లలిత:—ఆయుత్తరము లింకను నాయొద్ద నున్నవి. రాత్రికి నీ కవి చూపింతును. వానిని భద్రముగా పెట్టెలో పెట్టి సువాసనాద్రవ్యములతోసహా కాపాడుకొనుచుంటిని.

అవధానికి నొక నిర్జీవమైన యాశాంకురము దానియందలి యన్యాయము మనసులో తోచెను. అతని పెదవిమీద రెండు విపరీతార్థద్యోతకములైన వాద్యము లాడబోయెను.

ఒకటి— 'లలితా! నీయందు నాకు ప్రేమ లేదు. ఆ యుత్తరములు నీవు తప్పుగా నర్థము చేసుకొన్నా'వని;

రెండు—'లలితా! నాయందు నీకంత ప్రేమయా? నేను ధన్యుడను' అని.

ఈ రెండువాక్యములలో నే వాక్యమును అతని నోటికి రాలేదు. కూర్చున్నవాడు లేచి కొంతదూరము నడచి తిరిగి మరల లలిత కడకు వచ్చెను. ఇంతసేపును లలిత యతని దన కన్నులతో ననుసరించుచుండెను.

అతడు వచ్చి కూర్చున్నతరువాత లలిత యొక పుష్పమును త్రుంచి యతనిమీద విసరెను. విసరివోయి యతనివద్ద కూరుచుండెను. అవధానికి తన

మనసులోని యాందోళనము సర్వమును నొక లిప్తలో నంతర్హితమయ్యెను. అతని చేతులు లలిత కంఠపరిష్వంగ ప్రయత్నము నందబోయెను. కాని యతఁడు నిగ్రహించుకొని నవ్వెను. ఆ నవ్వులో లలితకు ప్రేమ కనిపించెను.

లలిత:—నీవు నిన్న నన్ను వాహ్యాళి కేల పిలువ లేదు?

అవధాని:—నీవు కనిపించనేలేదు. పైగా నీవు నీ గదిలో పోయి యేకాంతముగా నున్నప్పు డెవ్వరు నిన్ను పిలువరట.

లలిత:—ఎవరు చెప్పిరి? నేను పిలువవద్దన్నానా? వాగే యెవ్వరును పిలువరు. నీవు నన్ను పిలుతు వని నేను చాలసేపు—

అవధాని యామెకు తన యెడగల ప్రేమచేత నానిముసములో తక్కిన సర్వమును మరచిపోయెను. ఆమెవంక చూచెను. శారదకు నామెకు పోలిక లేదు. ఈమె యనాఘ్రాత పుష్పము. శారద యాఘ్రాతపుష్పమేమో నని యతని కనుమానము. శారద కష్టసాధ్యబలవదాక్రాంతిగవేషణ. ఈమె సులభమధురప్రశ్రయ. ఈ భేదము లలితలో నేడేండ్లుగా బెంపబడిన యొక సన్నిహిత

భావఫలమేమో? తనకై యామె నిర్దేశింపబడినదని బంధువాక్కు లేకపోయినచో నీమెయు ప్రయత్న సాధ్యగా కనుపడెడిదేమో! అవధాని యామె వంక చూచెను. ఆ మొగము పసిమి దబ్బపాడువలె నుండెను. అంత పెద్దవియు చిన్నవియుకాని కనులు. తీర్చి యున్నతముగా నంద మొలుకుచున్న నాసిక. పరిపుష్టములైన యోష్ఠలు. కోసదేలిన చుబుకము. మిక్కిలి పెద్దవియు చిన్నవియుకాని వీనుదోయి. ఆమె శరీరము బక్కపలుచగా నామె కోలమొగ మునకు సరిపోయెను. తల ముడిచిన తీరు, కను బొమలు దిద్దిన తీరు, చీరతాల్చిన వైఖరి, సౌకు మార్యమును, సౌందర్యమునే వెల్లడించెను. ఆ సమ యములో నామెను కౌగిలించి ముద్దాడకుండ నుం డుటకు శుకయోగి కున్నంత నిగ్రహము కావలసి యుండెను. అవధాని 'లలితా! నాకు వివాహము మీాద బుద్ధిలేదు' అనెను. లలిత తలవంచుకొని కూరుచుండెను. కొంతసేపటి కతని మొగమువంక చూచెను. అతడు దూరనివిష్టదృష్టియై యామె వంక చూచుటలేదు. ఆమెకేమియు తోచలేదు. పరులు తనపక్షము వహించి చెప్పదగిన మాటలు తాను నోటితో నెట్లుచెప్పుట? శారదకూడ. తమ

వెంట వచ్చినచో నెంత బాగుగా నుండెడిది? శారద యిటువంటి వాదనలు మిక్కిలి నేర్పుతో చేసెడిది. ఈమాటకేమి సమాధానము చెప్పవలయును? ఆమె కొంతసేపూరకయుండి 'కొందరూరకే యాసలు పెంచుదు'రనెను. అవధానినిరుత్తరుడయ్యెను. అతడు, లలిత 'వివాహము లేక పోయిన నేమి?' యని యను ననుకొనెను. లలిత యీ మాటయతని కాశాభంగము కల్పించెను. అతడు లలితను చూచి, లలితా! నీకు నామీద ప్రేమయున్నదా? యని యడిగెను. లలిత ఒక విలాసముగా నతని వంక చూచి నవ్వి యింకొక పువ్వుకోసి యతని మీద విసరెను. అప్పుడొక చల్లని గాలికెరటము వీచెను. వర్షర్తువు వచ్చినను ఆలస్యము చేసిన మావి చివురునందలి మక్కువచేత, దీర్ఘకూజితము లేక గొంతు శ్రుతిచేసికొనుట మాత్రమే చేయుచున్న కోకిల యొకడు దూరపు చెట్టుమీద పైడి కంటివలె గొంతు సవరించెను. అప్పటికే సంజ మెరుపులు తగ్గి నీలిమలు వ్యాపించుచుండెను. ఆ నీలిమ పడమట పట్టిన మబ్బుచేత ద్విగుణీకృతమయ్యెను. దూరాన మనిసి కనిపించనంత చీకటి పడెను. లలిత యప్రయత్నముగ నవధాని దగ్గరకు

బోయి యతనిని గాగిలించుకొనెను. అతడును తత్కాలజనితావేశపరంపరావశంవదుడై యామెను కౌగిలించికొని ముద్దాడెను. వెంటనే యతడు కౌగిలి వదల్చుకొని దూరముగా పోయెను. ఇద్దరును కలిసి గృహాభిముఖులైరి. లలితకు నతని యీ సాయంకాలప్రవర్తన ప్రథమలజ్జగాఁదోచెను. ఆమె తన మనస్సులో తానే సిగ్గుపడెను. అతని కున్నంతబెరుకు తనకు లేకపోయెనని. లలిత వివేకవతి యయ్యును జనుల మొగములు చూచి, వారి కన్నులుచూచి, మొగములోని భావానుగుణముగా మారుచున్న రేఖలను చూంచి, జనుల గుండియలలోని లోతులు గుర్తించగల ప్రకృతి కాదు. ఒకసారి తన్ను కౌగిలించుకొన్న యవధాని తనయందు లగ్నమనస్కుడే యనుకొనెను. తక్కిన యతని దూరస్థితి, గివాహము కాకపోవుట, కాకుండ తన్ను కైవసము చేసుకొనుటయందు నిష్టము లేకపోవుటగా, నది యతని శీతౌష్ణ్యముగ నామె జమకట్టుకొనెను. చీకటిలో నొకరి మొగము లొకరికి కనిపించలేదు. అతని మొగములో నొక తీక్ష్ణ విచారరేఖ కనబడుచుండెను. ఆమె మొగములో నొక మధురానందరేఖ కనబడుచుండెను.

ఆనాడు రాత్రి లలిత అందరితో కలిసి భోజనమునకు రాలేదు. అందరును భోజనము చేసి పోయిన తరువాత తానొక్కతెయు వచ్చి యన్నము పెట్టించుకొని తిని పోయి గదిలో పండుకొనెను. ఆమె మనస్సులో నొక బరువు తీరినట్లుండెను. ఆ బరువు తాను పూర్వము మోసినట్లే లేదు. బరువు దిగినట్లు తెలిసిన తరువాత 'అబ్బో! ఎంత బరువు మోసితి' ననుపించెను. తాను తన తల్లిదండ్రులను గూర్చి యనుమానపడెను. ఈనాటి వాహ్యాళి తన తల్లిదండ్రులే సంతనపరచిరి. తనకు నవధానికి కలిపి పూలదండలు వేయించుటయు తల్లిదండ్రులు చేయించిన పనియే కావలయును. లేకపోయినచో నెంత స్నేహితుడైనను పరాయి పెద్దమనిషి యంత సాహసము చేయడు. తాను కడచిన దినము వాహ్యాళికి పోక పరుండుట తన దోషము. అనవసరముగా నందరిమీద ననుమానపడెను. అవధాని నిన్న శారదతో కూడ నిట్లే ప్రవర్తించెనా? అట్లెన్నటికిని జరిగియుండదు. శారద తనయం దెంత లఘుభావము కలదియైనను అత్యంతమైన యభిమానము కలది. తనయందు ప్రేమయు కలది. తనకు భర్తగా నిర్దేశింపబడినవానితో నామె మరొక రీతిగా ప్రవర్తిం

పదు. ఆహా! తల్లిదండ్రుల ప్రేమను గూర్చి యను మానపడిన వారిదే తప్పు. అందులో తన తల్లిదం డ్రులు—వివేకానందుడును-శాంతయు నన్వర్థనామ ధేయులు— ఇట్టి సుఖమైన యూహలతో లలిత నిద్రపోయెను. మరునాడు ప్రొద్దున నవధాని పర్లాకిమిడిదొరను చూచుటకు పోయెను. వెను కటి సాయంకాలపు సభకు రాజుగారు రాలేదు. ఏదో పనిమీదనుండి రానందుకు విచారించు చుంటి మని కబురంపెను. అవధాని తిరిగి యింటికి వచ్చుసరికి పదునొకండుగంట లయ్యెను. ఆయన గ్రామములో పరిచితులను చూచుటకై పోయెను. అతడు భోజనముచేసిన తరువాత రెండు గంటలవరకు నిదురపోవును. అత డిచ్చటనున్న యెదుదినములును శారదగది యతనికి ప్రత్యేకింప బడియుండెను. లలిత యా ప్రొద్దుటినుండి యవ ధాని నేకాంతముగా గలిసికొనవలెనని బహుప్రయ త్నములు చేసెను. అతనిని తన గదిలోనికి బిలచి తనకువ్రాసినయుత్తరములు,వానిమీద తానువ్రాసి కొనిన ప్రేమోక్తులు, నతనికి చూపించవలయునని యెన్నియో ప్రయత్నములు చేసెను. అతని గది తలుపు రెండుమూడుసారు లోరగా తెరచెను.

అతడు నిద్రపోవుచుండెను. అతడు లేచి మొగము కడిగికొనుటకు దొడ్డిలోనికి పోవునపుడు, వచ్చునపుడు, అతని చూపు తన చూపుతో కలసినచో తనగదిలోనికి రమ్మని సంజ్ఞ చేయుటకు సదేపనిగా నతని వంకనే చూచుచుండెను. అతడు తలవంచుకొని పోయి తలవంచుకొనియే వచ్చెను. ఏదో యాలోచించుచున్నట్లుండెను. ఆమె కొంత సేపట్లు ప్రయత్నించి ఫలము లేదనుకొని సాయంవాహ్యాళి సమయమునకై ప్రతీక్ష చేయుచుండెను. స్నానము చేసి యుదికిన యెఱ్ఱపూల వలిపపు సన్న పావడా ధరించి యైదుగంటల కామె తనగదినుండి వెడలి వచ్చి సీతను బావయేడని యడిగెను. మూడుగంటలకు ఎచ్చటికో పోయెను. ఇంకను రాలేదు. ఆమె మరల తన గదిలోనికిపోయి ఎదురుచూచుచుండెను. అరగంట, మరొక పావుగంట, పది నిముసములు, ఐదు నిముసములు మరల నిముసము నిముసము—ఆరున్నరయయ్యెను. బావ జాడలేదు. ఆమె తనచేసికొనిన యలంకారమంతయు తీసివేసెను. ఉద్యోగము రాకమునుపే యింత పని యైనచో ఉద్యోగములో ప్రవేశించిన తరువాత నసలు తన మొగమే చూడడు కాబోలు. మరల తాను వ్రాసిన

యుత్తరములు తన ప్రియురాలివద్ద కూర్చుండి ప్రత్యుత్తరము చదువుటలో సౌఖ్యములేదా? బావ అట్టి సౌఖ్యమున కేల విభ్రాంతి పొందడు? తనమీద ప్రేమలేదా? నిన్న సాయంకాలము శారద తన ప్రేమను పాడుచేసెనా?

అవధాని రాత్రి యెనిమిదింటికి వచ్చెను. వచ్చి వెంటనే భోజనముచేసి తన పెట్టెలన్నియు సర్దుకొనెను. మరునాడు ప్రొద్దుననే ప్రయాణమట. అతడు తన పెట్టెలు సర్దుకొనువేళ నెవ్వరితోడను మాటాడలేదు. నిద్రపోవువరకును ముభావముగనే యుండెను. అది యంతయు నింటిలోనివారికి నతని పదవికి యోగ్యమైన ప్రవర్తనగానే కనుపించెను. మరునాటి ప్రొద్దున నవధాని వెడలిపోయెను. పోవునపుడు ఏ మరదలితోడను మాటాడలేదు. శారదవంకమాత్ర మొక తీవ్రమైన చూపు చూచెను.

అతడు వెడలిపోయిన తరువాత నిల్లంతయు వెల వెల పోయెను. అత డింటిలోనున్న యారుదినములు ఇల్లు ధగధగలాడెను. ఇతరాధికారులు సామాన్య మానవులవలె గోచరించిరి. పట్టణమంతయు వారి యింటిచుట్టు తిరిగినట్టుండెను. గౌరవము మర్యా

దయు తేజోమండలములు కట్టి వారి యింటి చుట్టును పరిభ్రమించినట్లుండెను. ఇప్పుడో! ఆ యిల్లు మరల నొక యుపాధ్యాయుని గృహమ్ము మాత్రముగ నుండెను.

అతడు వెడలిపోయిన మూడవరోజు రాత్రి అందరును కూర్చుండి భోజనము చేయుచుండిరి.

శాంత:- అవధానిని పిల్లమాట యడుగలేదేమి? మీరు ప్రస్తావింతు రని నే నూరకొంటిని. లేనిచో నేనే అడిగెడిదానను.

వివే:— అత డుద్యోగములో చేరబోవుచున్నాడు. ఇప్పు డతనిని తొందరపెట్టుట యెందులకు? తొందరపెట్టినను నిప్పు డతనికి తీరికయుండదు.

శాంత:—ఆయన అసలు వివాహమునకు అంగీకరించునా?

ఈ ప్రశ్న లలిత చెవులకు మరల నేదియో యపశ్రుతివోలె వినిపించెను. అవధాని కొండమీద తనతో చెప్పిన మాటయే మరల తల్లి ప్రశ్నగా వేసెను.

శారద:— అంగీకరించడు. ఏమి, చేదు మేయునా. ఇంటర్మీడియేట్ చదువుచున్నది. అందక త్తె.

ఈ మాటలలో నాదరమో పరిహాసమో లలితకు తెలియలేదు.

సీత:—అంగీకరించక పోయినచో మొన్న సభలో పుష్పమాల వేసినప్పు డేల యూరకుండును? తరువాత అక్కతో కలసి ఏల షికారు పోవును?

సీత సామాన్యముగ వారి ప్రసంగములో జోక్యము కల్పించుకొనదు. సీత యేమాట యన్నను పినతల్లి దులపరించును. అందుచే నామె యెక్కువ సారులు మాటాడకయే యుండును. ఎప్పుడైనను మాటాడినచో పినతల్లి కనుకూలమైన మాటయే మాటాడును.

శాంత:—నిజమే. వాహ్యాళి పోయెను. అంగీకారమే యనుకొందును.

శారద:— ఆ వాహ్యాళి పోయినపుడు ఏమి మాట్లాడుకొన్నారో? అతడు లలితను పలుకరించకుండ నుండునా? అయినను ముంజేతి కంకణమున కద్దమెందులకు? దాని నడిగిన నదియే చెప్పును.

లలిత:—(చురచుర చూచుచు) ఆ వెనుకటిరోజున నీవు నతనితో వాహ్యాళికి పోయితివి. అప్పుడు నీతో నేమి మాట్లాడెను?

శారద:— నాతో నేమి మాట్లాడును? నేనేమి యతని భార్యనా?

లలిత:—నోరు మూయుము. నే నతని భార్యనా?

అంతలో వారిమేనత్త నవ్వుచు కల్పించుకొని 'మీరిద్దరును కాదే. సీత యతని భార్య' యనెను.

నాయనమ్మ:—సీత కేమి తెలియును? నీవెవరినో యొకరిని తీసికొనివచ్చి కట్టుము. వానితో బంతిపూవువలె సంసారము చేయును. అది ప్రేమించుటయు నెరుగదు. దానికోసము ప్రయత్నము చేయుటయు నెరుగదు.

శారద:—(తండ్రితో) ఏమండీ నాన్నగారు! మీ యమ్మ కేమియు గడుసుతనము తెలియ దందురుగా?

వివే:— నిజమే, సీత కేమియు తెలియదు. అమా యకురాలు.

శాంత.—నోటిలో వ్రేలుపెట్టినచో కొరకగలదా?

శారద:—అదికాదే. ఎవ్వడైనను వచ్చి 'నేను నిన్ను ప్రేమించుచున్నాను. నన్ను పెండ్లాడుము' అనినంతనే పెండ్లాడును.

మేనత్త:—ఒసే శారదా! యేమి ముదినాపసాని మాటలు మాటాడెదవే?

శారద:—ఇంతకును అతడు లలితతో నేమిచెప్పెనో మీకు తెలియనే లేదు. లలిత నడుగుడు, చెప్పును.

మేనత్త:—లలిత పెండ్లివిషయములో నీకంత తొం దర యెందులకు?

లలిత:—నేను పెద్దదానను గనుక నా వివాహ మైనంతనే తానుకూడ వివాహము చేసికొన వచ్చునని.

శారద:— దొంగను పట్టుటకు దొంగయే కావల యును.

లలిత మాటకుమాటగా శారదతో నెప్పుడును పోటీ చేయలేదు. అందుచేత నూరకుండెను. ఆ రాత్రి వివేకానందుడు భార్యతో నెమ్మదిగా లాలించి లలితను కనుగొమ్మని చెప్పెను.

ఆ మరునాడురాత్రి లలిత చదువుకొన బోవు చుండగా శాంత యామె గదిలోనికిపోయి చదు

వును గురించి ప్రస్తావించినట్లు మొదలుపెట్టి—'అమ్మా! బావ యేమన్నాడు? నిన్ను పెండ్లిచేసు కొనునా?' అని యామెవంక చూడకుండ పుస్తక ములవంక చూచుచు నడిగెను. లలిత వెనుకముం దాలోచించి యొక యుద్వేగము రాగా నిట్లు చెప్పెను. 'అతనికి నాయందు ప్రేమ యున్నట్లులేదు. ఆసాయంతనము ప్రేమయున్నట్లు నటించెను. ఆరాత్రి యంతయు నేనది నిజమే యనుకొంటిని. అతడు నా యందు ప్రేమ చూపించుటయు నేనేదో బలవం తము చేయగా చూపినట్లున్నది. మరునాడు రోజు రోజంతయు నిచ్చటనే యుండెను. ఒకసారి కాక పోయిన నొకసారి యైనను నావంక చూచునేమో యనుకొంటిని. ఎంత పనియొత్తిడి యైనను నిజముగా నామీద నతనికి ప్రేమయున్నచో కన్నైన త్రిప్పడా? పోవుచు నాతో చెప్పియైన పోడా?' అనియేడ్వ నారంభించెను. శాంత యామెనోదార్చి 'కాదమ్మా, అతని కెంత పనియుండెనో? మేన మామ కూతురవు. నిన్ను వదలి మరియెవ్వరిని చేసికొనును.'

లలిత:—శారదను చేసికొనును. అతడు పోవుచు శారదవంక నొక చూపు చూచెను. మీారు

పరీక్షించి చూచిరో లేదో తెలియను. ఈరహస్యము నాకన్న శారదకెక్కువ తెలియును. నీవు శారద నడుగుము. ఆ ఫెను కటిరోజు నతడు దానితో కలసి షికారు పోయెను. ఆరాత్రి సంతోషములో నాకు తెలియలేదు. కాని తప్పక వారిద్దరిమధ్య నేదియో జరిగియుండును.

శాంత:—ఊరుకో. ఛీ! అట్లెన్నటికిని జరుగదు. శారద హాస్యముగ మాటాడునుగాని యటువంటిది కాదు.

లలిత:—(ఏడ్చుచు) నేను శారదను పెండ్లియాడవలదంటినా. దానినే ఆడనిమ్ము. నేను చివర కెందుకు కాకుండ పోవుచున్నాను. అతడేమో వచ్చి నన్ను పెండ్లాడునని యిన్నాళ్లును వేచియుంటిని. మేము హిందూదేశములో పుట్టితిమి. నాన్నగారు మాకు సంబాధములే విచారింపరాయెను. మే మేమి పాశ్చాత్యదేశ స్త్రీలమా? పది నృత్యములకు, విందులకు పోయి యెవరినో ఒకరి నేరుకొనుటకు. ఇంతకు శారద నాప్రేమపాడుచేసినదనినాగాఢవిశ్వాసము.

శాంతకు లలితయొక్క పేద గుండె తెలియదు. ఇది యంతయు నామె మనోవికార మనుకొనెను. శారదను అడుగవలసిన పనియే లేదు. ఒకవేళ అడిగినను శారద యన్నచో నామెకు భయము. ఆమె యొక్క సవాలు వేసినచో తాను సమాధానము చెప్పలేదు. లలితయొక్క యీ దుఃఖమును చూచి యవధాని లలిత కేమియు సూచన చేయలేదని గ్రహించెను. భర్తతో వచ్చి, 'అతడు లలితతో నేమియు చెప్పలేదు. మీ రుత్తరము వ్రాసి కనుగొనవలయు'నని చెప్పెను. ఆయన—'అతడు నిన్నకాక మొన్న యిచ్చటి నుండి వెళ్లగా నేను వెంటనే యుత్తరము వ్రాయుట బాగుండదు. నెల నాళ్లు గడచిన తరువాత వ్రాసెద'ననెను.

మరల నొక వారము గడచెను. అంతకు పూర్వమే వివేకానందుని తల్లి సీత పెండ్లివిషయము కొడుకుతో రెండుమూడు సార్లు ప్రస్తావన చేసెను. ఆమె కేమి తోచినదో! ఒకనాటి మధ్యాహ్నము వివేకానందుడు భోజనము చేయుచుండగా నారంభించెను.

'ఏమిరా అబ్బీ! సీతకు పెండ్లిచేయవా? నీ కూతురు పెండ్లి నీ యిష్టము. వాడు చనిపోవుచు

దానిని నీ కప్పగించి పోయినాడు. నీ కూతులు తెలివి కలవాండ్రు. అది నోటిలో నాలుక లేని పిల్ల. దాని నాలుగువేలు దాని కిచ్చి దానికి ముడివేసి పంపించుము.

వివే:—ఆ నాలుగు వేలింకెచ్చట నున్నవి. మూడువేల రెండు వందలు నే నప్పు తీర్చు కొన్నాను. మొన్న ముగ్గురికి చీరలు, ఒల్లెలు కొనుటకు నూరు రూపాయీలు ఖర్చు అయినవి. ఇంకొక యేబది రూపాయీలు అవధాని వచ్చినప్పుడు ఖర్చు పడినవి. మిగిలిన డబ్బులో కొంత స్నేహితుడు రామారావుగారు ఇబ్బందిలోనుండి అడుగగా యిచ్చితిని.

తల్లి:—అయినచో దాని డబ్బు ఎగకొట్టెదవా?

ఈ మాటలన్నియు శాంత ప్రక్కనుండి వినుచునే యుండెను. తాను కలిపించుకొని 'నీ డబ్బు ఎవరికి కావలయును. వెధవ డబ్బు. అవతల పుచ్చుకొని గిరాటు పెట్టెదము. నిక్షేపమువలె చదువుకొనుచున్న నా కూతుండ్రకే సంబంధము కుదురలేదు. ఈ మొగమునకు మగడు కుదురునా? ఏడేండ్లనుండి నాయింటిలో బడి తినుచున్నది. ఇది యుం

తయు నెవరి సొత్తు. ఈ నాటికి లెక్కలేదుగ వచ్చినావు. మా యిద్దరిపిల్లలతో పాటు నదిగూడ నొకపిల్ల. దానికిచేసి వీరికి మానుకొందుమా? కొంపలో తిండికి, పై ఖర్చులకు, వేషాలకు నెంత యగుచున్నదో తెలియుటలేదు' అనెను.

తల్లి:—ఏ వేషాలు వేసినను నీ కూతుండ్రే వేయు చున్నారు. నీవు వారిని తెరమీద నెక్కించితివి. ఆడించుచున్నావు.

అత్తా కోడండ్ర పోరాటము చిలుపజల్లు సాగి, వివేకానందుని కోప మను గాలితో నా మేఘము చెదరిపోయెను. కాని మరునాటినుండి సీత యన్నచో పినతల్లికి పినతండ్రికి కూడ నొక వైముఖ్యము కలిగెను. అదివరకు వివేకానందుడు సీతను నూటికి కోటికి పలుకరించెడివాడు. ఇప్పు డదిగూడ మాని వేసెను. సీత నిలుచున్నను తప్పే, కూర్చున్నను తప్పే యాయెను.

౫

అవధాని కలెక్టరుగా వచ్చినప్పటినుండియు అప్పుడికి ఒక క్రొత్త యుత్సాహము, ఒక క్రొత్త సాహసము, పొడచూపెను. అతడు స్నేహితులతో చాలసారులు రెండుమూడేండ్లలో తాను పోయి అవధానికడ

నుందుననియు నప్పు డెవరి కేపని కావలయునన్న నది చేసిపెట్టుదుననియు చెప్పుచుండెను 'ఓయీ, నీమాట నాయన వినునా?' యని ఎవరైన నన్నచో 'నా మాటయే వినడా? నేనును ఆయనయు నా కై దేండ్లప్పటినుండియు కలసియున్నాము. ఆయనకు నా కంటె గొప్పస్నేహితులు లేరు. నా మాట యాయన పాలించనిచో లోకములో నెవరిమాటయు నెవరు పాలించరు' అని సమాధానము చెప్పును. అతని ప్రవర్తన నానాటికి విశృంఖలమగుచుండెను. అతని కింతవరకును సొంతయిల్లు లేదు. ఎక్కడనో అక్కడ నుండుటయే యతని బ్రదుకుదలగా నుండెను. ఆ యూరిలో నుప్పుటేటివంతెన దాటిన తరువాత ఏనాము పోవు రోడ్డుమీద దూరముగా నున్న యొక యింటిలో నతడు నివసించుచుండెను. ఆ యిల్లు అతని కులస్థులదే. ఇతని సంపాదనలో వారి కప్పుడప్పుడు కొంత కొంత యిచ్చుచుండును. ఆ యింటివానిపేరు రాముడు. అతనికి నేబదియైదు సంవత్సరముల వయస్సుండును. అతని కొక కుమారుడు. వానిపేరు గోపి. రాముడికి నిద్దరుకూతుండ్రు కలరు. పెద్దది పదునాలుగేండ్లది. చిన్నది పన్నెండేండ్లది. వారి తల్లి చనిపోయినది. కడచిన యైదేం

ళ్లుగ నప్పుడు వారి యింటనే నివాసము. పెద్దపిల్ల పేరు అప్పి. రెండవది సీత. అప్పి అనాకారి. దాని మొగము క్రోతి మొగము. దాని శరీరమ్మ్కూడ వయస్సువచ్చిన తరువాత, వయస్సువచ్చిన శోభ కూడ కనిపించనీయ లేదు. మిక్కలి బక్కపలుచని మనిషి. ఒడలిలో రక్తమాంసములే లేవు. దానికి వయసువచ్చిన సంగతి—పదునాలుగేండ్లు వచ్చినవి కనుక వయసువచ్చి యుండునని అనుకొనవల యునేగాని-యెవ్వరికిని తెలియదు. అది ప్రతిదినము తట్ట నెత్తిన పెట్టుకొని రొయ్యపొట్టమ్ముకొని వచ్చును. ఎండు చేప లమ్ముకొని వచ్చును. సీత ఆ కులములో నందకత్తె పుట్టినదని చెప్పవచ్చును. అది అక్కగారివలె నల్లగా నుండదు. చామన చాయకన్న నింక నొక చాయ తేరిన దొడలని చెప్ప వచ్చును. కన్నులు పెద్దవి. పంద్రెండేండ్లకే దాని శరీరము మీాద మన్మథుడు కొంచెము కొంచెముగా గోచరించెను. అప్పి చేయుచున్న పనులేవియు నది చేయదు. ఇంటిలో కూడుదుకవేసిపెట్టుట, యిల్లు సర్దుట మొదలైన యెల్లపనులను అప్పియే చేయును. సీత చేయదు. చివరకు నింటికి పదిగజముల దూర ములో నున్న చిన్నకోమటి దుకాణములో నొక

దమ్మిడీ యుప్పు, రెండు దమ్మిడీల మెరపకాయలు అరగాసీ చింతపండు, మిగిలిన గవ్వలకు ముతాలు కొని తీసుకరమ్మనినను తీసుకరాదు.

ఆ సంసారములో పోదగినంత దొరసానితనము పోవును. గోపికి పదునారేండ్లుండెను. వాడప్పుడి కుడిభుజము. అప్పుడు రాముడు, వీడు హనుమంతుడు. వానికి అప్పుడే కలెక్టరు. వాడును రోజును ఉదయమున కసరతుచేసి పదునారేండ్లకే మంచి బలశాలి యయ్యెను. వాని దేహము మీదనున్న దుస్తులు చింకి పీలిక లయ్యెను మంచిరొమ్ముతో నునుపైన మొగముతో నది యొక యందమును వెదలగ్రక్కుచుండెను. రాముడు మొదటిదినములలో తన పెద్దకూతును అప్పడి కిచ్చి పెండ్లి చేయవలయు ననుకొనెను. అప్పి ఏడాదికేడాది పైన పడినకొలది సన్నసూలు వడికి వయసు వచ్చినట్లే కనిపించక, అప్పని పెండ్లిచేసికొమ్మని యడుగుటకు తండ్రికే నోరాడలేదు. అయినను ఒకటి రెండుసార్లు మందలించెను. అప్పుడు ఖండితముగా చేసికోనని చెప్పెను. రాముడికి కోపము వచ్చెను. తన కూతురు వివాహమునకు తగనిదని యతనికి తెలియును. అప్పని చేసికొమ్మని యడుగుటయే

బాగుగ నుండలేదని యత డనుకొనెను. అడుగుటకు సంకోచించెను. అతడు చేసికోనని చెప్పునని ముందే నిశ్చయించుకొనెను. అయినను రామునకు కోపము వచ్చెను. ఆకోప మెందుకు వచ్చెను. మరియొక కారణ మేమియు కనిపించదు. ఓసి మానవహృదయమా! నాలుగు కోస్తాలు గెలిచి జయపతాక నాటిన మహానాగరకుడ ననుకొనుచున్న మూర్ధాభిషిక్తునియందును, పూటకూటికి టికాణా లేక ఏపూట కాపూటకు చిట్టెడుగింజలు పుట్టక, తనకంటె నొక గింజను ముక్కున కరచుకొని వెనుగాళ్లమీద ప్రాకుచు పోవుచున్న చీమకున్నంత గౌరవము లేని మనుజునియందును, నీవొక్క రీతిగా స్పందింతువు. నీవు మనిషికి కోపము తెప్పింతువు. ఇప్పుడు రాముడికి కోపమేల వచ్చినది? ఏది సర్వదా అసంభవమో ఆ యసంభవమైనది సంభవమైనచో నీకొక యాశ్వాసము. ఆ యాశ్వాసము జరుగుటకు సూదిమొన యంతయైనను వీలు లేకపోవచ్చును. ఆ లేని వీలు కలుగలేదని నీ స్పందనములో నొక గుత్తుపునడక నడచెదవు. రాముడికోపము నాల్గయిదు దినములలో తగ్గిపోయెను. వారును వీరును చెప్పిరి. 'అరే, అప్పిని చేసుకుంటాడ్రా. ఎవడూ చేసికోడు.

యింకాయిస్తే సీతనియ్యి' అని. ఆమాట లతనికిని నచ్చెను.

అప్ప డింటిలోనుండి చిన్నప్పటినుండియు సీత మీదనే కన్ను వేసియుంచెను. అతడును సీతయు నెప్పుడును ఇంటిలో నున్నంతసేపు కలసియే యుం దురు. ఊరిలోని అతని ప్రతాపకథాకథనమునకు సీత ప్రధానశ్రోత్రి. గోపి అతని ప్రతాపమునకు బట్టు. సీతకు అప్పుడు తాను కథలలో వినుచున్న వీరులు అప్పడు, దేసింగరాజు. దేసింగరాజు ఎవ్వరు నెక్కనేరని గుఱ్ఱమునెక్కి చేసిన స్వారీ, అద్భుతకార్యములు, సీత మనస్సులో అప్పడే చేసి నట్లుండెను. కామమ్మకథ, మరాఠీ కథ, దేసింగరాజు, బొబ్బిలికథ, బుఱ్ఱవాండ్రు వచ్చి చెప్పినపుడు విను టకు పోవువారిలో సీత మొదటిది. కడచిన రెండేం డ్లుగా సీతకు నప్పుడును గోపియు విలువగల చీరలు జాకట్లు కుట్టించుచుండిరి. ఆమెకు ముఖము నందు రాచికొనుటకు సువాసనాపటవాసములు, తలకు వాసనా తైలములు, చెవులకు లోలకులు, మెడలో సిత్తడి గొలుసులు, చేతులకు బంగారుమలామాదిన యిత్తడి గాజులు, కాళ్ళకు పాంజేబు పట్టాలు, వాయిల్ చీరెలు సమృద్ధిగా నుండెను. ఆయింటిలో

నుండి అంత ముస్తాబుగా వచ్చుచున్న పిల్ల పరస్పర విరుద్ధమైన పదార్థముల కలయికవలె క్రొత్తవారికి గోచరింప వచ్చును. తెలిసినవారికి దానియం దబ్బురము లేదు. పండ్రెండేండ్లు వచ్చిన సీతతో నూరకయైన నెవ్వరును పరిహాసము చేయరాదు. ఒకసారి తప్పిదారి సీత దుకాణమునకు పిన్నులు కొనుటకు పోయెను. కోమటి యేదో పరాచిక మాడెను. ఆ సాయంతనము ఆ కోమటి చెంప ఛడేలుమనెను. సీత వ్యక్తురాలు కాలేదు. అయినను సీత మనస్సు ప్రౌఢయైన స్త్రీ మనస్సులో నున్నన్ని స్త్రీపురుష సంయోగభావములచే నిండి నిబిడీకృత మయ్యెను.

అప్పుడు తిరుపతి వేంకటేశ్వరునకు కుడిచేయి మీదుకట్టినట్లు తన యావనము సీతకోసము మీదు కట్టి యుంచలేదు. అతని కొక వారకాంత యుండెను. ఆయమకు పోషించెడి వారు, ధనమిచ్చెడివారు వేరే యున్నారు. దాని వాకిటి ముందుగా నెవరైన పోకిరీ కుఱ్ఱవాండ్రు పోవుచున్నచో, తెలియని వాడావైపు కన్ను త్రిప్పినచో, ప్రక్కవాడు మోచేతితో పొడిచి విరమింపించి కొంత దూరము పోయినతరువాత 'దానికి అప్పుడు ఆషాక్. చచ్చిపోతావు,' అని చెప్పును. అప్పుడివద్ద డబ్బు లేనిచో లీల యీయ

వలయును. దానిపేరు లీల. దానినుంచుకొన్న వారికి దానికి నప్పడితో గల సంబంధము తెలియును. కాని వదలిపోయినచో నేమిచేటో తెలియదు. అదివరకు అప్పడికి తన కనుకూలమైన సులభమైన తక్కువజాతి స్త్రీలమీదనే మనస్సు. రెండు నెలలనుండి యతని మనస్సు పెద్ద పిన్న, ఉత్తమ మధ్య మాధమ కుటుంబము లన్న వివక్ష లేకుండ పరుగెత్తుచుండెను. ఎంత గొప్పయింటి స్త్రీ యైనను దారివెంట పోవుచుండగా ప్రక్కవాటుగా చూడకుండుట యతడు పూర్వమే యెరుగడు. ఇప్పుడు వారు వినుచుండగా నేదియో యసభ్యపు మాటలు నోటితో ననును. వారు మొగము గండరించుకొని దూరముగా తొలగిపోదురు. వెనుకనుండి యా స్త్రీలకు వినిపించిన యసభ్యపునవ్వులు వారి కుటుంబ మర్యాదనంతయు సిగ్గిల జేయును.

౬

కాలము గడచెను. అవధాని తన యుద్యోగ శిక్షాపీఠి గ్రామమునసబు, రెవిన్యూ యిన్స్పెక్టరు, మేజిస్ట్రీటు, పదవులయొక్క ధర్మములు తరిఫీత్ పొందెను. అప్పటికి కొన్నిమాసములు గడచెను. మరికొన్నిదినములలో నతడు సెషన్సుజడ్జి శిక్షకూడ

పొందగలడు. ఈ లోపుగా నతనికి నొక మాసము సెలవు వచ్చెను. ఆసెలవులలో నేమి చేయవలయునో యతనికి దోచలేదు. పర్లాకిమిడినుండి తాను బయలుదేరి పదినెలలు దాటెను. వసంతకాలము వచ్చెను. సంవత్సరాది పండుగనాడు బెల్లమును మామిడిముక్కలను కలిపిన వేపపూవు చేదు జనులకు హాయి యనిపించెను. క్రొత్తయేడాది మొదలు పెట్టినట్లుండెను. ఆయేడు వేపపూత వసంతకాలము రాకముందే వచ్చెను. ఆ వెనుకటి సంవత్సరమున రెండధికమాసములై శిశిరమును వసంతము గదుముకొనెను. కొన్నిచెట్లు పూత మీదనే యున్నను మరికొన్ని పిందెలు కాయలు కాచెను. మామిడిచెట్టు మాత్రము సరిగా కాయలేదు. దేశము మీద మామిడిపండ్లన్నియు కాపు తక్కువై ధర హెచ్చెను. ముదిరిన మావి చిగుళ్లు తప్పనిసరికి కొఱికి చప్పరించి యసుకుమార మని యోకిలించిన తొలిచూలు కోకిల పడుచును గూర్చిన శ్రద్ధ, కుహూకుహూనినాదబంధురకళాపిపాస విజృంభిగుచున్న చెదురు మేత మరగిన మగకోకిలకు పట్టలేదు. వసంతము సగముపైని గడచి కాకులును పల్లెటూరి పిల్లలును వేపపండ్లను సమానముగ సేవిం

చిరి. గుంజుతో గింజజారిన వేపపండు డొల్లలు చెట్లక్రింద పడి బంగరు గొట్టములవలె ప్రకాశించెను. ఎండలు తెరలు తీసినట్లు కాయదొడగెను. గ్రీష్మ ఋతువు తలచూపెనో లేదో, ఎండమావులు విజృం భించెను. ఎండమావులు దివ్యమైన భ్రాంత్యుదా హరణములు. వాని ప్రతిష్ఠ వేదాంతములనుండి సామాన్యమానవుల కష్టములదాక వ్యాపించియుం డెను. నీవు లక్ష చెప్పుము, వేయి చెప్పుము. మను ష్యుని మేధా విశేషమును గూర్చి యూరకే పొగడు కొనుము. మనుష్యుడు సర్వజీవలోకమునకు నధి నాథుడు. సముద్రములు కొండలు వాడు చెప్పి నట్లు వినును. ఏనుగులు సింహములు వానికి లొంగి యుండును. వాడు తలచినచో నెడారులను మాగా ణులను చేయును. అనంతాకాశమును విమానము లతో నవరోధించును. ఏదో చేయును, ఏదో చేయును. ప్రకృతిశాస్త్రజిజ్ఞాసువై సర్వమునకు సమాధానము చెప్పును. సముద్ర జలనైల్యమునకు మహాకాశ నైల్యమునకు హేతువులు చెప్పును. దిన దినము క్రొత్త క్రొత్త రహస్యములను వెడలగ్రక్కును. ఎండమావు లెందుకు కనిపించును? ఇదిగో ఇసుక పట్టులలో చౌటిమిలమిలపై సూర్యకిరణప్రసారము

కలిగి జలమున కెట్టి రంగు ఉండునో అట్టి రంగు, తళతళ కలుగునని ప్రకృతిశాస్త్రము చెప్ప నను కొందము. ఆ ప్రకృతిశాస్త్రనిష్ణాత పిపాసాయత్త చిత్తుడై ఏకాకియై మరుప్రదేశములయందు పోవుచు నెండమావులను చూచి పొరపడునా? పొరపడడా? పొరపడి యంగలార్చునా? యంగ లార్చడా? బహుదూరసమాకృష్టుడై చిట్టచివరకు ఛీ ఛీ యిది జలము కాదనుకొని యథార్థము తెలిసి కొనవచ్చును. కాని యది యూషరక్షేత్రము. అం దుచే నవి యెండమావులు అని తత్ప్రదేశగతపరి జ్ఞానముచేత కలుగు ననుమితి. ప్రదేశపరిజ్ఞానము లేకుండ నెండమావులను చూచి యవి యెండమా వులే యని గుర్తుపట్టగలడా? దృష్టికి నెండమావు లకు జలమునకు భేద మేమి కనుపించును? తెలిసిన తరువాత నొక సమన్వయము చేసికొనవచ్చును. జ్ఞాన మనగా నిదియా? ఒక వస్తువుయొక్క స్వరూప లక్షణాదులు తెలిసినంతనే దాని నెచ్చటనున్నను వెంటనే తెలిసికొనవలయును. అవి యెండమావులని చూచినతోడనే స్థలగతజ్ఞానము లేకుండ వెంటనే తెలిసికొనుటకు మనుష్యునిబుద్ధికి శక్తియున్నదా? సర్వవేదాంతములు శాస్త్రములు చదువుదురు.

ఏవిషయమును గూర్చి ప్రశ్నించినను, పంక్తులొప్ప జెప్పుదురు. వాదోపవాదములు పెంచుదురు. కాని అత్యల్పవిషయమునందు మోహమును, కామమును త్రుంచుకొనలేరు. శాస్త్రపరిజ్ఞానము భగవంతుడు మెచ్చడు. మనుష్యులు మెచ్చెదరు. భగవంతుడు యథార్థజ్ఞానమును మెచ్చును. అయినచో నీ యెండమావుల విషయములో యథార్థజ్ఞానమెట్లుండు నను ప్రశ్నవచ్చినచో దూరమున మరీచికల చూచి పిపాసాయత్తుడై వానికోసము పరువెత్తుట చేయడు. మఱి దప్పికచేత బాధపడుచున్ననేల చేయడు? యోగి అప్పుడిట్లు భావించును. ఇది యెండసమయము, ఆ కనుపించునది జలము కావచ్చును, కాకపోవచ్చును, ప్రాప్తియున్నచో నది జలమగును, కానిచో కాదు అని యంగలార్చడు. ఈ మాట సామాన్యమానవుని యనుభవమునకు విరుద్ధముగా కనుపించును. అరే! దప్పికతో బాధపడుచుండె నాయెను. దూరమున జలము వలె కనుపించుచుండె నాయెను. ఎందుకు పరువెత్తడు? అని. స్థితప్రజ్ఞునకు తదితరునకు నిదియే భేదము. స్థితప్రజ్ఞుని యనుభూతిలో నున్న విషయములు సామాన్యమానవుని మనస్సున కందవు.

అట్టి స్థితిలో జలార్థియై పరువెత్తుట యేయోగియో, అయోగియో చేయును అని సామాన్యమానవబుద్ధి. పటనిర్మితిక్రియా వ్యాపార విషయ జ్ఞానము వేఱు, పటనిర్మాణశక్తి వేఱు. ప్రత్తి యేకులు చేసి, దారము తీసి నూలుపోసి, పడుగు చేసి మగ్గముమీద పేక వేసినచో వస్త్రమగునని తెలిసికొనుట సులభము. ఈ కార్యములలో నేది చేయుటయు కష్టమే. సరిగా యథార్థజ్ఞానమునకు నయథార్థజ్ఞానమునకు భేద మిది. సర్వావయవమైన జ్ఞానము, నిరవయవ జ్ఞానము, ఇవి భిన్నములు.

అవధాని అధునాతన నాగరకతలో మునిగి తేలె నందము. పాశ్చాత్య దేశములో నున్నవారు అచ్చటికి పోయి నేర్చివచ్చిన పరదేశీయులకన్న నధిక నాగరకు లందము. ఈ దేశములో నట చదివి వచ్చినవారు, అధిక నాగరకులు కదా! ఆ నాగరకతా స్వరూపము కొంతవరకు ఎండమావుల సృష్టి యిట్లుండునని తెలిసికొనుటగాని—ఎండమావులను చూచి మోహపడకుండుటగాని, వానిచే లాగపడకుండుటగాని కాదు. నాల్గు వందల విషయములను గూర్చి వ్రాసిన గ్రంథములలోని విషయములు తెలిసికొనుట వేరు. ఒక్క విషయమునందు సమ

గ్రమైన యనుభవము కలిగియుండుట వేఱు. ప్రకృతి శాస్త్ర గత పదార్థజ్ఞానము సదసద్వివేకమును బోధించదు. మోసము, అహంకారము, గర్వము, కామము, అన్యాయము, క్రోధము ఈవిషయములను గూర్చి యెచ్చటనుండెనో, అచ్చటనే యుంచుము' అతని చదువు ఎండమావులవంటి దయ్యెను. అబ్బో అతడు చాలపండితుడు. చదువుకొనినవాడు. ఈ మాటలు లోకమున నెంతవిచిత్రముగా ప్రయోగింప బడును? బహు విషయముల తెలివికలవా డని యర్థము. ఎఱుక కలవాడని కాదు. తెలివి వేఱు, ఎఱుక వేఱు. తెలివి మనోవిషయక మైన జ్ఞానము. ఎఱుక యనుభూతిదశాపరీపాకరమ్యమైన జ్ఞానము. అవధాని యిన్ని నెలలు పర్లాకిమిడికి జాబుకూడ వ్రాయ లేదు. ఆ యూరిని గూర్చి విచారించ లేదు. అతడు పర్లాకిమిడి పేరు చెప్పినచో నులికిపడెను. కాని యతనికి లభించిన యీ నెలనాళ్ల సెలవులలో అతని మనస్సు పర్లాకిమిడి వైపునకే లాగెను. అది మఱియు నజ్ఞానము. అవి పట్టభూములు, అచ్చట నెండమావు లుండును, అని తెలిసి యొకడా భ్రాంతి నివారించుకొనును. తత్ స్థలజ్ఞానముకలిగి కూడ నెండమావు లెండమావు లని తెలిసికూడ

జలబుద్బుదముతో బరువెత్తువానిని గూర్చి ఏమని చెప్ప వలయును.

ఇన్నాళ్లుగా వివేకానందుడు కూడ నవధానికి జాబు వ్రాయలేదు. వివేకానందుని కుటుంబములో నవధానిరాక ఒక్కసారి మెఱుపువలె మెఱసి యంత రించెను. ఏడేండ్లుగా నతనిని గురించి యూహా సన్నగా మధురబాధ కలిగించిన యా యింటిలో నే డతనిని గూర్చిన యూహాలు శ్రద్ధలేని యాశగా పరిణమించెను. లలిత క్రమక్రమముగా నొకమార్పు పొందెను. ఆమె అప్పుడప్పుడు అవధాని తనకు జాబు వ్రాయుననుకొనెను. మొదటి రెండు నెలలు అనుకొనెను. క్రమముగా నాయాశ సన్నగిల్లెను. ఇప్పు డామెకు అవధానిని గూర్చి యూహయే రాదు. వచ్చినచో ఆమె హృదయములో నుద్వేగము కలిగించదు. కనుగోసల తీయదనము కల్పిం చదు. ముంజేత పులకరింత కల్పించదు. వారి యిల్లు తొలినాటి వికాసము లేదు. బాలికలు పాఠశాల లకు పోయి చదివి వత్తురు. తండ్రి ధనము తీసి కొనివచ్చును. వ్యయపడుచుండును. దైనందిన క్రియలు యథావాహినిగా గడచుచుండును. ఒక యుత్కృష్టమైన యాశాజనితోద్వేగము లేదు,

ఎడద కుంచించు ఒక నిరాశాజనితపతనము లేదు. అదివరకు పిల్లలకు వివాహము కాలేదను భావము కన్నులలో, నెడదలలో స్పందించుట విస్పష్టముగా కనిపించెడిది. ఇప్పు డూరకే కాలము గడుచు చున్నట్లే యుండెను. ఒక్క సీత విషయములో శాంతమ్మ వైముఖ్యమునకు, సీత పొగిలిన పొగులు నకు, ఆమె మనసులోని దుఃఖమునకు, వివేకానందుడు ప్రకటించుచున్న యౌదాసీన్యమునకు మాత్రమే యా యింటిలో మానవ జీవితము స్ఫురించెడు కదలిక గోచరించెను. సీత కాయింటిలో నుండుట పట్టరాని బరువై పోయెను. అవధాని వెడలి పోయిన క్రొత్త రోజులలో, నాయనమ్మ సీతను వెనుక వేసికొని కోడలితో కొంత రగడ పెంచెను. సీత డబ్బు సీత కిచ్చి దాని యప్పగార్ల యింటి కైనను దానిని పంపివేయమని పోట్లాడెను. శాంత యత్తగారికన్న నెక్కువ యుద్వేగ ప్రకృతి యగుట వలన నత్తగారి నోరు పడెను. వివేకానందుని యెడ గల పుత్రప్రేమయు, అతడు క్షోభించునని వెనుకాడుటయు నామెకు నతని విషయములో నూరకుండుట కల్పించెను. రెండుమూడు నెలల నుండి మేనత్త రుజాగ్రస్త యగుటవలన నింటి

లోని పనియంతయు సీతమీాద పడెను. ఆమె పాఠశాలకు పోకముందు గృహమునందలి సర్వకార్యములు చేసిపోవలెను. వచ్చిన వెంటనే మరల గృహకృత్యములు. ఎవరి కేది యందీయక పోయినను కోపములు, ఈసడింపులు. ముసలమ్మకు శరీరములో నోపిక మునుపటియంత కూడ లేదు. అల్లే మనుమరాలికి వీలైనంత సాయపడుచుండెను. సీత తన చదువు వదలి పెట్టి ఏ యక్కగారి దగ్గరకో పోద మనుకొనెను. ఇద్దరక్కలకు ఉత్తరములు వ్రాసెను. ఒక యుత్తరము పొరపాటున శాంత చేతిలో పడి వివేకానందునకు జేరెను. అందు వివేకానందుడు సీత కీయవలసిన నాల్గువేల రూపాయీల సంగతి యతడు మరల తిరిగి యిచ్చునట్లు లేదని సాధువుగానే వ్రాయబడియుండెను. అదియు భార్యాభర్తల కోపహేతువయ్యెను. వచ్చిన కోపము సీతతో 'నీ డబ్బు నేను తినను. నిను వివాహము చేసి పంపింతును' అని సామోక్తులతో తేలికగా నపనయించుకొనబడునను మాటయే లేక హృదయగత కల్మషము పేరుకొని తత్పూర్వద్వేషము నినుమడింప చేసెను. ఇప్పుడు వివేకానందుడు సీత వంకనే చూడడు.

భోజనమువేళ నామెయే వడ్డింపవలసినను తనకు కావలసినవి విస్తరిలో లేకపోవుట చూచి యామె గ్రహించి వడ్డించవలయును గాని తాను కావలయునని కూడ నడుగడు. ఆమె పాఠశాలలో కట్టవలసిన జీతము ప్రతిమాసమును నాలస్యముగనే కట్టబడుచుండెను. జీతము కట్టవలయునని సీత చెప్పినచో మాటాడడు. ఆమె వంక చూడడు. నాయనమ్మ చెప్పినచో నీవా సారథివి? అది నాతో చెప్పకూడదా యనును. ఆజీతము ఒకసారి మండిగము మీద పెట్టబడెను. ఒకసారి గిరవాటు వేయబడెను. సీత రెండు మూడు నెల లీ తిరస్కారభావమునకు మిక్కిలి దుఃఖించెను. కాని యిప్పు డామె కది పరిపాటి యయిపోయి, నిలువబడి, సహజస్థితియైపోయిన విషాదమేకాని మఱియొకటి కాలేదు. సీత చాలసారులు తన యప్పగార్లవద్దకు పోద మనుకొనెను. తాను వ్రాసిన యుత్తరములు చిన్నప్పకు చేరినవి కాని యామె కడనుండి సమాధానము రాలేదు. మరల నామె యుత్తరము వ్రాయలేదు. ఈ యిల్లు వదలిపెట్టిపోవలయునన్న నెచ్చటికి బోవలయును. ఎచ్చటికో ఒకచ్చటికి. ఎట్లు పోవలయును? పాఠశాలలో కట్టవలసిన జీతము

కట్టకుండ దానితో పోవలయు నని యనుకొన్నను ఒక నెల జీతము చాలదు. రెండు నెలల జీతము తన చేతిలో నిలువ యుండునంతవరకు నాగినచో దాను పారశాలకు బోవుటలే దన్న విషయము సువ్యక్తమగును. ఆమె మెడలో నగ ఏమియు లేదు. చేతులకు రెండు జతల బంగారుగాజు లుండెను. అవి యమ్మట తన చేతగాదు. మునిగినట్లుకాదు. బ్రద్దలైనట్లు కాదు. మరల షోటు వచ్చి నడి సము ద్రమునకు పోవచ్చునన్న ఆసలేదు. ఆరీతిగా మెట్ట పట్టిన చిన్న యోడవలె నామె యచ్చట చిక్కుకొని పోయెను. ఆ యోడపట్టిన మేర ఒక క్రొత్తద్వీప మైనచో నచ్చటి జనులెవ్వరో వచ్చి తన్ను బానిసగా నైన తీసికొని పోదురు. తాను పట్టిన ద్వీపము శత్రువులును మిత్రులును కాని దేశము. వారి కీమె యందు లాలసలేదు. ఈమెను సంపూర్ణముగ నశింప చేయవలయు నన్నంత ద్వేషములేదు. అయ్యో! ప్రేమ లేకున్న మానెను. గాఢమైన ద్వేషమునకు కూడ నోచుకొనని యామె జీవితము చప్పనివస్తువు తిన్నట్లుండెను. జ్వరితుడై చవిచచ్చినవాని నోటికి కారపు వస్తువు కాకున్నను మిక్కిలి చేదైన వస్తు

వైనను లవణ మిశ్రిత మైనచో జిహ్వాతర్పణము జరుగును.

ఇట్టిస్థితిలో నవధాని యుత్తరము లేకుండ, నెవ్వరు ననుకొనకుండ పర్లాకిమిడి వచ్చెను. వచ్చినవాడు తా నెవరియింటనో దిగి యెచ్చటనో భోజనము చేసి, తన పని తాను చూచుకొని పోలేదు. మేన మామయింటికే వచ్చెను. అతడు పూర్వము వచ్చి నప్పటి యా యింటిలోని స్వాగతభావమునకు, నేటి యాదరణయు, నిరాదరణయు కాని భావమునకు లగింపు లేదు. అతని మనసులో నా లగింపు లేక పోవుట సమన్వితమైన విషయముగనుక నతడు నొచ్చి కొనలేదు. ఇప్పు డవధాని మునుపటివలెకాదు. తానే యందరను పలుకరించెను. అందరితో తానే పరా చికము లాడెను. లలితను పలుకరించెను. కొంత సేపుండి 'నామీద మీయందరకు కోపముగా నున్నట్లున్నది. నేను పనిమీదనుండి మీకు జాబై నను వ్రాయలేదన్న మాట నిజమే. మామయ్యే నాకు వ్రాసెనా? ఏమయ్యా! నీవు వ్రాసితివా? ఎవ్వరు వ్రాయరు సరే, లలిత వ్రాయకూడదా? శారద వ్రాయకూడదా? సీత వ్రాయకూడదా?

సీత ఏది? కనిపించలేదే' అని యీ ధోరణిలో మాటాడెను.

సీత ప్రస్తావన కొంచె మప్రశ్రుతిగా వినిపించినను నతని మాటలు శాంత చెవికి మధురసంగీతము వలె నుండెను. ఎంత సంగీతమువలె నున్నను మఱల తొల్లిటి చనవు, ప్రేమ, కలుషితము కాని మనఃప్ర వృత్తి కలుగుటకు నాలుగైదు గంటలు పట్టెను. అది యేమి చమత్కారమో, అంతలో సుమారు పదినెలలు జరిగిన వైముఖ్యము జరిగినట్లే లేదు. రాత్రి భోజనముల వేళకు నందరును నవ్వుచు ప్రేలుచునుండిరి. పూర్వపు సమావేశమునకన్న నేటి సమావేశము వివేకానందుని యింటిలో నంద రకు మిక్కిలి హృదయంగమముగా నుండెను. పూర్వసమావేశము అవిస్పష్టమై క్రమశః రూపు దాల్చవలసిన వాంఛగా నుండెను. ఈ సమావేశము నందును, ఆ వాంఛ రూపు కట్టలేదు. కాని, కట్టి నంత ద్రఢిమ వారి హృదయములలో గోచరిం చెను. వంటచేసి వడ్డించుచున్నది సీత. ఆమె తొలి నాటికన్న శరీరమునందు చిక్కియున్నది. ఆమె యెంత తెచ్చుకొనవలయు నన్నను మొగములో తొలినాటి వికాసము లేదు. దాల్చిన చీరయు రవి

కయు శుభ్రముగా నున్నను పురాణము లని తెలి యుచునే యుండెను. అసలామెయందు, ఆమె మొగమునందు సహజముగా కనుపించు వినయము, సౌశీల్యము, శాంతి, అమాయకత, యిల్లాలితనము యీ బక్కచిక్కిన దశలో మఱియు విస్పష్టముగా గోచరించెను. సామాన్యుని కెవ్వరికైనను పూర్వపు సుపరిపుష్టదశలోనే యామె మొగములోని నిండు దనము వినయాదిసద్గుణస్ఫోరకముగా గోచరిం చును. అవధానికి మాత్రము ఆ నిండుదనము గోచ రించుటకు నామె శరీరకార్శ్యము కావలసివచ్చెను. ఎవ్వరేమి మాటాడినను, సమయసముత్సాహజన కముగాన,అందరును చమత్కారముగనే మాటాడు చుండిరి—ఆమె మొగమున నవ్వే లేదు. అవ ధాని మాటాడిన మాటలలో చమత్కారమునకు నామె యొకటి రెండు సారులు నవ్వెను. ఆ నవ్వుట యెంత అందముగా నుండెను! నిండి తొణి కిసలాడు చెఱువులో కలువపూవు అట్లు వికసించును. పున్నమనాటి వెన్నెలలో జారిపడుచున్న నక్షత్ర మట్లు ప్రకాశించును. తల్లిపొదుగులో ముట్టె పెట్టి క్రుమ్ముచున్న తెల్లయావు లేగదూడ నోటినురుసట్లు తళతళలాడును. వేయి మల్లెపూవుల గుంపులో

నొక పారిజాత మట్లు మిలమిలలాడును. ఈ సౌభాగ్యమంతయు నొక్క అర్ధనిమేషము. నిరాభరణమైన యామె మెడ పంగలుగా తీర్చిన రైక ముడి ప్రదేశమునందు మూపులు కనుపించక పోయినను, వక్షోభాగమున నధరార్ధము పయ్యెదకొంగుచే కప్పబడినను, నూర్ధ్వపు నగము బంగరు పూత పూసిన సన్నని శంఖమువలె నుండును. ఆమె సౌందర్యము అవధానికి పూర్వము తెలియలేదు. లలితా శారదలు సీతయంత యందకత్తెలు కారు. లలిత పొడుగరి. పొడుగునకు తగినంత లావు కలది. ఆమె శరీరములో బుజమునందు గాని, మోచేతియందు గాని, మొగమునందు గాని బొమికలు బయట కనుపించవు. శరీరచ్ఛాయ పసిమియైనను దేహ చర్మము మిగుల మెత్తనదై నిగనిగ లాడినను, అది యొక పోతపోసి గుండ్రనగా చేసిన బొమ్మవలె నుండును. శారద మగరాయనివలె చేతులపై కరపృష్ఠ భాగముల తేలిన నరములు కనిపించుచు, దవడ యెముకలు, కంఠము క్రింద బొమికలు, కొంచెము ముందునకు త్రోసికొనివచ్చి వెగటుగా నుండును. ఆమె దృష్టిలోని గర్వము, తీక్ష్ణత, యివి రెండే యామెను ప్రమాశ్వర్షిణి చేయును. సీత యట్లుకాదు. ఆమె

మోచేతి బొమికలు, మణికట్టుబొమికలు వ్యక్తా వ్యక్తముగ కనిపించుచుండెను. మొగముకూడ మెత్తినట్లు పరమ మాంసలము కాదు. కపోలములు బూరటిల్లి యుండవు. కనురెప్పలమీది కండరము లుబ్బి కనులు తెఱచినను మూసినట్లుండవు. ఆమె లలితయంత పొడుగరి కాదు. శారదవలె శరీరము లోని యస్థిపంజరము ఎక్కువ వెడల్పు కలదై అడ్డము పెరిగినట్లుండదు. ఆమె తాల్చిన చీర శరీర మున కత్తుకొనను లేదు. ఊరకే చుట్టబడినట్లు వదులు గాను లేదు. ఆ చీర బిగువు జఘనభాగమును మాత్రమే కొంచెముగా సూచించును. వక్షస్థలో న్నతి కొంచెము ప్రకటించును. తక్కిన సర్వ శరీ రము సుపిహితమై పరమలోభనీయమైన వస్తు వుగా కనిపించెను. వడ్డించునపు డామె వంగినచో అరటిబోదె నడుము వంగి వ్రాలినట్లుండును. అవ ధాని కన్నులు సీతమీదనే నిలచెను. ఆ సంగతి లలితకన్న శారద కెక్కువ తెలిసెను. అవధానికి సీత కనిపించుట కదే మొదలు. సీత యేల చిక్క నది? సీత వంటచేయుట యేమి? వంట చేసినచో మాత్రము అంత ప్రాంజీర తాల్చుటయేమి? అసలు

నవ్వదేమి? ఎవరితోడను మాటాడదేమి? ఈప్రశ్న లెవరి నడుగవలయును?

ఆ రాత్రి గడచెను. లలిత యొక్కసారి పది నెలలు పరిత్యక్తమైన యాశను హఠాత్తుగా పునరుద్ధరించి, ఉద్ధరించుటలోననే పరిపుష్టదశను ప్రాప్తింప చేసికొని 'బావా! నీ వొకసారి నా గది లోనికి రావలయు'నని పిలచెను. ఆ సాహసము, ఆ స్వయంవరణము తల్లిదండ్రులకు ఫలోన్ముఖమైన పంటచేను చూచినట్లుండెను.

అవధాని "నేను చాల ప్రయాణపు బడలిక మీదనున్నాను. రేపు ప్రొద్దున వత్తును. తొందర యేమి?మీ కభ్యంతరము లేనిచో, పదిపదునేను దినము లుందును. నేను నెలదినములు సెలవు తీసి కొంటి"ననెను. శాంత "నాయనా!మా కేమి యభ్యంతరము? నీ వెప్పుడును మా యింటిలోననే యుండవల యునని మాకోరిక. నీ వుందువా? ఉండుటకు వీలగునా?" అనెను. అవధాని సమాధానము లలిత కాశాతృటత్వ హేతువు, పునఃప్రోద్బల హేతువు నొక్కసారిగా యాయెను. అప్పుడే కొంచె మొత్తిడి చేసినచో అవధాని అప్పుడే వెడలెడివాడేమో? ఆమె కా నిముసములో తల్లిదండ్రు లేమనుకొం

దురో యను లజ్జ, పది నెలల ముఖభావము, స్ఫురించి, యొక కించిత్కోపసూచితభంగిమతో ప్రసాదము, నింద, రెండును స్ఫురించిన యొక చిన్న నవ్వు నవ్వి యచట నిలువకుండ వెడలిపోయెను. అవధాని వారివంక చూడనేలేదు. వేయికన్నులు గల శారద అవధాని యింటిలో నడుగు పెట్టినదిమొదలు ప్రతి లిప్తను, నలుగురి హృదయములలోనుండు భావము లను ప్రకటించు మాటలు, చూపులు, చేతలు, పరా మర్శించి, విమర్శించుదృష్టితో జాగ్రద్దశలోనుండెను. అవధానియందు లలితమీది యాశ కనుపించదు. సీతమీది యాశ భోజనవేళ వ్యక్తమయ్యెను. వచ్చినపుడు లలితయందు గల యార్ద్రదృష్టి మారి భోజనవేళ సీతమీదికి తిరిగె ననుటకే వీలు లేదు. పదినెలలక్రింద వచ్చినపుడు సీతమీద నీ భావమే లేదు. ఈ భావము సీతమీద నిప్పుడే కలిగెను. లలిత యా రాత్రి దీర్ఘముగా విచారించెను. లలిత కన్న సీతయే యందకత్తెయని యందందు నను కొనుట యామె యెరుగును. తన యందమును గూర్చి ప్రస్తావనయే లేదు. లలిత యందకత్తె కావచ్చునుగాని సీత యందమే వేఱు. లలిత నిజ ముగా సుస్వభావ. తెలివి కలది. ఆమె మొగ

ములో నా తెలివి కొట్టవచ్చిన ట్లుండదు. ఆమె మొగములో చూచినతోడనే నిన్ను సమాకర్షించు నొక యనిర్వచనీయసౌందర్యరేఖ లేదు. సీత మొగములో నట్టి యొక రేఖ యున్నది. లోకములో ననేకులను చూడుదుము. కొందరివంక తిరిగియే చూడము. కొందరివంక తిరిగి చూతుము. అట్లు తిరిగి చూడబడిన వంద మొగములలో నొక మొగము లోని యొక రేఖ తేలికగా విస్మరింపబడదు. అట్టి యొక రేఖ సీత మొగములో నున్నది. ఆ రేఖ యసామాన్యమైన దగుట మాత్రమే కాదు. అది భారత దేశ స్త్రీల పాతివ్రత్యభావము జీర్ణించిన యెడదలకు, భావనచేత కాక, భారతదేశమందు జన్మించిన యొక పవిత్ర సంస్కారముగల దృష్టికే గోచరించును. శారదకు రెండుమూడు నెలలుగా సీత చిక్కిపోయి నప్పటినుండి, ప్రాంజీరలు తాల్చినప్పటినుండి, ఉత్సాహము తగ్గినప్పటినుండి యామె మొగములో సామాన్యముగా కనుపించు నా పవిత్రభావద్యోతక రేఖ విస్పష్టముగా కనుపించుచుండెను. ఆ యింటిలో నందరకు శారదకు నిది భేదము. శారద దృష్టి ఒక్క స్త్రీదృష్టి కాదు. ఒక్క పురుషదృష్టి కాదు. నట్టి యధునాతనదృష్టి కాదు. నట్టి సనా

తన దృష్టి కాదు. అచ్చముగా నింగ్లీషు చదవు కొన్నచో నామె మనోభావము లెట్లుండెడివో, చదివిన యాంధ్రభాషాకావ్యములలోని వర్ణనలు చిత్తమున కొక సంస్కారము కలిగించి చమత్కారముగా నామెకు భారతదేశపు చూపు కలిగించెను.

రెండు మూడు సారులు సీతపక్షమున తండ్రితో నామె వాదించవలె ననుకొనెను. శారదకు సంసారము లోని మెలికలన్నియు తెలియవు. తండ్రి వాడుకొనిన సీత డబ్బువిషయము ప్రస్తావితమై తండ్రికి కష్టము కలిగించును. తండ్రికి తెచ్చు జీతము సంసారమునకు చాలుట లేదు. తల్లియు, లలితయు స్త్రీసహజమైన కుటుంబాధిపతిధనార్జనావిషయమైన యవిచారతనే ప్రకటింతురు. తాము అక్కా చెల్లెం డ్రిద్దరు-పెండ్లికాని బరువు, తెలియని బరువుగా నుండుట శారదకు తెలియును. ఈ మాటాడకుండ మోయుచున్న బరువువలన కలిగిన విచారము ఏ ఇతరపు మాటవలన నైనను కోపముగా పరిణమించునని యామె యెఱిగి సీతను గూర్చిన ప్రస్తావన యామె చేయలేదు. ఇంక నామెకు తన, లలితల వివాహములను గూర్చి విచారణ లేకపోలేదు. ఈ వసంతకాలపుముందు లలిత యింటర్మీడియేట్

పరీక్షకు కూర్చొనెను. ఆమె పరీక్షయందు తీర్ణురాలైనచో నీ లోపుగా అవధాని వివాహమాడనిచో బి. ఏ. చదువుట కామె కాకినాడ పోవచ్చును. పూర్వమెప్పుడో తన తండ్రి కాకినాడ కళాశాలలో భేదాభిప్రాయము లుదయించి వదలివచ్చిన పట్టింపు పాటింపునకు రాకుండ లలిత చదు వక్కడ నధిక ధనవ్యయము లేకుండ సాగగలదు. తానింకొకసంవత్సరము రాజమహేంద్రవరమునందే యుండును. ఆమె బుద్ధిలో తమ వివాహములను గూర్చి తల్లిదండ్రులు పడవలసిన దిగులు కనిపించ లేదు.

రెండేండ్లలో తమ్ము గూర్చిన దిగులు తండ్రి కుండదు. ఎట్లు మిగిలినను సీత. సీతయా తనవంటిది, లలితవంటిది కాదు. చదువుకూడ క్రింది తరగతులలో చదువు చుండెను. ఆమెకు తన ప్రకృతి తెలియదు. విద్యావతులైన స్త్రీలను కామించి యుద్రేకము ప్రకటించు యువకుల ప్రకృతియు తెలియదు. ఎవరో పెద్దలుండి వివాహము చేసినచో నా పురుషునితో పురాణములలోని సీతాసావిత్రులవలె ఆదర్శప్రాయమైన శీలముతో భర్తను సేవించవలసినదే కాని మరియొక రీతిది కాదు. తండ్రియా ఆమె కీయవలసిన డబ్బు నీయలేదు. అవధాని సీతను పెండ్లియాడినచో

వ్యవహారము చక్కగా కుదురును. అవధానిగాని సీతగాని ఆ డబ్బు ప్రస్తావన చేయరు. అవధాని సీతను వివాహమ్మాడుట తటస్థించినచో దన తల్లి కిది నిరాశాజనకము, కోపహేతువు నగునని శారదకు తెలియును. కాని శారద తల్లిని, తండ్రిని, అంచులోనున్న వీలును, వెసులుబాటును జెప్పి యొప్పించ వచ్చునని యెఱుగును.

శారద సీతయెడ నింత సుముఖ యయ్యును సందరి కష్టసుఖములు చక్కగా విచారించ గలది యయ్యును నామెలోనున్న యొక హాస్యగుణము తన గుండియ సీతకు నందనియ్యలేదు. తక్కినవారి వలెనే తానుగూడ సీతను కించిత్తుగా తిరస్కరించుట, లెక్కచేయకుండ ప్రవర్తించుట, ఆమెకు కష్టము కలుగునట్లు పరిహాసించుట, చేయుచునే యుండెను. ఆమెలో రెండు ప్రకృతులు. ఒకటి హృదయములో దాగియున్న వివేకము. రెండు, పైకి వెక్కిరించునటుల మాటాడుట. శారద యదివరకెప్పుడు ననుకొనలేదు గాని యీ నిశావేళ మాత్రము తనవలన గూడ సీత మనస్సునకు కష్టము కలుగుటకు ఆమె నొచ్చుకొనెను. తన పెద

తండ్రి సీతను తమ కుటుంబములో నప్పజెప్పి పోయి నందుకు వా రామెను సరిగా చూచుటలేదు.

మఱునాడు భోజనము చేసిన తరువాత నవధాని కొండలలోనికి నడవులలోనికి పోయి తిరిగివచ్చుటకు సంకల్పించుకొనెను. ఆనాడు శనివారము. అతడు లలితకాని, శారదకాని యడవులలోనికి వత్తురని యనుకొనలేదు. అతడు కాకిలాగు, కాకిచొక్కా తొడుగుకొని, తలయందుంగరముగా మలచిన ఫ్రేమ బెత్తము పుచ్చుకొని, దొరటోపి పెట్టుకొని బయలు దేరెను. లాగు మోకాళ్లవఱకు, చొక్కా మోచే తులవఱకు. కొట్టవచ్చినట్లు కనిపించు గుండీ లా చొక్కాకు మేకచన్నులముందు రెండు, వెనుక నొకటి, రొమ్ముభాగమున మూడును. గుండీలు చొక్కాల కుండు చిన్నవి కావు. కోట్లకుండు పెద్దవి. పిక్కలవఱకు స్టాకింగులు, బూట్లు. అతడు బయలు దేరెను. శారద కిటికిలోనుండి యెక్కడకు పోవు చున్నా వనెను. అవధాని మాటాడలేదు. శారద నేనుగూడ వత్తు నుందు మనెను. అత డాగెను. నిము సములో శారద బయటకు వచ్చెను. శారద కాళ్లకు స్టాకింగ్సును, టెన్నిసు బూట్లు, లాగును చొక్కాయు ధరించెను. అవియును ఖాకీవే. శిర

స్నుపై దొరటోపి పెట్టుకొనెను. అవధాని నివ్వెఱ
పోయెను. శాంత వచ్చి చూచి యాశ్చర్యమో,
సంతోషమో, పిచ్చితనమో ప్రకటించెను. శారద
మాటాడకుండ ముందు నడచెను. కొండల వద్దకు
పోవువఱకు ఇద్దరును మాటాడలేదు. ముందు శారద,
నాల్గుగజముల వెనుక నవధాని. అవధానికి శారద
ప్రవర్తన చిత్రముగా నుండెను. శారద తన్ను నిజ
ముగా ప్రేమించుచుండెనా? శారద కొండమీద
తేనెపెఱవంటిది.

దగ్గరకు పోయినచో కొండ తేనెటీగలు కుట్టి
చంపును. దగ్గరకే రానీయవు. ఆ తేనెపట్టు చూచు
టకు నసహ్యముగా నుండును. ఒక చదరపుగజము
పరిమాణము కల తేనెపట్టు లభించగా, తేనెయుండు
స్థలము అరడుగు చచ్చదర ముండదు. కాని
యా తేనె జిహ్వామూలదివ్యేంద్రియతర్పణచణత్వ
మందు సృష్టిప్రథమోదాహరణము. ఈ పూట
నా తేనెపెఱ తొలగిపోయిన తేంట్లగూటివలె, వర్ష
దినమున సంధములై సామీప్యగతపురుషునకు
భయము కలిగించని స్థితిలో నున్న పెఱవలె, నామె
కనపడెను. కొండదగ్గరకు పోవువఱకు శారద ముందే
నడచెను. అచ్చటినుండి వెనుకకు తగ్గెను. అవధాని

నిలువబడి 'Lead, thou kindly light' 'ఓసి జాలి గల వెలుఁగా! దారి తీయుమా' అని యనెను. శారద కా మాట యెచ్చటిదో తెలియలేదు. అందలి యర్థము స్ఫురించను లేదు. కాని వట్టి గీతార్థము తెలిసెను. 'కాదు కాదు, నీవే వెలుగవు, పదినెలలు మా యింటిలో కాటుకకొండలను మోసిన చీకట్లు నీవువచ్చినంతనే పటాపంచలయిన"వనెను. ఇంగ్లీషు భాషలోని సంప్రదాయోక్తులు శారద కెంత తెలియునో, తెలుగు సంప్రదాయములోనివి అవధాని కంత తెలియును. కాటుకకొండ పోలిక యతనికి తెలియలేదు. కాని తాత్పర్యార్థము స్ఫురించెను. అతడు ముందు నడచెను. కొండలలో కొంత దూరము పోయిన తరువాత దొంగలుపడిన యారునెలలకు కుక్కలు మొఱిగినట్లు అతడొక సమాధానమిచ్చెను. 'వెలుగులు సూర్యుడు నిచ్చును, చంద్రుడు నిచ్చును. సూర్యుడు స్వతస్సిద్ధముగ తేజోవంతుడు. చంద్రుని యందు మనకు భ్రాంతి.'

శారద:—అన్ని భ్రాంతులు నితర విషయములందు. భోజనవిషయములో నే భ్రాంతియు లేదు.

మఱల నడచు చుండిరి. అవధాని యారాత్రి యంతయు సీతను గుఱించియే తలంచుచుండెను.

ఆడినచో సీతను పెండ్లియాడవలయు నని భావించెను. సీత విషయములో నతని కానుపానులు తెలియ లేదు. అతడు మున్ను వచ్చినప్పుడు సీత సౌందర్య మేల గ్రహింపలేడు? తా నింగ్లాండునకు పోక ముందు చూచిన సీతయందలి పసిభావము తన్ను వదలి పెట్టలేదు. లలితాసీతల సౌందర్యములందలి భేదములు దానికి గారణము. చూచినంతనే గుం డియ పట్టి గుంజని యందము సీతది. అసలు పట్టు చీర, కృతకమైన పట్టుచీర, తళతళలో భేదించును. కృతకవస్తువుధగధగలాడి మిలమిలలాడి యసంస్కృత మైన నేత్రములకు నచ్చువేసిలాగును. అసలు పట్టుచీర నేతయు తళతళయు మృదువులై స్నిగ్ధ ములై మన్నిక కలవై వాని సౌందర్యము తెలిసిన వారికే తెలియును. చూచినంతనే సీత యందము గ్రహించలేని తన సౌందర్యజ్ఞానమునే యాతడు నిందించుకొనెను. సీతయా సీత! ఆమె సనాతని. ఈ దేశములోని ఆత్మ. ఆమెకు పుట్టుక లేదు. చావు లేదు. ఆమె యెవనిచెంత చేరునో యతడు నిత్యజీవి- వానికి నాలుగు పురుషార్థములు గలవు.

అవధానికి శారదయన్నమాట సీతనుగురించియు యని యనుమానము కలిగెను. శారద యన్న యే

మాటలోనను ఆమె తాత్పర్య మంత దూరగామి కాదేమో యనుటకు వీలులేదు. శారద తన్ను ప్రశ్నించుచున్నదా? రాత్రి తాను సీతవంక జూచిన చూపుల కిది ప్రయుక్తపడి పెట్టుటయా? సీతయందు తనకు కలిగిన భావమునకు నిది పరిపోషకమా? అతని కేమియు తోచలేదు. కొంత దూరము పోయిన తరువాత శారద 'నేనింక నడువలే' నన్నది.

అవధాని:—నడువగలము.

శారద:—అయినను నడుచుట కిష్టములేదు.

అవధాని:—తిరిగి యింటికి పోదువా?

శారద:—పోవుటకు నడువనక్కరలేదా?

అవధాని:—ఇచట కూర్చుందుద మందువా?

శారద మాటాడకుండ నొకరాతిపై నాసీన యయ్యెను. అవధాని యింకొక రాయి లేక క్రిందనే కూర్చుండెను. అచ్చట రెండు పెద్దచెట్లు వారికి సమృద్ధిగా నీడనిచ్చెను.

శారద:—మాటాడవేమి?

అవధాని:—ఏమి మాటాడమందువు?

శారద:—లలిత రాలేదు. నేను వచ్చితిని. చూచితివా?

అవధాని:— లలితను కూడ తీసికొని రాక పోయితివా?

శారద:—అప్పుడింటిలో నందరను తీసికొని రావ లసి యుండును.

అవధాని:— అందరును ఎట్లు వత్తురు? మామయ్య రాడు. అత్తయ్యరాదు. తక్కినవాండ్రు వంట చెయ్యవలెను. ఇంటిలో పనులు చేసికొనవలయును.

శారద:—(క్రీఁగెదవి కుడివైపునకు లాగి నడుమ పండ్లతో పెదవి యొత్తిపట్టుద నొక్కి యొక చిత్రమైన చూపు చూచి) వారేమి కలెక్ట రుల భార్యలా? ఎవరి చేతనో వంట చేయించుకొనుటకు?

అవధాని:— చేయనివారు కలెక్టరుల భార్యలు కాబోలును.

శారద:—ఆశయైనను కలదుకదా.

అవధాని మాటాడలేదు.

కొంతసేపటికి శారద తానేపనిమీది వచ్చెనో దానికి వ్యతిరేకముగ జరిగిన ప్రసంగధోరణికి నొచ్చుకొని యిట్లనెను. 'ఏమో, చాల యోచించు చున్నావు. నేను కలెక్టరులను చేసికొనను.'

అవధాని మరల మాటాడలేదు. నాల్గు నిముస ములు గడచెను.

శారద:—నేను గాకపోయినను లలిత చేసికొను సనుకొనుచుంటివి కాబోలు. ఆమెకు ఈ పదినెలలలో నీయందు నిరాశ,నిరాదరణము కలిగెను. రాత్రి మరల నాయాశ కొంచె ముగా సంకురించుటయేగాని యామెకును కలెక్టరులను చేసికొనవలసిన యవసరము లేదు. రేపు కళాశాలలు తెరచినంతనే ఆమె బి.యే. చదువుటకు కాకినాడపోవును. ఆమె యిప్పుడప్పుడే వివాహ మాడినచో నామె చదువు భగ్నమగును. నేనును అంతే.

అవధాని:—ఈ మాటలు చెప్పుటకేనా నీవు వచ్చి నది?

శారద:—నీకు పాశ్చాత్యదేశ స్త్రీలు సౌందర్య వతులుగా కనిపింతురా? మన దేశ స్త్రీలా?

అవధాని:—ఎందు కా ప్రశ్న?

శారద:—ఊరకే యడిగితి ననుకొనుము. చెప్ప కూడదా?

అవధాని:—వారి యందము వారిది. వీరి యం దము వీరిది.

శారద.— ఏమండీ, ఫలహారము చేయుదురా? భోజనము చేయుదురా? యని యడుగగా నొక నీవంటి పెద్దమనిషి యిప్పుడు ఫలహారము చేసి కొంచెముసేపుండి భోజనము చేయుదు నన్నాడట.

ఈ మాట విని యవధాని కలవరపడెను. శారద యావులించిన ప్రేవుల లెక్కించు మనిషివలె నున్నది. అయినను నిది యామె వాక్కునకు సహజమైన చమత్కృతి.

అవధాని:—ఇష్టానిష్టములను గూర్చి మనము విచారించుచుండగా భోగవిషయము నీవు విచారించుచున్నావు.

శారద:— ఇష్టము, భోగము దరిద్రుని యందువలె ధనవంతునియందు భిన్న భిన్నములుగా నుండవు.

అవధాని:—(కోపముతో) ఇంటిలో నీవుమాత్రము తక్కువ తిన్నావా?

శారద మొగము కంటగించుకొనెను. తనయందున్న వివేకమున కపార్థము చేసికొనిన యవధాని తెలివితేటలయందు న్యూనభావము కలిగెను. శారద చాలసేపటి వఱకు మాటాడలేదు. మరి

కొంత సేపుండి 'సరే అట్లే యనుకొందము. ఈ రెండు సౌందర్యములలో నేది యెక్కువ యిష్టము.'

అవధాని:—నీకో?

శారద:—నాకా? స్త్రీలవిషయమా? పురుషుల విషయమా? పురుషుల విషయమైనచో నేను పాశ్చాత్యపురుషులను కలసికొననే లేదు. వారిని క్రోతులవలె ననుకరించు వారిని మాత్రమే యెరుగుదును. నాన్న చెప్పి నాడు, డార్విన్ (Darwin) అనువాడు క్రోతులనుండి మనుష్యులు పుట్టినారని చెప్పి నాడట. అతడు నేడు బ్రతికియుండి మన దేశము వచ్చినచో మనుష్యులనుండికూడ క్రోతులు పుట్టునని తెలిసెడిది.

అవధా:—అవునవును. మగక్రోతులే కాదు, ఆడ క్రోతులు కూడను.

శారద:— మగక్రోతులు నయముకాదా? ఆడ క్రోతు లసలే క్రోతులు. అందులో క్రోతి దుస్తులు.

అవధాని యీ మాటతో పీటీమన్నయ్యెను. శారదకు దురభిమానము లేదు. వాగ్వాదమునందు గెలుపు ఓటములచేత వికాసనిమీలనములు ఆమెలో

కన్పించలేదు. వ్యక్తిగతముగ తగిలినమాటకు ఆమె విచారించును గాని సామాన్యోక్తులయందు నామెకు చమత్కారాభిలాషయే. శారద తన్ను ప్రేమించి రాలేదు. ఎందుకో వచ్చినది.

అవధాని:—నాకు మన దేశస్త్రీలన్న నే యెక్కువ యిష్టము.

శారద:—కొంత తొలగిపోయినను వెంటనే గాడికి మఱలుదువు.

అవధాని కీవాక్యము అర్థము చేసుకొనునంత తెలుఁగురాదు.

అవధాని:— సరే. తరువాత?

శారద:—తరువాత నింకొక ప్రశ్న. మనదేశ స్త్రీలలో పరదేశస్త్రీలవలె నాచార వ్యవహారములు నెఱపు స్త్రీలన్నచో నిష్టమా? సంప్రదాయ మార్గమున చను కాంతలన్న నిష్టమా?

అవధాని:—పూర్వము తెలియదు. కాని యిప్పుడు రెండవరకమే యిష్టము.

శారద:—మేము ముగ్గు రక్కాసెల్లెండ్రము. మా ముప్పురిలో నెవ్వరియందు నీ కట్టి సంప్రదాయములు కనిపించును.

అవధాని:—నీవు.

శారద:—అయినచో నిదివరకు నేను అనుకొన్నంత తెలివికలవాడవు,

అవధాని:—నీవు చదువునది యఫ్.ఏ మాత్రము. నీ తెలివి విపరీతముగా నున్నది.

శారద:—అందులో నాశ్చర్యములేదు. నీవు చదివినది ఫోర్తుఫారమే కదా!

అవధానికి తల గిఱ్ఱునతిరిగెను. ఆమాట యన్నది ఆడుది. మేనమామ కూతురు-అందుచేత తమాయించుకో గలిగెను. కలిగి,

అవధాని:—మీా ముప్వురిలో సీత యెట్లుండును?

శారద తానన్నమాటకు బావ తబ్బిబ్బులగును, కోపము వచ్చును, ప్రసంగ మంతటితో ముగియును అనుకొనెను. అది జరుగలేదు సరికదా, మిక్కిలి సూటిగా మాటాడగా,మృదుహృదయమైన శారద వెంటనే కరగిపోయి హృదయకుహరాంతర్భాగ పర్యాప్తమైన యామె సౌకుమార్య మంతయు బయటకు వచ్చెను. 'బావా, నీవు సీతను పెండ్లియాడుము. సీత మాయింటిలో మిక్కిలి యిబ్బంది పడుచున్నది. మా పెద్ద బాబయ్య సీతకు నాల్గువేలిచ్చిపోయెను. నాన్న ఆ డబ్బు వాడుకొన్నాడు. ఇంటిలో నందరును

సీత నేడిపించుచున్నారు. సీత సానలుతేరిన జాతి రత్నము. నీ కీ పాశ్చాత్యమార్గగలైన స్త్రీలయందు వ్యామోహము లేనిచో సీతకంటె భార్యగా నుండదగిన స్త్రీ మనదేశములో దొరకదు. నేనును సీతను నిర్దయగానే చూచితిని. పాశ్చాత్యులకువలె భారతదేశ స్త్రీవిషయములందు ప్రసన్నత చేసికొనుట- అనగా Wooing అక్కరలేదు. నిజమైన భారతదేశ స్త్రీ మఱియు కుంటివాడు, గ్రుడ్డివాడు కానిచో, తన వర్ణమునకు చెందినవాడు అయినచో, నెవ్వనినైనను భర్తగా స్వీకరించుటకు సిద్ధముగా నుండును. ఆమెయందు పురుషుని గుణగణాదులకన్న పురుషత్వమందే, అనగా,ధర్మమందే నిశ్చితమైన బుద్ధి యుండును. అందమైనవానిని పెండ్లాడి గుణవంతుడైన వానిని పెండ్లాడి, ధనవంతుడైన వానిని పెండ్లాడి యా సౌందర్యధనగుణములు కాలాంతరమున లోపించినచో విషాదభాజన మగుట యెందుకు? ఈ తత్వము భారతదేశ స్త్రీకి నుగ్గుపాలతో బెట్టినది. భారతదేశములో జనించిన మాత్రమున నందరు స్త్రీలును భారత స్త్రీలుకారు. భారతదేశ మత సాంఘికాభిప్రాయములు జీర్ణించిన స్త్రీ మాత్రమే భారతదేశ స్త్రీ. వారిలో సీత తల

మానికము. నీవు సీతను పెండ్లాడుము. నాన్నకు అమ్మకు కోపము వచ్చును. లలిత కొంత దుఃఖించును. వారందరను నేను సర్దుకొందును. ఏ మందువు?

అవధాని;—శారదా ! నిన్ను గూర్చి నేను పొరపాటు పడితిని. గర్భమునందు రత్నము ఉన్న గిరి స్థానమువంటి నిన్ను, చెట్టు చేమ మొలవని గుట్ట వచుకొంటిని. నేనాలోచించి చెప్పెదను. నీ వింత తెలివి కలదానవు, రహస్య గోపనశక్తి కలిగి యుండవలయును. నేను ఇప్పుడు చెప్పుచున్న మాటలకు నీ యిష్టము వచ్చిన యూహా లూహించకుము. తరువాత నేనే చెప్పెదను. సీతను పెండ్లి యాడుటకు సర్వథా ప్రయత్నింతును. సీత రత్నము వంటిది.

శారద:—సానలుతీర్చిన జాతిరత్నము.

వారిద్దరు సాయంకాల మింటికి పోవునపుడు పరమ మిత్రులవలె మాటాడుకొనుచుండిరి. వారి యిద్దరిమధ్య పొలుపు కనుపించలేదు. ఒకరి హృదయము లొకరికి తెలిసినట్లు, కలసిన రెండు కాల్వల వలె, కలసిన చోటి నిమ్నోన్నతతరంగములుకూడ

కన్పించకుండ నేకవాహినిగా వచ్చుచుండిరి. భ్రూభంగముతో విధురాపాంగముతో వారివంక చూచిన లలిత ఆ రెండు కుల్యాల కలయిక సోదర భావ మనుకొనలేదు. శృంగారభావ మనుకొన్నది. ఆమెకు ఇంకొక రీతిగా ననుకొన శక్తిలేదు. ఆమె యట్లనుకొనిన దని, అనుకొనునని శారద కంతకు ముందే తెలియును.

ఆరాత్రి భోజనము రెండుమూడు పంక్తులుగా లేచెను. శారదయు, నవధానియు నందఱికన్న చివర వచ్చిరి. సీత వడ్డించుచుండెను. సీతతో నేమి మాటాడుటకును శారదకు గుండె యానలేదు. ఆమె కనుకూలమైన మాట కొన్ని నెలలైన తరు వాత, హఠాత్తుగా, శారద ముఖమునుండి వచ్చినచో అమె సరిగా నర్థము చేసికొనునో, చేసికోదో? అవ ధానియు సీతను మున్ను చనువుగా, దోస్తీగా పలుకరించినది లేదు. అవధాని యింగ్లీషులో 'మంచు కోయవలయు' ననెను. శారదకుగూడ నా యింగ్లీషు నుడికారము తెలియలేదు. వారిద్దరు నొకరి మొగము నొకరు చూచుకొందురు. ముసి ముసి నవ్వులు నవ్వుకొందురు. విస్తరిలో లేని పదా ర్థము-తనకు గావలసినపదార్థము, సీత వడ్డింప రాగా

అతడు చేయి యడ్డముపెట్టి సీత మొగమువంకజూచి వలదనును. సీత తిరిగి పోవుచుండగా శారద పిలచి 'బావకు కావలయును. నవ్వు చున్నా'డనును. ఇట్లు రెండుమూడుసారులు పోయివచ్చుటలు జరిగిన తరువాత సీతకు నవ్వుబదులు కోపము వచ్చి పళ్లెమచ్చట నుంచి పోయెను. శారద సగము భోజనము చేసి కంచము వదలి వెడలిపోయెను. సీతకు భయము వేసెను. ఆమె లేచిపోయిన దను దోషము తనయం దారోపింపబడి యది యొక క్రొత్త సాదింపునకు హేతువగునేమో యని యామె గగ్గోలుపడి, చేయి కడుగుకొనుచున్న శారద కడకు పోయి, 'ఏమే శారదా! నిన్ను నే నేమన్నాను?' అనెను.

శారద:— 'నీవేమియు ననలేదు. నాకే సరిగా నాకలి లేదు. నే డడవివెంటఁబడి కాయ గసురులు తింటిని. కడుపులో సరిగా లేదు.

శారద యన్న తీరు సీతకు సందేహము లేకుండ నిజముగానే చెప్పిన ట్లనిపించెను. సీత 'పిన్నితో చెప్పవు కదా' యనెను.

శారద:—"భయము లేదు. చెప్పుట కేమున్నది" అని సీతయొక్క దీనావస్థనుగూర్చి భావించెను.

సీతకు ఆ యింటిలో బ్రదుకు కత్తిమీద

సాముగా నైనదని వేఱ చెప్పవలసిన యవ
సరము లేక పోయెను. మఱల తిరిగి వచ్చిన
సీతతో-

అవధాని:—శారదకు కోపము వచ్చినదా?

సీత:—కడుపులో సరిగా లేదట.

అవధాని:—ఈ పచ్చడి మిక్కిలి రుచిగా నున్నది.
నీచేతితో చేసిన దేది బాగుండదు! ప్రాత
చీర తాల్చినను ఇంత యందముగా నున్న.
నీవు చేసిన పదార్థము రుచిగా లేక
పోయినను రుచిగానే యుండును.

ఈ మాట లనుచు నవధాని సీత మొగమువంక చూచెను. సీత మొగములో కొంచెము భయము, కొంచెము వైముఖ్యము కలిగెను. ఇట్లు లభించిన ఏకాంతము అవధాని దురూహాలకు వీలు కల్పించు చున్నట్లు తోచెను. అతనికి లలిత నిత్తురు. తనతో మరదలి సరాగము నాడవచ్చును. అందరు కలసియున్నప్పు డాడని సరాగము ఈ యేకాంత సమయమునం దేల మొదలు పెట్టెను. ఆమె యత నికి కావలసినది వడ్డించి తలుపు వెనుక నిలుచుండెను.

అవధాని:—సీతా! నేను నీ కెవరినే? మేనత్త
కుమారుడను. పరాయి పెద్దమనిషిని చూచి

నట్లు చూతువేమి? ఇదివరకు నీతో మాటా డని నే నిప్పుడు మాటాడుట నీకు క్రొత్తగా నుండెనా? నేను నిజము చెప్పుచున్నాను. లలితను గాని, శారదనుగాని వివాహ మాడను. ఈ సంగతి నీకే తెలియగలదు. నీ కంత కష్టముగా నున్నచో నేను పలుక రించను. వచ్చి యెదురుగా నిలుచుండ వచ్చును. వలదన్నచో నీవంక గూడ చూడను.

సీత:—నే నూరకయే తలుపుచాటున నిలుచుంటిని.

అవధాని:—ఊరకయే యెదురుగా నిలుచుండుము.

ఇరువురును నవ్విరి. సీత నవ్వు మెఱపు మెఱసి నట్లుండెను. అనగా వెంటనే చీకటు లావరించెను.

అవధాని:—సీతా! నీ కొక రహస్యము చెప్పెదను. నీ వీ యింటిలో పడుచున్న బాధలన్నియు శారద నాతో చెప్పెను. నీడబ్బు మామయ్య క్రింద పడెననియు, ఆయన మరల సర్దు బాటు చేయలేడనియు, అత్తయ్యయు లలి తయు నిన్ను సరిగా చూడకపోవుటయు—

సీత:—శారద మాత్రము సరిగా చూచెనా?

అవధాని:—శారదకు తక్కినవారికి భేదము కలదు. శారద గులాబిమొక్కవలె ముండ్లు కలదే కాని, పూచిన పువ్వుయొక్క తావిచేత దశ దిశలు పరిమళింప జేయునది. ఆమె హృదయ మామెకే తెలియదు. వెన్నవలె నూహా చేసి రాతివలె మాటాడును. వేయి సెల యేళ్లు ప్రవహించు నీటిబుగ్గవంటి సింహా చలపు కొండవంటిది. దూరమునుండి సింహాద్రికూడ కొండవలెనే కనుపించును. ఆ కొండనుపోయి అట్లు ముట్టుకొనుము. జల జల తెలిశీకరములచెమ్మ బురబుర పొంగి వచ్చును.

అవధాని యింత చక్కగా మాటాడుట యవ ధానికే యాశ్చర్యమాయెను. సీతకు నతని మాట లలో నొక యనిర్వచనీయమైన సద్భావము గోచ రించెను.

అవధాని:—నీ విచ్చట నెన్నాళ్ళుందువు? నేనొక చోట నిలువగా నుండుటలేదు. ఇంకొక యేడాది గడచిన గాని నా యుద్యోగము నకు స్థిరత్వము పట్టదు. అయినను నావద్దకు వచ్చి నీ వుండుటకు సంకోచింతువు. నా

యునికి స్థిరపడినచో మా యమ్మను తీసి
కొనిపోవలయునని యున్నది. ఆమెవచ్చునో?
రాదో? వచ్చినచో అమ్మమ్మను, నిన్నును
తీసికొనిపోయి యొక నెల, రెండు నెలలు
నావద్ద నుంచుకొందును. నీకిచ్చట మిక్కిలి
కష్టముగా నున్నచో నీ యప్పగార్లవద్దకు
తీసికొని పొమ్మందువా? ఇప్పుడు సెలవులే
కదా!

సీతకు మేఘోదయము కలిగిన నెమలితనము పట్టెను. తాను వ్రాసిన జాబునకు తన రెండవ యప్పగారు సమాధానమే యీయలేదు. పెద్దక్క గారికి జాబే చేరలేదు. తాను వారిని జూచి యా రేండ్లయినది. వారిద్దరి అత్తవారిండ్లును కృష్ణా గోదావరి జిల్లాలలో నుండెను. ఆ యత్తవారలు పూర్వాచార పరాయణులు. పదునేడేండ్లు వచ్చి యవివాహితయైన తమ కోడలిచెల్లెలు తమ యింటికి వచ్చుట వారి యత్తమామలకు గిట్టదు. మఱి యొక గతిలేదు. ఆమె చాలసారులు వీమల యింటికి పోయి యుండరాదా యనుకొనెను. కాని మదరాసు పోవుటకు తనకు డబ్బేది? ఉన్నచో మాత్రము తాను స్వతంత్రించి పోగలుగునా? అవధానితో

'మాయప్పగార్ల యిండ్లకు నేను పోవుట బాగుగా నుండ'దనెను.

ఆరాత్రి, పదినెలలకు సీతకు శాంతమైన రాత్రి గడచెను. ఆ మరునాడు ఎట్లు వచ్చెనో? భావ దేవతలు వాయువీధుల విహారించుచుందురో! ఆత్మ లోని భావము దాని యంతట నది క్రియాపరిణతి లేకుండగనే యొక్కొకపుడు విలుప్తమై పోవును. మఱియొకప్పు డది సత్యరూపమునంది ప్రత్యక్ష మగును. వివేకానందున కొక యుత్తరము వచ్చెను. సెలవులలో మరదండ్రను ముగ్గురను మదరాసు పంప వలయుననియు, ముువ్వురను పంపవీలులేనిచో సీత నైనను పంపింపవలయుననియు,వలసినచో రైలుచార్జి సీతకు తానిత్తుననియు. వివేకానందునకు పరి పరి విధముల యూహాలుపుట్టెను.సీత రహస్యముగ విమ లకుగూడ నుత్తరములు వ్రాసెకాబోలును. లేనిచో విమల అక్లేల వ్రాయును? అత డాయుత్తరమును సీత కిచ్చెను. సీత నాయనమ్మకు చదివి వినిపించెను. ఆ సమయములో నవధానియుండెను. అవధాని 'నేను టిక్కెట్టు కొనియిత్తును. నీవొక్కర్తవు పోగలవా?' యనెను. సీత చిన్నప్పు డెప్పుడో రైలుమొగ మెఱు గును.నాయనమ్మ'అదిపోలే'దనెను.అవధానికి సెలవు

లున్నవి. పోయి దిగబెట్టి రావచ్చును. అతని కా
ర్కోర్కెయు నిండి యుండెను. కాని సీత యందు
కంగీకరించలేదు. శారదను సీతను బయలుదేరదీసి
నచో సరిపోవును. శారద చాలసారులు విజయ
నగరము, వాల్తేరు పోయి వచ్చియుండెను. వాల్తే
రులో మెయిలులో కూర్చున్నచో మఱునాడు తెల్ల
వారుసరికి మదరాసులో నుందురు. అవధాని విమ
లకు ఫలానానాడు సీతాశారదలు వచ్చుచున్నారని
వ్రాసి, వారిని వాల్తేరులో నింటర్మీడియేట్‌లో
మెయిలులో నెక్కించెను. వివేకానందుడు మాటాడ
లేదు. శాంత సమాధానము చెప్పలేదు. మెయిలు
బయలు దేరుటకు పదినిముసము లుండెను. అరటి
పొత్తులలో పెట్టిన సంపెంగ పూలు, హార్లిరుపుస్త
కాల యంగడిలో పది పదునొకండు తెలుగు నిం
గ్లీషుపుస్తకములు, పత్రికలు కొని వారిచేతికిచ్చెను.
సీతకు నాలుగుక్రొత్తచీరలు, మంచి వెలగలవి, ఉల్లి
పొరలవంటివి, మృదువైన రంగు కలవి యదివరకే
కొనిపెట్టెను. ఆమె నత్తవారింటికి పంపించుచున్నట్లు
ఆమె యద్దమామెకు, ఆమె దువ్వెన ఆమెకు,
ఆమె సువాసనా తైలము లామెకు, కప్పుకొనుటకు
సేలువ, నగలు తప్ప నన్నియు కొనిపెట్టెను.

రైలు బయలుదేరు ననగా, బయలు దేరిన తరు వాత సీత కన్నులలో నొక కృతజ్ఞతాభారము వెన్నెలతీవ చివుళ్లు కట్టెను. ఆమె నేత్రములనుండి జ్యోతిర్గోళములు పునఃపునస్సృష్టములై వాయుపథ మున నంతరించి పోవుచుండెను. అవధాని మెడలో పారిజాత పుష్పమాలారమ్యము లయ్యెను. అతని కన్నులలో వెన్నెల బుడగ లూదినట్లుండెను. ప్లాట్ ఫారముమీాద పలుమంది యతనికి నమస్కారము చేయుచు దూరముగా నిలుచుండి అత డత డని చెప్పుకొనుటయు, సీత కత డొక మహాపురుషునివలె కనుపించెను. ఎందు కతనికీ యకారణ వాత్సల్యము. వదిన తన్ను రమ్మని యేల వ్రాసినది. సీత యొక యానందమయలోకమున నుండి యూహాశాలిత్వ మునే కోల్పోయినట్లుండెను. ఇంటినుండి బయలు దేరినది మొదలు శారద తనయందు అనన్య సామాన్యమైన సోదరీప్రేమ వెల్లడించు చుండెను. ఆ రాత్రి రైలులో నిద్దరును చెరియొక బల్లపై పరుండిరి. శారదకు నిద్రపట్టెను. సీతకు నిదుర పట్టలేదు. శారద యింత తెలివికలది. బావను తా నేల ప్రేమించలేదు? అత డామెను తిరిగి ప్రేమించక పోవుటచే నామె ప్రేమప్రవాహము తనపై మర

లించెనా? లలితయెడ నామె కేల యధికమైన ప్రేమ లేదు? శారద కంటిలోగాని మాటలోగాని యే నైరాశ్యభావమును గోచరించుటలేదు. ఒకరాత్రి వేళ శారద మేల్కొనెను. 'సీతా! నిద్ర పట్టలేదా? యనెను.

సీత:—అవునుగాని బావను నీ వేల ప్రేమించలేదు?

శారద:—బావ నన్ను ప్రేమించినను నాతో సంసారము చేయలేడు. నాకు బావకన్న తెలివికలవాడు కావలయును.

సీత:—బావకన్న తెలివికలవార లుందురా?

శారద:—అదియే నీకును నాకును భేదము.

సీత:—అనగా?

శారద:—"పండుకొని నిద్రపోవుము" అని తాను నిద్రపోయెను. సీతకు మరల నిద్రపట్టలేదు. బావ కన్న నెక్కువ తెలివికలవా రుందురా? బావకన్న శారదయే యెక్కువ తెలివికలదా? తాను మంద మతియా? తన కన్న శారద యేమి తెలివికలది? తన కును నందరి యూహలును తెలియును. తనకు సాహసము లేదు. స్వతంత్రభావము లేదు. ఈమాత్ర మునకే యెక్కువ తెలివితేటలా? బావ అదివరకు వచ్చినపుడు తన్నొక స్త్రీ వలెనే చూడలేదు. ఈసారి

హఠాత్తుగా నిట్టి యౌదార్య మేల కలిగెను. ఒక వేళ తన పినతండ్రి తన డబ్బు పెగిలించలేదు కనుక, త న్నవధాని కిచ్చి యీ బెడద దాటవలయు నను కొనెనేమో? శారద యీ రాచకార్యమునకు కాయబారి యేమో? శారద తనయందు చూపించు చున్న స్నేహభావమునందు తన కృతజ్ఞత యిట్లు న్నది. సీ సీ.

ఆమెకు నిదురపట్టెను. నిదుర పట్టు వేళకు మెయిలు బెజవాడ కడ కృష్ణవంతెనమీద బొంయ్యి బొంయ్యిమని పోవుచుండెను. సీత తాను తొట్టెలో పరుండెను. తల్లి జోలపాడుచుండెను. సీతకు పెండ్లి జరుగుచుండెను. బాకా లూదుచుండిరి. సీత తాను నవధానియు నేదో యూరు పోయిరి. ఇద్దరకును పెద్ద సభచేసి పుష్పమాల లలంకరించిరి. సీత తన్ను తాను జూచి లలిత ననుకొనెను. తాను సీత నని తెలియును. పుష్పమాల తన మెడలోనే పడినది. కాని తన్ను తా చూచుకొనెను. అది లలిత శరీ రము. ఇట్టి కలత నిద్దుర క్రమముగా గాఢనిద్రగా పరిణమించెను. ఆరైలులో కొన్ని వందల ప్రాణము లుండవచ్చును. ఏప్రాణి కా ప్రాణి రైలునకు కొంత బరువు సమకూర్చెను. సీత శరీరము ఏ వంద పౌను

లైన తూగునా? కథలలో చెప్పినట్లు ఆమె యేడు మల్లెపూలయెత్తు తూగునా? అస లామెకు శరీర మున్నదా? లోనున్న ప్రాణములకు తూక ముం డునా? సీత గాఢనిద్రావశయై యున్నపుడు శారద యొకసారి మేల్కాంచి యామె వంక చూచెను. నిద్రాసుందరియైన సీత యెంత నేత్రాభిరామగా నున్నది? తాల్చిన క్రొత్తచీర రైలులో నలిగి మాసి నట్లుండెను. కిటికీనుండి ప్రక్కగా చూచుటవలన చెదరిన శిరోజములును ముంగురులును ఆమె మొగముపై వ్రాలు చుండెను. సీత యెంత చక్కని విగ్రహము. తాను మగవాడై సీతకు మేనత్త కొడుకైనచో నెంతబాగుగా నుండెడిది? ఈయూహ కామె తనలో దానే నవ్వుకొనెను. తనలో స్త్రీ ప్రకృతికన్న పురుషప్రకృతి యెక్కువ యుండెను. పూర్వజన్మలో తాను పురుషుడేమో? శిఖండిమాట జ్ఞాపకము వచ్చెను. నవ్వువచ్చెను. సీత రొమ్ముపై తొలగిన చీర నప్రయత్నముగా సర్దెను. సీతకు నంత గాఢనిద్రలో పరహస్తస్పర్శ తగిలినంతనే మెలకువవచ్చెను. నిదుర వదలిన కన్నులలోనుండి శారద దేవతాస్త్రీవలె కనిపించెను. ఆమె మను చరిత్రమెంచక్కగా చదువుకొనెను. మాయాప్రవరుని

రంభాద్యప్సరసలు ఎత్తిపాడిచిన పద్య మామె మన స్సులో నెప్పుడును తాండవించును. ఆమెకు మను చరిత్రగురువు శారద. రంభ నిర్దయబుద్ధి వని దూరెను. ఘృతాచి చేదు మ్రింగెద.వంచు నవ్వెను. గొంటువనియె తిలోత్తమ. పుంజికస్థల యదల్చెను. దివిజకామినులు గువ్వకోలుకొన్నారట. శారద యా గువ్వకోలు కొనుట మిక్కిలి యందమైన మాట యని చెప్పెను. వారందరిలో చేదు మ్రింగెదవన్న ఘృతాచి యేమో మిక్కిలి సౌహార్దము కలదట. ఆమె గుండెలోని సౌకుమార్యము చెప్పనలవి కాదట. శారద కీ సంగతు లన్నియు నెట్లు తెలి యును? శారద ఘృతాచి వంటిది.

నిద్రామాంద్యము పదలని కంటి కాంతులలో నుండి సీత ఘృతాచిని చూచెను. మఱల నిదుర పోయెను. శారద 'ఓసీ పసిదానా' యనుకొనెను. పసితనము వయసులోనిది కాదు. ఆత్మలోనిది. అమితజాగ్రదవస్థాప్రాప్తమైనదియు, సంకల్ప వికల్ప బహుళమైనదియు నైన మనస్సుకు పసితన మే మున్నది? ఏకమైన యమాయక భావమునందు నిత్య లగ్నమైన మనస్సునకు పసితన మెట్లు వదలును?

ప్రొద్దుననే విమలయు మోహనరావును సీతా శారదల కొఱకు రైలుస్టేషనుకు వచ్చిరి. విమల యెప్పుడో చిన్నప్పుడు వారిద్దరను జూచెను. మోహనరావు ఎఱుగనే ఎఱుగడు. శారద చిన్నప్పు డెట్లుండెనో యిప్పుడు నట్లే యుండెను. విమల వెంటనే గుర్తుపట్టెను. విమల మరదండ్రను కౌగిలించుకొని నలుగురును కలసి టాక్సీ కట్టించుకొని మాంబలము పోయిరి. మోహనరావు విమల భర్త యని చెప్పకుండనే తెలిసెను. సీతాశారదలు మోహనరావుతో నన్నగారితో వలె- అతడు వారితో చెల్లెండ్రతో వలె- వెంటనే మాటాడ జొచ్చిరి. బంధుత్వములో నది యొక సొగసు. దానిలో క్రొత్తప్రాతలు లేవు, ఏమండీ, ఏమయ్యా, ఏమోయి, ఏరా అను తరగతులు లేవు.

సీతా శారదలు మదరాసులో రెండు నెల లుండిరి. పట్టణములో చూడవలసిన విశేషము లన్నియు చూచిరి. వీరి పేరుమీదుగా విమలగూడ పట్టణమంతయు జూచెను. ఒకనాడు సీతమెడ బోసిగా నున్నదని, గాజులు నలిగిపోయిన వని, గాజులమీద మరి రెండు కాసులు వేసి మరిరెండు జతలు చేయించెను. మెడలోని కొక గొలుసు కొని యిచ్చెను.

సీత వలదన లేదు. ఆమె మొగములో కన్నులలో నిదియంతయు నెంచుకని యొక కష్టభావము కనిపించుచునే యుండెను. విమల మరదంద్ర విషయములో నింత డబ్బగు నని అంత వ్యయమగు నని విచారించలేదు. మోహనరావునకు చెల్లెండ్రులేరు. వీరి కన్న లేడు. ముగ్గురు నేకగర్భవాసులవలె కలసి మెలసి యుండిరి. సీతకు రోహిణికి త్రెంచరాని లంకె యైనది. రోహిణికి సీత తల దువ్వ వలయును. తానాజీ శారదతో నెక్కువ చనువుగా నుండెను. తానాజీకి తాను చదువు చదువులో నే సందేహము వచ్చినను శారదయే తీర్చవలెను. 'అత్తా! నక్షత్రములు ఆకాశమునకు దేనితో నంటించిరి? అంత తుమ్మబంక యెచ్చటనుండి వచ్చెను? అత్తా! మ్యూజియములో సింహములను చూచితిమి కదా! పులిని చూచితిమి కదా; అన్ని మృగములను చూచితిమి కదా! వాని మొగము లట్లుండు నేమి? వానికిని మనుష్యుల తల లేలలేవు? అత్తా! కాగితము చింపుదు మనుకో! మరల నేల యంటుకొనదు? ఇట్టి విపరీత ప్రశ్నపరంపరతో నదివరకు తెలివిగలదాన నను కొన్న శారద తెలివిలేనిదాన ననుకొనెను. రెండు నెలలు మదరాసు నివాసముతో సీత మొగములో

విషాదచ్ఛాయ లంతరించెను. ఆమెశరీరము మఱల తొలినాటివలె సుపరిపుష్టమయ్యెను. ఒకనాడు ముప్వురు వదిన మరదండ్రును తానాజీ రోహిణు లతో గూర్చొని ఛాయాచిత్రములు తీయించుకొనిరి. సీతఫొటో ప్రత్యేకముగా తీయబడెను. దాని కై దారు ప్రతులు విమల ప్రత్యేకముగ తీయించెను. ఒక ప్రతి శారద సీతతో బావకు పంపించుమనెను. సీత సగే యనెను. దానిమీద నేమివ్రాసి పంపించవలెను?

సీత:—ఏమి వ్రాయవలయును?

శారద:—నీకు బావమీద కల ప్రేమ కనుపించునట్లు వ్రాయవలయును.

సీత:—బావకు 'కృతజ్ఞురాలు సీత' అని వ్రాయుదును.

శారద:—కృతజ్ఞురాలు కృతఘ్నురాలు.

సీత:—అట్లు వ్రాసిన బాగుండదా?

శారద:—నిన్నతడు పెండ్లి చేసుకొనవలయు నను కొనుచున్నాడేమో? కృతజ్ఞురా లనినచో నీకు నతనికి గల సంబంధము వట్టి ధన విషయ మగును. అతడు నీ కప్పిచ్చెనా? వడ్డీమీద నాశయున్నదా? వట్టిమేనమామ

కూతుర వని యిచ్చెనా? అయినచో లలిత కేల యీయలేదు. నీవు బావ కెంత కృతజ్ఞు రాలవో వదినకు నంత కృతజ్ఞురాలవు కావలయును. బావకు వదినకు భేదమేమి?

సీత:—మఱి యేమి వ్రాయుమందువో చెప్పుము.

శారద:—బావ నీ యందున్నట్లు నాయందున్నచో, బావయందు నీకున్నట్లు నాకున్నచో, నేమి వ్రాయవలయునో నాకు తెలిసెడిది. ఇప్పుడు నాకు తెలియదు.

సీత యేమి వ్రాసెనో? చిత్రము పంపించెను. సెలవులైన తరువాత సీతాశారదలు మరల పర్లాకిమిడికి పోయిరి. సీతజీతము విమల పంపితునని చెప్పెను. వారు రైలెక్కి పోయినపుడు మోహనరావు ఆడుపడుచులకు జరిపెడు మర్యాద జరిపెను. సీత సగము నిండిన యొక పెట్టెతో వచ్చినది. మూత విరియువరకు చీరలతో రైకలతో వస్తువులతో నిండిన రెండు పెట్టెలతో పర్లాకిమిడి చేరెను.

౭

సీత తన చిత్రపటము నొక యుత్తరముతో జోడించి బావకు పంపించెను. ఆ యుత్తర మిట్లు వ్రాసెను. 'బావా! నీకు శారద మధ్యవర్తి. అది

దూతిక ననుచున్నది. నీవు నన్నొక వ్యూహములో నిక్షేపించితివి. నేను అమాయకురాలనై యీ వ్యూహములో నడిమికి వచ్చువఱకు నిది వ్యూహమని తెలిసికొనలేక పోతిని. ఇప్పుడు తెలిసి కొనియు లాభము లేదు. నాకు చేతనైన దొక్క టియే. నీకు నా హృదయముతో నమ్మొడుపోవుట. ఇంకొకరీతిగా నుండుట నాచేతగాదు. పోయినచో మూలముట్టుగా దోచియిచ్చుట, కానిచో నొడ్డున గూరుచుండుట. ఇంకొకరీతి నా చేతగాదు. నన్నీ వ్యూహములో అభిమన్యువధ చేయకుము.— నీ సీత.' ఈ యుత్తరము అవధాని వందసారులు చది వెను. ఆ వందసారులు చదువుటకు ఆరునెల లేదు నెలలు పట్టెను. అందలి యర్థము గోచరించలేదు. అతని కెప్పుడును ఆలేఖ శారద వ్రాయించిన దని యనుమానమే. సీతయే యయినచో నభిమన్యు వధప్రస్తావన యుండదు. కాక సీత ప్రకృతిలో దా నెరుగని యొక నిగూఢమైన లోతు కలదా? పది పదునొకండుసార్లు సీతకు సమాధానము వ్రాయవలయు ననుకొనెను. ఒకసారి వ్రాసెను. 'సీతా! నేను దీనిని వ్యూహముగా నుద్దేశించలేదు. నీ వా నడుమ చిక్కుకొన్నానను భ్రాంతి పడు

చుంటివి. ఈ భ్రాంతిని తొలగించుకొనుము. అభిమన్యుడు మొదలైన మాటలకు, ఆ విషయమైన భయములేదు' అని. ఈ యుత్తరము మరునాడు చింపివేసెను. సీత తాను ప్రాపించిన తన చిత్రము నవధాని చూచును. చూచినపుడెల్ల నొక సమాకర్షణము జరుగును. చిక్కిపోయి తాను పర్లాకిమిడిలో చూచినప్పటి సీతకు, మహోత్సాహముతో కృతజ్ఞతామధురాపాంగయైన వాల్తేరు ప్లాటుఫారముమీది సీతకు, ఈ చిత్రములోని సీతకు నొక ఋరుస యుండెను. సీతను ప్లాటుఫారముమీద చూడనిచో నా చిత్రములోని సీతను అవధాని గుర్తుపట్టగలిగి యుండెడివాడు కాదు. శరీరమునందు పర్లాకిమిడి సీతకు మదరాసులోని సీతకు సంబంధము లేదు. ముఖమునందు ప్లాట్ఫారముమీది సీతకు మదరాసులోని సీతకు చాల సంబంధము కలదు. వాల్తేరులో నున్నప్పుడు సీత యొడలికి, నామె మొగములోని వికాసమునకు సంబంధము లేదు. చిత్రములో నామొగము నామె శరీరము కలసిపోయి యొక యేకవాహినిగా కనుపించెను. ఆ సౌందర్యము దివ్యలోకసంభవము. పంచజనలోక సంబంధి కాదు. సీత యుత్తరము పెళ్లుసుగా

నుండెనా? విచారించగా హృదయములోని యా థార్థ్యము గాఢశీలత్వము ఏకముఖత్వము నా మాటలయందు గనిపించుచున్నవా? చూచుచు జూచుచు నొక భ్రాంతిపడి యెట్టయెదురుగా నున్న యమృతభాండము కాదనుటయా? ఆరు నెల లైనది. సీతకు దాను సమాధానము వ్రాయలేదు. సీత యిపుడు స్కూలుఫైనలు చదువు చుండెను. మూడు నెలలలో నామె యా పరీక్ష నిచ్చును. తరువాత నామె చదువునా?మానునా? చదివినచో డబ్బెచ్చటనుండి వచ్చును? ఈ సంవత్సరము ఆమె జీతము తానేల యీయలేదు. ముందు నాటి కీయ వచ్చును లెమ్ము. ఇప్పుడు తానేమి చేసినను సీత చెప్పిన వ్యూహపు త్రాళ్లు మరియు బిగించునట్లు సీత యభిప్రాయమును దృఢపఱచుట యగును. ఇంత వఱకు సమాధానము వ్రాయకపోవుటయే వ్యూహ భావమును తొలగించకుండుట. ఆమెకు వ్యతిరేక ముగ సమాధానము భావించినపు డెల్ల తా నామె చిత్రమును చూచి వ్యతిరేకభావము నుపసంహ రించుకొనుచుండెను. ఈసారి హృదయమును బట్టి పాలార్చుచున్న యామె చిత్రము వంక చూడకుండ సమాధానము వ్రాయవలయు ననుకొనెను. ఈ

యూహ తగిలినపుడెల్ల నతనికి తెలియకుండ నతని కన్నులయెదుట నొక మధురభావమూర్తి, యప్సరోనవ్యశృంగారమధురాపాంగ, అపాంగాంతకాంతి రేఖావివృతహృదయగతమధుశోభ, తచ్ఛోభా సమాకృష్టస్వహృదయాంబుజ, కన్నులయెదుట గోచరించుచుండెను. అతనికి సంకల్పవికల్పములు బహుళముగా నుండెను. సీత పెద్ద చదువరికాదు. అధునాతని కాదు. తన యూహల కనుకూలమైన ప్రకృతి కలది కాదు. తాను మనుష్యుడు. సీత దివ్యరాలు. తాను లౌకికవాంఛాసమాకృష్ట హృదయుడు. ఆమె దేవతాభావసమాసన్న హృదయ. తనకు నామెకు సంబంధము లేదు. తాను శారద నైనచో వివాహమాడును. సుఖించును. తానొడ్డిన యొడ్డులకు శారద ప్రతిగా నొడ్డగలదు. తన మనస్సులోని వికారములను శారద చెప్పకుండగనే గ్రహించగలదు. శారద వివాహమునకు పనికివచ్చునా? శారదయొక్క మనోవివేకము, సీతయొక్క సౌందర్యము, రెండును గలసియున్న స్త్రీ యైనచో తన్ను సంపూర్ణముగ వశపఱచుకొనును. మరియొకసారి యూహించినచో నట్టి శరీరమునకు, నట్టి ముఖదీధితికి, నిట్టి మనో

వికారభావమునకు సంబంధము లేదేమో? వాని రెంటి యేకత్రస్థితి సృష్టింపబడదేమో? సృష్టిలో ననే వాని పరస్పరసమ్మేళనము విరుద్ధసమావేశ స్థలమేమో? లలిత కాకినాడలో చదువుచున్నది. నాలుగైదు నెలలలో దాను కాకినాడలో నసిస్టెంటు సెషన్సుజడ్జిగా నుండును. న్యాయశాఖాపాలన శాఖలలో తాను న్యాయశాఖ నేల స్వీకరించెను? తన ప్రకృతి, తన పూర్వచరిత్ర, తన ప్రస్తుత చరిత్ర, న్యాయశాఖకు సంబంధించినవి కావు. చిన్ననాడు తాను జేబుదొంగ. తన దురాశ కంతులేదు. తనకు మహోపకారియైన గురుమూర్తిగారి యాస్తిని తాను దిగమ్రింగెను. ఆ గంగిగోవు ఎంత సులభముగా తన యాస్తిని వ్రాసియిచ్చెను? బదులు మాట యొక్కటి చెప్పలేదు. నాయనా యని అతడా నాడు చేసిన సంబోధన నాటికి తన హృదయములో నిందాతిరస్కారభావములు పుట్టించినను నిప్పుడు ఆ పిలుపు తన హృదయమునకు మెలివేసినట్లుండెను. ఇట్టి యూహాలు తన కిదివరకు పుట్టలేదు. తన పూర్వప్రకృతికి నీ యూహాలకు సంబంధము లేదు. ఇట్టి యూహాలు తనకు వచ్చుట యిదియే మొదటిసారి. ఈ యూహాలకు బీజ మెచ్చ

టిది? పదిసారు లేతాదృశోహావధిగ నీ భావము తన మనస్సులో నిరుత్తరముగా నుండెను. ఒకసారి యేతాదృశసుకుమారభావములకు సీత బీజభూత యని స్ఫురించెను. సీత మొగము, సీత నవ్వు, సీత యమాయికత,- ఆమె హృదయము తనమీద నట్లు రాజ్యము చేయుచుండెను. తనకు సీతకు నేమి సంబంధము? సీతవంటి ప్రకృతి మీద తన కీ యాశ యెందులకు? రెండేండ్లుగా తనకు నట్టి యాశలకు సంబంధము లేదని తెలిసిన తనగుండె యీరీతిగా నేల వ్యభిచరించుచున్నది? తాను బొంబాయిలో నడుగుపెట్టిననాడే తాను తన మరదంద్రకిట్టి యాశ కలిగించరాదని చేసికొన్న నిశ్చయము తనకు తెలియకుండగనే యీ జాలుపాలెట్లు పోం దెను. తాను సీత నన్యాయము చేయుట లేదా? ఈ యన్యాయపు కుండ యెప్పుడు బ్రద్దలగునో? ఒక బాంబు ప్రేలినట్లు ఆ పగిలన ఘటశకలములు ఎన్ని హృదయములను విదీర్ణములను చేయునో? ఆనాటి తన యప్రతిష్ఠ యెట్టిదగునో? తన హృదయములో నున్న రహస్యము తానే గట్టిగా నూహించుకొనలేడే? అది నలుగురకు దెలిసినచో దాని పరిణామ మెట్టిదగును? తాను సెషన్సుజడ్జి కాకినాడలో

స్థావలయునని కోరెను. తన జన్మస్థలముసే యేల యెన్నుకొనెను. ఓయి యవధానీ! నీ పుట్టినచోట నీ గొప్పతనము తెలియవలయు నని నీ గుండెలో నొక వ్యర్థగౌరవదురహంకారభావము కలిగెను. నీవు వట్టి బడాయికోరువు. న్యాయమునకు, సాధు మార్గమునకు, నీకును సంబంధము లేదు.

కాకినాడలో అప్పుడు రౌడీగా నుండెను. వాడు తానచ్చట నున్నచో తానొక యండ యని యనుకొనక పోడు. తాను ఈ రెండు సంవత్సరములు వానిని రెండు మూడు సారులు కలిసికొనెను. వాడెంత చనవుగా మాటాడెను? వానితో తనకంత చనవుండుట తన హాయాకు తగిన పని కాదు. ఒకటి రెండు సారులు వాని ప్రసంగములో నొక హద్దు తెచ్చుటకు తనకు గోర్కి కలిగెను. ఆ కోర్కి కొనసాగలేదు.

తాను పోయి మటల సీతను చూడవలయును. మటల సీతను చూడవలయును. మటల సీతను చూడవలయును. సీతను చూడవలయునన్న యీ భావము తనన్నొక దయ్యమువలె పట్టుకొనెను. సీతకు తన రహస్యము చెప్పివేసి 'సీతా! నీకును నాకును సంబంధము లేదు. నేను నీ కిట్టియాశలు

పెంచినందుకు క్షమింపుము' అని యడుగవలయును. ఇట్లు చెప్పబడిన సీత భావ మెట్లుండును? ఆమె హృదయ మన్న నందనవనములో నీ విషసర్పమును వదలిపెట్టుటెట్లు? ఈ పారిజాతసువాసనాలహరి మీద తన హేతువున విసపుగాలి రానీయ వలదు. ఆ గాలి తిరుగునప్పుడు తిరుగనిమ్ము. ఆ సువాస నాలహరి తన నాసారంధ్రములవఱకే పోడిచెను. దానిని హృదయదఘ్నముగా సాగనిమ్ము. అతని రక్తనాళములు, అతని యస్థిగతసర్వాణుమధ్య సూక్ష్మావకాశంబులు, అతని యాత్మ, యా గాలిలో ముంచి యెత్తుకొననిమ్ము. ఆ యనుభవ మెట్టిదో తన్ను తెలిసికొననిమ్ము. చిన్ననాటనుండి యొక కృత్రిమభావముననే నడచిన తన హృదయమునకు నొక్కసారి యీ యకృత్రిమభావసౌందర్యము తెలియనిమ్ము. మఱల పర్లాకిమిడికి వేసంగిసెల వులలో పోవలయును. ఇప్పుడును మేనమామ యిం టిలో సీతయే వంట చేయుచున్నదా? మఱల సీత మును పటివలె కృశించి పోయినదా? ఆమె వదనములో మరల పురాదైన్యభావమే నెలకొనినదా? గతా గతకారిమైన యుయ్యెలవలె నతని మనస్సు నిర్దిష్ట

మైన స్థలము- అనిర్దిష్టమైన ఒక చీకటికోణము- వీనినడుమ నూగుచుండెను.

ఒకనాడు అవధాని కాకినాడకు పోయెను. ఆ రాత్రి యప్ప డతనివద్దకు వచ్చెను. అతనిని చూచుటకు వీలులేదని కబురు పంపించ నెంచెను. తాను లోపలనుండి బంట్రోతుచేత నట్లు చెప్పించుటకు వీలుండెడిది. దైవవశాత్తు తానింటి ముందుండగా నప్పడే కనుపించెను. వాడు నమస్కారము చేసి, చేయనట్లుచేసి పరిచయమందహాస మాచరించెను. అవధాని మఱల తనకు తెలియకుండగనే యా మందహాసమును స్వీకరించి బదులిచ్చెను. ఏదో ప్రసంగధోరణి మొదలుపెట్టెను. బాల్యము నాటి సమాకర్షణము బలవంతమై యవధానిలో పదిసారులు చేసికొనిన నిశ్చయమును నిలబెట్టలేక పోయెను.

అప్పడు:—బాబుగారూ! మీరు వివాహము చేసికొనరా? చేసికొనకుండ నింక నెన్నాళ్లుందురు? మీ మఱదలు లలితమ్మగారిని నే నెఱుగుదును. మీ రామెను చేసికొందురటగదా! ఆమెను నే నీ యూరిలో వేయి కన్నులతో గాచుచుంటిని.

అవధాని:—నే నామెను చేసికొనను. నీవు పెండ్లి చేసికొంటివా?

అప్పుడు:—నేను ఉప్పుటేటి వంతెన యవతల నొక చిన్న యింటిలో రాము డన్నవాని గృహ మున నుంటిని. అతనికి సీత యన్న కూతురు కలదు. ఆమెను పెండ్లాడుదును.

అవధాని గుండె కలుక్కు మన్నది. వాని జీవితము, తనజీవితము, రెండు విడదీయరాని ప్రవాహములా? వానినుండి తాను ద్రెంచుకొనుట యెట్లు?

అవధాని:—ఆమె పేరు సీతయా? ఆపేరు బాగుగా లేదు.

అప్పుడు:— దాని పేరు మార్చి మీ 'యిష్టము వచ్చిన పేరు పెట్టెదను.

అవధాని:—నీవు యిన్నాళ్లు సరిగా నుంటివా? నీ యల్లరితనము, న్యాయవిరుద్ధప్రవర్తనము విశాఖపట్టణములో కూడ వింటిమి. నీ కొక వారకాంత యున్నదట. ఊరిలో నీవు చేయుచున్న ఘోరములు పట్టరాకుండ నున్నవట.

అప్పుడు:—బాబయ్యగారు! మీతో నెవరో గిట్టని వారు చెప్పిరి. నే నే స్త్రీని బలవంతము

చేయలేదు. సీతను పెండ్లియాడుటకు నిశ్చయము చేసికొంటిని. ఇదివరకు నేను న్యాయముగా నుంటినని చెప్పుటకు వీలులేదు. మీరీయూరి జడ్జిగా వత్తురని పుకారుగా నున్నది. మీరు వచ్చిన వెంటనే నేను మీ సేవకుండనుగా నుందును. ఆ బాధ్యత నాకును దెలియును. నే ననవసరమైన జోక్యములు కలిగించుకొనుటలేదు. నేను సీత నన్యాయము చేయుటలేదు. ఆమెను గాక యింకొక స్త్రీని నేను వివాహము చేసికొందునని చెప్పలేను. ఈ యూరిలోననే మా కులమువాడే రంగయ్య యని కొంత డబ్బు కలవాడు కలడు. అతడు మున్సిపల్ కౌన్సిలర్. అతని కూతురు రందకత్తె కాదు. కాని యౌవనవతి. ఆమెను పెండ్లి చేసికొమని రంగయ్య నన్నడిగెను. అతనికి వేఱే బిడ్డలు లేరు. ఆమె పేరు నళిని. ఆమెను చేసికొనినచో నాకు పదివేల రూపాయలును ఒక మేడయును వచ్చును. నే నామెను చేసికోనని చెప్పితిని. నే నాఱేండ్లనుండి రాముని యింటిలో నుంటిని.

సీతను పెండ్లిచేసికొనుట నావిధి. ఆమెను చేసికొననిచో రాముడు గుండె పగిలి చచ్చి పోవును. అప్పుడు నాకన్న దుర్మార్గు డుండడు. సీతను జేసికొన్నచో నాకు దమ్మిడీ రాదు. రాదు సరికదా, రాముడికి రెండు వంద లప్పున్నది. అదికూడ నా నెత్తినే పడును.

అవధాని:—రంగయ్య కూతురు పేరేమిటి?

అప్పడు:—నళిని.

అవధాని:— నెల్లీ, నళిని, ఈ రెండు పేరులును నొకటే విధముగ నున్నవి కదా?

అప్పడు:—నెల్లీ అను పేరుండదు. ఎల్లి యుండును.

అవధాని:—నెల్లీ యని యింగ్లీషు స్త్రీల పేర్లుండును.

అప్పడు నవ్వెను. ఆ నవ్వులో నవధాని కొక చురుకైన కత్తిపోటు తగిలెను. అప్ప డసాధ్యమైన ముండ కొడుకు. తన హృదయములో నెచ్చటనో యున్న రహస్యమును చమత్కారముగ పట్టుకొన్నాడు. అవధానికాదని చెప్పవలయునా? తన మొగములో వాని యూహకు సంబాధము లేనట్లు కనిపించు నిర్వికారత్వము తెచ్చికొనవలయునా? అతని మొగము అతని యూహానుగుణముగా నుండలేదు. అవధాని

నవ్విన నవ్వు అప్పని యూహను దృఢపఱిచెను. మరుసటి నిముసమునుండి యవధాని వానికి లోకువయ్యెను. అప్పని తాను విదలించుకొనలేదు. వారికి ఈ జన్మ సంబంధము కాదు. నళిని, నెల్లీ, సీత, సీత- యీ సామ్య మేమిటి? ఇది దైవనిర్మితమైన వ్యూహము వలె నుండెను. వ్యూహమనిన మాట సీత మొదట తనకు దెలియజేసెను. దాని యర్థము తా నాంధ్ర సంస్కృత నిఘంటువులు చూడకుండగనే తెలిసికొనెను. ఒకశబ్దార్థను వట్టి సందర్భము చేత, పరిచయము చేత నట్లు గోచరించునా? వ్యూహమన్నమాట సీత యేల వాడవలయును. ఇది వ్యూహ మని సీత కెట్లు తెలియును? నిజముగా సీతను తానొక వ్యూహములోనికి లాగుచుండెను. ఆమె నీ వ్యూహమునుండి తప్పించుటెట్లు? సీతతో పాటు తానుగూడ నీ వ్యూహములో మఱింత కట్టువడుచున్నాడు. అప్ప డీ వ్యూహమునకు రెట్టింపు బలము తెచ్చుచున్నాడు.

అవధాని:—ఒరేయి అప్పడూ! నీవింక నావద్దకు రావద్దు. నీకును నాకును సంబంధము లేదు. నీ విచ్చటనుండి వెడలిపొమ్ము.

అవధాని యొదునిముసము లాలోచించి హఠాత్తుగా నిట్లనుట వానికి నేమనవలయునో తెలియ లేదు. నవ్వుచు ననెనా? తనవలన నవధాని కేమి యిక్కట్టు వచ్చినది? తాను పూర్వ మల్లరివాడుగా నున్నచో తన ప్రవర్తన మార్చుకొనుటకు నిశ్చయించెను. మార్చుకొందు నని చెప్పెను. అతడు నవ్వి 'బాబూ! నేనేమి చేసితిని? ఎనిమిదేండ్లుగా నీమీద నాశపెట్టుకొన్నాను. నేను నీకు సేవకుడ నగుదు నని గర్వపడినాను. ఈ రెండేండ్లుగా రెండే నన్ను బ్రతుకనిచ్చుచున్న యూహాలు. ఒకటి, సీతను పెండ్లియాడుదునని. రెండు, మీా సేవకుడుగా నుందు నని. నా గుండెలో సీత నన్ను పెండ్లి చేసుకో నన్నచో నెంత దుఃఖము ప్రాప్తించునో మీారు నన్ను వద్దన్నచో నంత దుఃఖము ప్రాప్తించు' ననెను.

అవధాని కీ మాటలు గుండెలో కొట్టెను. అప్పుడు పైకి నల్లరివాడైనను, అతని శీలము నలుగురి నోళ్లలో నపవాద హేతువైనను అతనిలో నొక దివ్యమనుష్యభావ మున్నది. పరిస్థితుల చేత నత డిట్లయ్యెను గాని సరియైన పెంపకము, వెసులుబాటులు కలిగినచో నతడు తనవలె గౌరవభాజను

డమ్యెడివాడు. తనకు ధనమున్నది గనుక, తాను గౌరవకుటుంబమున జన్మించెను గనుక, తన కీ యున్నతస్థితి కలిగెను. అతనికికూడ నిట్టి పరిస్థితులు సమకూడినచో నత డేల కాఁడు? ఒక స్త్రీనిగూర్చి యంత నిర్వ్యాజముగ నూహించ గలిగినవాడు, చిన్ననాడు తానున్న యింటి పరిచారకునితనము నకు నంత వెలకట్టిడివాడు, హృదయములో దుష్టుడు కాదు-వాని దుష్టత్వము బహిఃపరిస్థితులు చేసినది. వానిని తాను సేవకుడుగా తీసికొనినచో నప్పుడు బహిఃపరిస్థితుల యందుగూడ చక్కపడును. ఇద్ద రును నొక గాలికి పుట్టిన పురుగులే. బాగుపడినచో నిద్దరు నొక గాలిపాటుననే బాగుపడవలయును.

అవధాని:—అప్పడూ! నేను నిన్నే సేవకునిగా దీసి కొందును. ఊరకే అన్నాను. భగవంతుఁడు మన యిద్దరి జీవితములు నొకపోత పోసెను. పోతలో భేదములేదు. భేదము వట్టిలోహ మునకు చెందినది. నాది బంగారు పోత కా వచ్చును. నీది యిత్తడిపోత కావచ్చును. లోకము ఇది బంగారము, ఇది యిత్తడి యనుట వారి ధనాశాబుద్ధిద్యోతకము. శిల్పి రెండు వస్తువులలోనున్న పనితనము

నకు భేదము కట్టడు. అది యథార్థమైన వెల కట్టుట. పనివానికి పనితనమునం దున్నంత యభిమానము లోహమునం దుండదు. నీ నా జీవితములలో మనకు తెలియకుండ భగ వంతుడను కంసాలి యొక పోతపోసెను. ఒక చేత చేసెను. ప్రొద్దుపోయినది. నీవింక వెడలిపొమ్ము.

అప్ప డెంత యనాగరకుడైనను, ఎంత యవిద్యా వంతుడైనను నవధాని యేదో మనసులో గగ్గోలు పడుచున్నట్లు తెలిసికొనెను. అతడు చూచా యగా కొంత గ్రహించితి ననుకొనెను గాని అసలు నిజ మాతు పట్టలేదు. తా నవధానితో నెంత చన వుగా మాటాడుచున్నను నిద్దరి మధ్య దొర సేవకుల భావము నిలచియుండెను. అతడు ఐ. సి. యస్. అగుట, తాను సామాన్యుడగుట- యీ భేదము నిల చియే యుండెను. తన పరిచయము ఎనిమిదేండ్ల నాటిది. పరిపాకము పొందని మనస్సులనాటిది. అప్పటికి నిద్దరును చిన్నవాండ్రే. నిజమైన జీవితము ఈ యెనిమిదేండ్లదే. నిజముగా తమ చిన్ననాటి కలయిక కలయికయే కాదు. ఆ చనవు చనవే కాదు. అది చనవుగా నవధాని పరిగణిం

చుట యవధాని యౌదార్యము. అందుచేత నతడు వినయముతో 'బాబయ్యగారూ! సెలవు తీసికొండు' నని వెడలిపోయెను.

అతడు పోయిన తరువాత నవధాని అంతకు పూర్వము తన్ను గూర్చి తా నూహించనంత లోతుగ, తన మనస్సును తానే వంచించుకొనకుండ నాలోచింప నారంభించెను. 'ఇంగ్లండులో తాను నెల్లీని వివాహమాడెను. నెల్లీ యొక సామాన్యస్త్రీ. తా నొకరాత్రి యొక తక్కువరకపు హోటలులో నృత్యమునకు పోయెను. ఆ హోటలులోని నృత్య గీతములు, మనుజుల ప్రవర్తనలు, మిక్కిలి యసభ్యములుగా, కామోద్రేకహేతువులుగా నుండునని తెలిసియే పోయెను. అందు జరిగిన సంగతులు గూడ నట్లే యుండెను. అవధాని తా నప్పుడు ప్రథమ వయోదోషావిర్భావసమయములో నుండుటయు, భోగాముల వివక్ష తెలియని చిన్నతన మగుటవలనను, క్రొత్తలో లండను విశ్వవిద్యాలయపు ఎం. ఏ. పరీక్ష నిచ్చియుండుటయు, సర్వము నుత్సాహ పూరితముగా నుండుటయు, నింటికడనుంచి వచ్చు ధనమునకు లోపము లేకుండుటయు, అతని డబ్బు సమృద్ధిగా వాడుకొనుచు తమ కోరికలు, తమ

యుత్సాహములు తీర్చుకొనుటకు అతని నెక్క
వేయు స్నేహితుల ప్రోత్సాహదోషమువలనను
ఆ హోటలునకే ఒకటి పదిసారులు పోయెను.
మొదటిసారియే నెల్లీని కొంద రితనికి సమాగమ
పఱచిరి. అతఃపూర్వము స్త్రీ నెరుగని యతనికి నా
క్రొత్త యనుభవము విచారించుటకు నెడ మీయని
యొకమమతలో తగుల్కొల్పెను. పది విషయ
ములు తెలిసియున్న తరువాత పోల్చిచూచి భిన్న
వస్తుస్వరూపజ్ఞానము కలుగును గాని తెలిసి
నదియే ఒకటైనచో, దానియందే సర్వోత్కృష్టతా
భావము కలిగియుండుట బహుమానవులకు జీవి
తములలో సంభవించు నొక దురదృష్టము. అత డట్టి
స్థితిలో నుండెను. నెల్లీని కలిసికొనుటయు నామెను
వివాహమాడుటయు నొక్క నెలదినములలో జరి
గెను. వివాహమైన తరువాత మూడు గంటలలో
నతనికి తాను చేసిన దోషము తెలిసెను. తెలిసి
యేమి లాభము? అయినను ఆ తెలియుట యేమి
తెలియుట? దీనివలన బహిఃపరిస్థితులలో తా నను
కోని క్రొత్త కలతలు కలుగుననియే తెలిసెనుగాని
యీ వివాహము తన యాత్మకే, తన రుచికే, తన
స్వరూపమునకే అంత వ్యతిరేక విషయమని యతని

కప్పుడే తెలియలేదు. ఒక యేడాది గడచిన తరువాత అతనిలో నున్న భారతదేశపూరుషభావము నెల్లీలో నున్న పాశ్చాత్యదేశస్త్రీభావముతో సమసించదని తెలిసికొనెను. నెల్లీ పాశ్చాత్యులలో నధమజాతిస్త్రీ. పేరునకు ప్రజాస్వామిక దేశము. పేరునకు సర్వమానవసామాన్యమును బోధించు దేశము. అచ్చటి విభేదములు క్రమక్రమముగా తెలిసిన తరువాత తల తిరిగి ముద్దనోటిలోనికి వచ్చెను. అదివఱ కతనితో మాటాడు నుత్తమకుటుంబములకు చెందిన హూణదేశీయులైన స్నేహితులు అతనితో మాటాడుట మానివేసిరి. కొందరతనిని జూచి నవ్వుకొనుచుండిరి. కొందరి ప్రసంగమునుండి యతడు భారతదేశములో నీచకుటుంబములకు చెందినవాడని తన్ను గూర్చి యనుకొనుచున్న ట్లతడు గ్రహించెను. అతడును నెల్లియు కలిసి యొక హోటలులో వేఱే కాపురము పెట్టిరి. నెల్లీ తనమాట వినలేదు. ఆమె పూర్వపు పోకిళ్లు మానలేదు. చిన్న చిన్న భేదాభిప్రాయములు లక్షలు కలిగెను. తాను తిరిగి భారతదేశమునకు రాకముందు సంవత్సరము వారిరువురు నొకరితో నొకరు సంబంధము లేకుండగనే యుండిరి. కాని జరిగిన వివాహము జరిగినట్లే

యుండెను. అతడు విడాకులకై ప్రయత్నించెను. ఆమె యొప్పుకొనలేదు. అతడు పదివేలిత్తు ననెను. హిందూదేశములో నతని యాస్తిపాస్తుల లోతు పాతులు తెలియకుండ నే మొత్తమునకు నంగీకరింప రాదని యామె స్నేహితు లామెకు జెప్పిరి. మఱల వారిద్దరు కలసికొనలేదు. అతడు తిరిగి యీదేశమునకు వచ్చునపు డామె ఒక యుత్తరము వ్రాసెను. రెండేండ్లు పోయినతరువాత నామె భారతదేశము వత్తునని. ఆ యుత్తరము జేబులో పెట్టుకొని తాను వచ్చెను. రెండేండ్లు పూర్తి కావచ్చుచున్నవి. ఈ లోపుగా తాను తన మనస్సులో చేసికొన్న నిశ్చయమున కనుగుణముగా ప్రవర్తింపలేకపోయెను. ఈ రొంపిలో సీతను దింపెను. అతని నిశ్చయము సర్వస్త్రీ విషయమున చేసికొన్న నెట్లుండెడిదో? అప్పటి కతని మనస్సులో నున్నది లలిత యొక్కతెయే. ఆ లలిత విషయములో తన నిశ్చయమును చక్కగా నెగ్గించుకొనెను. ఏమి లాభము? ఒక తీగ తొలగించుకొని పది తీగలు తగిలించుకొనెను. అతడు శారద విషయమున నొక ధైర్యముతో ప్రవర్తించెను. ఆమెది చిలుప ప్రకృతి యనుకొనెను. ఆమెతో సంబంధము పెట్టుకొన్నచో నది వట్టి

సంబంధముగానే యుండునని తలంచి తొలుత నామెతో నట్లు ప్రవర్తించెను. శారద తనకన్న పది యాకు లెక్కువ చదివినది. ఉండి యుండి సీతను తా నింతదూరము తరలించుకొని వచ్చెను. సీతయుండిన స్థితివలన కలిగిన జాలి యతని ప్రకృతిలో నున్న వివేకమునకు దోహదప్రాయ మయ్యెను. ఒక సారి తలంచినచో తాను సీతకు ఉపకారము చేసెను, తప్పేమి యనిపించును. మరియొకసారి యాలోచించి నచో ఆమె కడియాసలు పెంచి యామె నన్యా యము చేసితి ననిపించును.

అంతకన్న తన్నుగూర్చి తానూహించుకొన్నచో సీతకు తాను చేసిన యన్యాయముకన్న సీతను పెండ్లి యాడనిచో తన ప్రేమలోకము నిప్పంటు కొని మాడిపోవుచున్నట్లు కన్పించుచుండెను. సీతను గూర్చిన యతని భావమే ద్విధాప్రోతస్వినిగా కని పించుచుండెను. మనోదఘ్నమైన పరోవాహాలు సీతను తాను వదలగలిగినట్లు స్ఫురించును. ఇంక దూరము రాకుమని యాపగలిగినట్లు భావించును. వెంటనే యెచ్చటనో హృదయాంతరమున "సీతను నీవు వదలలేవు. నీవెఱిగిన స్త్రీలందఱిలో సీత శిరోమణి. ఆమెను కాదన్నచో నీ హృదయము

నకు నీవే నిప్పుపెట్టుకొందువు. నీకున్నయాస్తి యంతయు పోనిమ్ము! నీయుద్యోగమైనను పోనిమ్ము! సీతను వదలిపెట్టజాలవు అని చెప్పుచుండెను. కన్ను మూసినచో, కన్ను తెఱచినచో, వా త్రేరు ప్లాట్‌ఫార ముమీది సీతాదీనాపాంగమధురరోచిస్సు అప్సర స్త్రీర్థమువలె గనుపించుచుండెను.

అవధానికి ఆరాత్రి నిద్దుర పట్టువఱకు రెండుగం టలు దాటెను. మూడవగంట వినపడీ వినపడనట్లు వినిపించెను. స్వప్నమో, జాగ్రదవస్థయో, ఆ ధ్వనిలో కొన్నిచిత్రములు మూసికొన్న కన్నులకు కనిపించెను. వినుచున్న చెవి, నిమీలితములైన చర్మ చక్షుస్సులతో నింద్రియత్వస్థితియందు సామ్యము పొందెను గాబోలు. వాని యేకత్వస్థితి జాగ్రదవ స్థేతర విషయము. జాగ్రదస్థలో నేయింద్రియ మా యింద్రియముగా కనిపించును. నిద్రావస్థ సర్వేంద్రి యములను చిచ్చికొట్టి నిద్రపోగొట్టును. స్వప్నా వస్థ యీ రెంటికిని నడుమ లంకె. ఆ యవస్థలో నింద్రియములు శరీరసన్నివిష్టములై మేల్కొని యుండవు. కాని బీజభూతములుగ మేల్కొని యుండును - అప్పుడు మేల్కొనియుండున దొక్క మనస్సే. సర్వేంద్రియములు మనోలగ్నములగుట

చేత వాని వైదింటినిబీజభూతములుగా లగ్నమైన యింద్రియములను—భావభూతములుగ మేల్కొల్పి నడిపించును కాబోలును. ఆ గడియారము తన తండ్రి చిన్ననాటిది. ఎనిమిదేండ్లు పూజా పురస్కారములు లేకున్నను తిరుగుచునే యుండెను. ఏడేండ్లకు నిద్రపోయెను. తండ్రి యేదూరు చేసినప్పుడు తానచట నున్న పదుమూడు దినములు దానికి 'కీ' యిచ్చెను. అది మరల తిరిగెను. ఈ రెండేండ్లు తానప్పుడప్పుడు వచ్చినప్పుడు మాత్రమే యది యాడును. లోని సరంజాము త్రుప్పైన పట్టదా? దానికి తైలసంస్కారము చేసిన పాపమున నెవ్వడును నెన్నడును పోలేదు. క్రొత్త గడియారము లంత నిశ్చలముగా నుండవు. ఇది ప్రాత గడియారము. ప్రాతవస్తువులకు చాంచల్యము లేదు. చెడిపోవుట లేదు. ఆ గడియారము గంటలు కొట్టుచుండ సీత మాటాడుచున్నట్లతని స్వప్నములో తోచెను. సీత మాటాడుచున్నదా? సంగీతము తీయుచున్నదా? సీత స్థిరమైన వస్తువు. చాంచల్యములేని వస్తువు. తన చేతి గడియారము రెండువందలు పెట్టికొనెను. దాని కైదేండ్లలో మూడుసార్లు మరమ్మత్తు తగిలెను. సీత భారతదేశాత్మ. తన పెద్దమామ సీతకు, సీత

యని పేరెందుకు పెట్టెనో? ఒక్కొకరి పేరు, వారి గుణములు నంత చక్కగా నెట్లు శ్రుతి కలసి యుండునో? తాను సీతకు తగినవాడు కాదు. సీతకు తగుటయేమి? తగినవాడు కాకపోవుటయేమి? భర్తయగుట చాలును. వాడెవడైన నేమి? భర్తృప్రతిశబ్దములో భర్తృగుణగణ వర్ణనము లేదు. భర్తనిర్ణయము లేదు. అంతట నిద్ర.

## సెల

### ౧

మఱల వసంతకాలము వచ్చెను. కోకిల కుహూకుహూనినాదదంతురిత మధురిత దిశాకామినీ కర్ణశష్కులికావివరగత మర్దళసూక్ష్మస్వనశక్తి యాకాశమునందు క్రొత్తశబ్దము సృష్టించుకొనెను. పూవుల నితాంతానంతవసంతవేళావికసనశక్తి పునర్జీవితమైనట్లు ప్రకాశించెను. మధుమాసపు భిన్నస్థలములు భిన్నానందములను గోచరింపచేసెను. మధువేళాసమస్తశోభాతాడితమై మావివృక్ష మొక్కడు తానుండిన నేలబలముచే, తన చిన్ననాడు జరిగిన పోషణశక్తిచే, తన జీవితములో విపరీత వాయువులు పోకమిచే, ఏవేళ కావేళ ననువైన శీతోష్ణపరిస్థితులు

సమకూడుటచే, నది పూచినపూత, వేసిన పిందె, దాని చుట్టుమూగిన రోలంబమాలానికురుంబములు, చివుళ్లయందలి పేరాసమూగిన వీణాక్వణన నిస్వన మాధుర్యసబ్రహ్మచారికంఠబలనినాదపరిదీప్తసంగీత పాండిత్యరేఖాధురంధరములైన కోకిలల మూగుటల చేత, పంచభూతసంబంధిప్రపంచమున నవధి మేర కానంద మెంత నిట్టపొడుచునో అంత నిట్టపొడిచెను. చెరుకుపూవుమీద వ్రాలిన తక్కువజాతి సీతాకోక చిలుక; రెక్కలు కలుగుట మాత్ర పుష్పంధయజాతి సామ్యముగలిగిన పెఱపురుగు; తదానందముయొక్క- పరమాధమనీచరేఖాస్పృష్ట మయ్యెను. ప్రియా వియోగసంజనితతాపకలుషితబుద్ధియైన మగలేడి తన జాతిని వదలి విజాత్యల్పస్త్రీవిషయమున వాంఛా సక్తమై పరిహాసాస్పద మయ్యెను. ఒక తేటిగూటి నుండి విడివడి తనకు విహితమైన పుష్పాసవమునందు విప్లవభావమున భిన్నజంతుక్షీరములయందలి యాశఁ దగిలి పరువెత్తిన యొక భ్రమరకిశోరము పరస్థల సమాత్త మధుక్షీరపానరుచికి, నతని యాత్మయందలి నిగూఢస్వజన్మపరిపాకశక్తికి, వెగటై పునఃపుష్ప కామినీసమాగమవాంఛావిరుద్ధబుద్ధి యయ్యెను. శిశి రము దాటినతరువాతగూడ వికసనవాంఛ పరిత్య

జించుకోలేని చేమంతిపూవు తుది సన్నని రేకలు జన్మలోనే పసివాసిన వడిలు తెలుపుచేత వివర్ణములై నడిమి పచ్చని రేకల దుమ్మునూడ బొడ్డువలె పొడుచు కొని వచ్చి నేత్రానందముకన్న నేత్రరోగము సృజించెను. పూర్వ మేనాడో యొడ్డులువిరిసి యతార్యము లైన వనని ర్ఝరిణి నీరుదీసి శిశిర హేమంతముల నొడ్డుల యందు వ్యాపించిన పంకము నింకించుకొని కొబ్బరి నీటి పాయవలె, శివజటానిస్సృతభాగీరథీప్రథమ ధారవలె, మొయిళ్ళచే గొసస లదిమిన పాలత్రోవ వలె, తెల్లనివియు, సన్ననివియు, దళసరితనము లేనివియు, మల్లెపూరేకులవలె తెల్లని కాంతికలవి మాత్రమే కాక, విరళితాణుశక్తి కలవై తదంత రాణువులు ద్వ్యణుక, త్ర్యణుకభావమే సమా పన్నము కాని ప్రథమాణుస్వరూపసూచియైన మార్ద వముతో ప్రకాశించు నీటితో కలిగించిన యానం దము పరమోత్తమము కాదు, అధమము కాదు, ఉత్తమము కాదనుటకు కాదు, నిజమునకు నుత్త మాధమానంద భేదాతీతమైన యొకస్థితిని పొందెను.

అవధాని తక్కిన సర్వవిషయములను విస్మరించెను. ఏది యెట్లైనను సరే యన్న యొక తీవ్రసాహా సము పొందెను. సీతా వియోగము తా ననుభవించ

లేదు. సీతను వెంటనే వివాహమాడలేదు. తనకున్న యీ యధికారము లేనిచో నింతకన్న స్వేచ్ఛావృత్తి యుండెడిది. తన స్థితి తోడిమానవుల యభిప్రాయములకు జవాబుదారీలేని యాగమ్మకాకితనము కాదు. సీత యతని గుండెనుబట్టి పాలార్చెను. తానింక నాలస్యము చేసినచో సీతకూడ లలితవలె నిరాశ చేసికొని విముఖురా లగునేమో? లలిత విముఖురాలగుట తానిష్టపడి తాను దోహదము చేసిన కార్యము. సీత యట్లగుట తాను వాంఛించడు. లలితయైనంత తేలికగా సీత విముఖురాలు కాదనికూడ నతడు విశ్వసించెను. ఆ యింటిలో సీత మఱల బాధపడుచుండెనేమో యన్న యుద్దేశము అతనికి చాల బాధ కల్పించెను. తన ప్రియురాలు, తనభార్య, యట్టిస్థితిలో నుండగా, తా నామెను గూర్చి యూరకే యగాధప్రేమభావనలు చేయుటయే కాని, తానుపోయి యచ్చటి పరిస్థితులు చూచి కష్టము లున్నచో నపనయించుటకు ప్రయత్నమైనను చేయలేదు. ఇప్పుడు నవధాని కొక్కటే యూహ. తాను పోయి సీతను చూడవలయును. ఆమెతో తా నామెను వివాహమాడుదు నని చెప్పవలయును. అతని కొక యనుమానము కలిగెను. ఆమెయు

తాను నొక్కటి యగువఱకు నతని మనస్సు ఆగదు. మనుష్యు డెంత మనోభావమున కధీనుడైనను, శరీరమునకు దాని బలము దానికే యున్నది. శరీరగత దోషము లసభ్యములు. మనోగత భావములు దోషభూయిష్ఠము లయ్యేనేని ముక్తములై యసభ్యములుగా భాసించవు. ఒకని పాపపు భావములు వంద చెప్పుము. శ్రోత మనసా ఏవగించుకొనును. జాలిపడును. శరీరముచేత చేసినదోషము శరీరబలముచేత శ్రవ్యమే కా దనిపించును. మఱియు కావ్యము నందది యనౌచిత్య మనిపించును. ఐనను నవధానికి సీతయందు కలిగిన యీ విపరీతప్రేమ భావము సంపూర్ణముగా మనస్సుదే యైనను శరీరములో దానికి కొంతభాగము లేకపోలేదు. స్త్రీసుఖము సర్వముగ మనోవిషయమే యని ప్రేమ సిద్ధాంత మెంత ఘోషించినను, ఆ మానసిక సుఖము శరీరగతేంద్రియవాంఛాతర్పణమువలన మనస్సునకు కలుగు నుత్కృష్టస్థితి గాని, భగవంతునియందలి భక్తివలె నపేతశరీరసంసర్గవిషయము కాదు. ఈ ప్రేమ అట్టిదియు నగునేని తత్ప్రేమవిషయము స్త్రీ కానక్కర లేదు. ప్రథమదశయం దది స్త్రీ, ఉత్తరదశలందు నది స్త్రీభావ విరహితము నని నచో ప్రథమ

దశయందు స్త్రీసంబంధిభావము లేదనుటకు వీలు లేదు. అప్పుడు శరీరబలము నొప్పుకొనుట యగును. అవధానికి నీ ప్రసక్త ప్రదేశములందు వ్యర్థ వేదాంతములు తడవుట చేతగాదు. అతడు సంపూర్ణముగా శరీరముయొక్క సుఖాసుఖములు పరిగణించువాడు. లౌకికమైన సుఖాసుఖములకు శరీరాతీతవ్యర్థ వేదాంత వాదములకు ముడివెట్టడు. తాను స్త్రీవిరహితుడై యింక బ్రదుకలేడు. అందుచేత నసాధుస్త్రీసంసర్గ దోష మాచరించలేదు. తాను మనసా వరించిన, తనయాత్మ కోరుచున్నదేమో యన్న స్త్రీనుండి దూరముగా నుండను లేదు.

అతడు పర్లాకిమిడి బయలుదేరెను. పర్లాకిమిడిలో సీత మదరాసునుండి తిరిగి వచ్చిననాటికి కొన్ని మార్పులు జరిగెను. లలిత కాకినాడకు చదువబోవుటతో లలిత గది యూరకే యుండెను. సీత మొదట రెండు మూడునాళ్లు పూర్వమువలె చావడిలోనే నిద్రించుట, యచ్చటనే చదువుకొనుట చేసినది. పినతండ్రి సీతను లలితగదిలో చదువుకొమ్మనెను. సీత తాను వచ్చిననాడే వంటచేయుటకు మడికట్ట బోయెను. శారద యామెను బలవంతముగా వారించి తాను మడిగట్టుకొనెను. శారదకు వంటచేతకాదు.

తల్లి యీ పరిస్థితి చూచి, తిరిగివచ్చిన తరువాత సీతా శారదల యన్యోన్యభావము చూచి, సీత నింక నేమియు ననరాదని నిశ్చయించుకొనెను. సీత మెడలో బంగారపు గొలుసు, చేతులకు క్రొత్త గాజులు, ఆమె పెట్టెనిండ చీరలు, నవధాని సీతయెడల చూపించిన యౌదార్యమునందు కలిగిన ప్రేమశం కను దృఢపఱచెను. శాంతావివేకానందులకు మన స్సులో కష్టముకలిగెను. కాని శారదనవ్వుచు ప్రేలుచు నుండుట యీ కష్టమును తృణీకరించిన ట్లుండెను. శారద వివేకముపై నామె తల్లిదండ్రులకు మంచి గౌరవము కలదు. ఆస్థితికి శారద యొప్పుకొన్నచో తాము వ్యతిరేకించవలసిన వీలుండదు. ఆమె మాటాడకుండ తల్లిదండ్రులను శాసించును. ఆమె యొకనాడన్నది. 'నేనుగాని లలితగాని వెంటనే వివా హము చేసికొనినచో మా చదువు భంగమగు'నని. అదిచాలును. తల్లిదండ్రుల మనస్సులో సమన్వయము కలిగెను. వివేకానందునకు నీ సంవత్సరము జీత మిరు వది రూపాయల నెక్కువచేసిరి. తోబుట్టువువ్యాధి వృద్ధిపొందుటవలన నామె వంటయింటి మొగమైన చూచుటలేదు. సీత మడిగట్టినచో శారద యంతకు ముందే తయారగును. శాంత పెండ్లినాటినుండియు

వంటమొగము నెరుగనిదియు, సుఖముగా కాలము గడపునదియు నగుటచేత, నామె వంటచేయు ప్రస్తావన లేకపోయినది. అందుచే నతడు నెలకు పదిరూకలిచ్చి యొకవంటమనిషిని పెట్టెను. సీత తిరిగివచ్చిన తరువాత వివేకానందునకు నామె భారము తనమీదినుండి పోయినట్లుండెను. ఆమెకు తానీయవలసిన నాలుగు వేలును నీయనక్కరలే దనిపించెను. లలిత నీయవలయు ననుకొన్న యవధానిని సీతను పెండ్లియాడ నిచ్చినచో నా నాల్గువే లిచ్చినట్లే యగునని మనస్సమాధానపడెను. మనస్సులో నంతరాంతరముల జరుగు విశ్వాసములకు భిన్నవిషయములకు ముడిపెట్టుకొనుట వాని కదియే తెలియును. సీత యా యింటిలో సుఖముగా నుండెను. క్రమముగా తొల్లింటి చనవుకన్న నెక్కువ చనవువచ్చెను. లలిత యింటిలో లేకపోవుట పినతల్లి పినతండ్రులకు నామె యందుకూడ ప్రేమ చూపింపనిచ్చెను. సీతకు జీతమనిగాని, చీర యనిగాని వివేకానందున కిబ్బంది లేకపోయెను. అందుచే సీత మదరాసునుండి వచ్చిన యుత్సాహము, కవళిక కొలతపెట్టుకొనలేదు. ఆమె మనస్సులో నొక్కటియే యూహ. బావ రాలేదేమి? రాడా? తన యుత్తరమునకు సమాధానము

వ్రాయడేమి? తా నతనియం దెట్లున్నదో యతడు తనయం దట్లులేడా? సీత మనస్సులో విమల యకారణముగా చూపించిన ప్రేమకుగూడ నవధాని సంబంధము కల్పించుకొనెను. విమలకు నవధాని తన్ను ప్రేమించుచున్నాడని తెలియనిచో ఊరకే తనకంత డబ్బేల యిచ్చును. అవధానికి విమల చెల్లెలువలె లేదు.అప్పగారో,తల్లియో యన్నట్లుండెను.అవధాని యామెకు వ్రాసినయుత్తరములు సీత చూచెను. ఆమె దేవతయట. ఆమె కంటికొసల మెఱుపు తనకు వధ్యశిలయట. ఆమె ప్రసన్నమందహాసము తనకు దేవతాలోకవీధివిహారమట. చెల్లెలిని అంత ప్రేమగా చూచువాడు, అంత గౌరవముగా చూచువాడు మనుష్యమాత్రుడు కాదనిపించెను. ఒక దేవతా పురుషుడు శాపవశమున భూలోకమున జన్మించి యవధానిగా నయ్యెను. అతనితో తనకు గలిగిన భవిష్యద్విజృంభణాశలు కలిగిన ప్రస్తుత సామాన్య ప్రేమభావము తన యదృష్టముచేత కలిగినది. పదునేడేండ్ల తరువాత తన జీవిత మొక యనూహిత స్వర్గసోపానమార్గము పట్టుచున్నది. ఆ యేడాది యంతయు సీత చదువనే లేదు. పరీక్షలముందు కూడ నేమో చదివినది. పుస్తకము తెఱచినంతనే బావ

యూహాలే యామె మనస్సునకు వచ్చుచుండెను. అంతటి సౌశీల్యవతికిగూడ బావతో సంబంధించిన కామభావము లుదయించును. ఆమె యొక విరహా వస్థలో నుండెను. ఆ లక్షణములు ఆమె తనలో తాను చూచుకొని సిగ్గుపడును. ఆనంద మందును. ఆమెకు దానితో తనశరీరమందలి యభిమానము వృద్ధిపొందెను. తాను బావ వచ్చునాటికి చిక్కి యున్నచో నత డేమి యనుకొనునో? అతడు తన శరీరము పరిపుష్టమై స్పృహణీయముగా నుండవలె నని వాంఛించడా? ఆ శరీరమున కెచ్చటలేని పోష ణము చేయు చుండెను. తన జీతము నెల కైదుంబా వలా యయ్యును విమల నెలకు పదిరూపాయలు పం పించెను. మిగిలినడబ్బు ఆమె శరీరపోషణ సాధన ములకు కొల్లకొల్లలుగా సరిపోవుచుండెను. అవధాని యచ్చట బయలుదేరుటయే యిచ్చటకు వచ్చెను. అతడు వాకిట దిగిన వేళకు సీత పరుగెత్తుకొని లోనుండి వచ్చెను. సంవత్సరము సంవత్సరము వాకిటిలో బండిమోతకు మోటారుధ్వనికి చూచు టకు విసుగులేని సీత వచ్చినదనుటలో నాశ్చర్యము లేదు. అవధాని కనుపడినంతనే స్వాతిజల్లునకు నోరు తెరచి యెదురుచూచు బలాక మొగమువలె నామె

మొగము స్వర్గలోకములో నందనవనసమీపమున మందాకిని పట్టిన పడియవలె, వికసించిన వేయి బంగరు తమ్మిపూవులతో ప్రకాశించెను. అవధాని మొగము ఆమెను చూచినతోడనే తామరపూవు మొగముమీదికి ప్రసరింపచేయు వేయికిరణముల తోడి బాలసూర్యబింబమువలె నుండెను. అతని మొగములో వికాసమును రక్తిమయు తోచెను. అంతటి యతని యుత్సాహమునకు తెలియకుండ నేదో యొక దోషభావము వాని మొగమునందు జేవురు రంగునుగూడ కల్పించెను. ఆమె మొగము చూచినందువలన కలిగిన యానందోద్వేగములు, తాను సీతను ఒక వ్యూహములోనికి మఱింత సమాకర్షించుటకు వచ్చితి నన్న విషాదోద్వేగము-రెండును గలసి యేర్పరింప రాక పెనగొని కలసిపోయెను. తత్కాల ప్రణయజనితమహావాంఛాసమాలిప్తుడైన యతని కా రెండుద్వేగముల విడబఱచుకొనుట చేత కాలేదు. సీత వచ్చి తన మెడకు చేతులు తగిలించి తన రెండుకపోలముల ముద్దిడుననుకొనెను. తమ రెండు వక్షఃస్థలముల నిరంతరసామీప్యసంజనిత నిరవధికానంద మనుభవింత మనుకొనెను. కాని సీత మొగములో తోచిన యంతటి వెన్నెలయు, నంతటి

మందాకినీసరోధాళధళ్యమును నొకచిత్రమైన లజ్జా రుణాంధకారతరంగమున కొడ్డిగిల్లి నిలచిపోయెను. తెల్లవారువఱకు రేకల చివళ్లుకూడ వెనుకకు తిరిగి పోగా వికసించిన మల్లెరేకలవలెనున్న యామెకంటి కాంతులు సిగ్గుచే వ్రాలిపోయెను. పెదవిమీది చిఱునవ్వు బాగుగా వంగిన కనురెప్పలమీది లజ్జ యవధాని ప్రాణమునకు నెండయు వానయు నొక్క సారి వచ్చినట్లుండెను. ఆమె లోనికి పరుగెత్తి శార దతో బావ వచ్చినాడనెను. ఇంటిలో నందరు ముంగి టకు వచ్చి నిలబడిరి. అందరితో మాటాడుటలో నవధాని సీతను గుఱించిన తన యూహాప్రచారము సడలించుకొనవలసి వచ్చెను. వెంటనే స్నానము, భోజనము, మేనమామయు, అతని భార్యయు, అమ్మమ్మయు, పెదతల్లియు త్రవ్వి త్రవ్వి యెచ్చ టెచ్చటివో కబురులనుగూర్చి వేయు ప్రశ్నలకు నొసంగెడు ప్రతిసమాధానము నడుమ, సీత మాట చేయుటలేదు, సీత భోజనమునకు రాలేదేమి? సీత కంత సిగ్గెందులకు? సీత అంత అందముగా నున్న దేమి? మొదలగు నూహాలే బలిసిపోవుచుండెను. ఆ యూహాలవలన వారడిగిన నాల్గుప్రశ్నల కొక సమాధానము, ప్రతిప్రశ్నయు రెండుమూడుసార్లు

అడుగవలసి వచ్చుట, ప్రశ్నవచ్చిన తరువాత నిమే షము గడచిన తరువాత సమాధానము వచ్చుట, అడిగిన ప్రశ్నలలో శారదనుండి వచ్చిన ప్రశ్న వెం టనే సమాధాన మీయదుట, అతని మనస్సులోని యూహ తెలియని మామయు నత్తయు, ముస లమ్మయు ప్రయాణపు బడలిక యనుకొనిరి. ముస లమ్మ 'వాడు మోటారు దిగెనో లేదో, ఒక్కటే ప్రశ్నలాయెను. సరిగా బిడ్డ నన్నము తిననిం'డనెను. శారద నవ్వుచు 'బావ కాకలిగాలేదు. ప్రశ్నలకు సమాధానము చెప్పవచ్చు'నని యతనివంక నోరగా చూచెను. అవధాని కా చూపు వెనుక సీతయొక్క పరిణతమైన సర్వప్రేమయు గోచరించెను. సీతా శారదలకు తన ప్రేమభావమున నవినాభావసం బంధము. సీత రత్నము, జవ్వాది, పునుగు, కస్తూరి. ఆ సంభారములు మోసికొనివచ్చు నొంటె శారద. వ్రాలుచున్న క్రీ బెదవితో, గోపురము వలె గట్టిన మూపురముతో నొంటె సామాన్యమానవునకు వికారమైన జంతువుగా కనిపించవచ్చును. తన పట్టాభిషేకమునకో, తన యింటిలోని వివాహ మహోత్సవమునకో యీ సంభారములు తెచ్చెను. తెచ్చి ముంగిట నిలచి యా సంభారములు దింపు

కొనుటకు సిద్ధముగానున్న యొంటె యొక్క మహా రాజు నూహాలో నెట్లుండును? రాత్రి కుత్సవము. ఆ సంభారము లేపూటపడిన నాపూట వచ్చునని దిన దిన మెదురుచూచినది. చివరకు చివరి గడియలో సమస్తప్రాప్తమైన యీ సంభారములకు, నా యొంటెకు భేదమేమున్నది? ఆ నిమేషములో నా యొంటె రత్నాల రాశి, పునుగుకుప్ప. అవధానికి ఆకలి యెంత యయ్యెనో, తానెంత భోజనము చేసెనో, తెలియదు. తాంబూలము సేవించుటయే గాని సేవించు టెరుగడు. సీత కనుపించదేమి? ఇది యేమి పిల్లరా? సంఘసంస్కర్తల యింట పెరిగినది. పదునేడేండ్లు వచ్చినవి. ఇంగ్లీషు చదివినది. ఈ ముద్దరాలితనము, యింత సిగ్గు విచిత్రముగా నున్నవి. భోజనము చేసినతరువాత నతడు విశ్రమించుటకు ప్రక్క వేయబడెను. అతడు పండుకొనెను. నిద్రపట్టదు. కడచిన మూడు నెలలుగా, సీతావిషయమున తాను పొందిన యుద్వేగము నంతయు కలిపినచో తా నిప్పుడు పొందుచున్న ప్రతి విలిప్తయందలి యుద్వేగము నను దానికి రెండు రెట్లు మూడు రెట్లుగా నుండెను. సావడిలో నెవరు లేకుండుటచూచి రెండు గదుల తలుపులు తెఱచిచూచెను. ఒకదానిలో శారద

నిద్రపోవుచుండెను. రెండవగదిలో వట్టి పుస్తకము లుండెను. సీత లేదు. పడమటింటిలో నున్నదేమో నని మంచితీర్థ మడుగుటకుఁబోలె పోయెను. అచ్చ టను లేదు. సీత యేమయ్యెను? దొడ్డిలోనికి పోయి చూచెను. దొడ్డిలో నొక మామిడిచెట్టుండెను. సీత ఆ చెట్టుక్రింద కూర్చుండెను. తనవైపునకు వీపుపెట్టి రెండు చేతులతో నేదో చేయుచున్నట్లుం డెను. తాను వచ్చినపుడు సీతకు జడలేదు. ఇప్పు డామెకు జడ యుండెను. ఆ జడ మెడనుండి నేల వఱకు వ్యాపించి నేలపై కొంతభాగము వ్రేలాడు చుండెను. అదియొక నిచ్చెన. తానా నిచ్చెనపై నుండి యెక్కి ఆమె మనఃపీఠ మలంకరింప వలయు ననుకొనెను. ఆ మనఃపీఠమున నదివరకే బంగరు కోళ్ళతో రత్నాల స్తంభములతో కట్టిన మందిర ములో పూవులతో మలచిన ఒక చిన్ని దేవతా విగ్రహముగ తా నధిష్ఠించియుండె నని తన కేమి తెలి యును? అతనికి స్త్రీని చూచినప్పుడు ఆమెను వశము చేసికొనవలె నను భావము కలిగినప్పుడు అతని గుండెలో నారాటము పడినది లేదు. భయపడినది లేదు. అతనికి ననేకు లగు స్త్రీలు సులభులవలె కనిపించిరి. అత డేవైపునకు మొగ్గలేదు. శారద

యందున్న యొక మేధాశక్తి యామెను తనవైపునకు లాగెను. ఆమె నిరాకరించినట్లు కనబడెను. అప్పుడు గాని యిప్పుడుగాని అతనిగుండె కొట్టుకొనినది లేదు. అంతటి నూతన వయః ప్రాదుర్భావ సమయమున నెల్లీ తోడి ప్రథమ సంసర్గవేళయందుగాని, ప్రథమసమాగమ సమయమునందుగాని అతనిగుండె కొట్టుకొనలేదు. ఆవైపునకు తిరిగియున్న సీతను చూచినంతనే అతనిగుండె కొట్టుకొనెను. కాళ్లు ఆగలేదు. చేతిప్రేళ్లు కదలుచున్నట్లు కనుపించెను. ఒడలంతయు చెమటపోసెను. ఈ యుద్వేగమంతయు నొకటిరెండు నిముసములలో తగ్గెను. అతని యూహా స్తంభించిపోయెను. వెనుతిరిగి పోవుటకు, ముందు నడచుటకు మనస్సులో సంకల్పము లేదు. వికల్పము లేదు. అంతలో పడమటింటి దొడ్డివైపు కిటికినుండి ఒకపిల్లి దుమికి వారి యిరువురి నడుమగా పోయెడిదే గాని దూకిన చప్పుడునకు సీత వెనుదిరిగి చూచెను. పిల్లి దూకుటయు, దూకిన యర్ధనిమేషము నిలువ త్రొక్కుకొనుటలో మార్జాలముగూడ సీతవంక చూచెను. అది యిద్దరినడిమికి దూసిపోవునంత మేర వచ్చి యెందుకో భయపడి మటిల వెనుకకు తిరిగి తాను వచ్చిన త్రోవపట్టెను. అప్పుడు సీతకు నవ

ధాని కనుపించెను. ఆ కనిపించుటలో నామె యొక్క సారిగా లేచి నిలుచుండెను. ఆమె యొడిలోని పారిజాతపు పూలన్నియు క్రిందబడిపోయెను. గ్రుచ్చుచు చేతిలోనున్న దండమాత్రము క్రేళ్లాడకపోవుట చేత జారలేదు. పూవులు జారుటయు నామె నిలుచుండుటయు నవధానికి తెలియదు. అతడొక శిలా విగ్రహామువలె నిలుచుండెను. ఆమె లేచి నిలుచున్నప్పుడు ఆ విగ్రహాము కన్నులు కొంచెము కదలినట్లు మాత్రమే యుండెను. దూరమున కొండ మీది కోకిల కుహూకుహూ యనెను. అదియెంతో దూరమున కూసినకూత రతనపుటంచు కోస తేలినట్లు, ఆ కోసనుండి నిడివిగా వచ్చినకాంతి యదృశ్యముగ చాలమేర వ్యాపించి సుతీక్ష్ణమైన రత్నపరీక్షకుని దృష్టికి మాత్రమే తెలిసినట్లు, వారిద్దరి చెవులయందు త్రిశూలమువలె పొడిచెను. ధ్వనికూడ వెలుతురు రేకవలె ముక్కోణములు కలది యందము. వెలుగు రేక వ్యాపించుట కన్నులరమూసి చూడుము. ఒక నక్షత్రము వంక, నొక దీపపుకాంతివంక, కన్నులు చికిలిచేసి చూచినచో నా జ్యోతిర్గోళము అనేక భాగములుగా విభజించినట్లుండును.

గోళాధోభాగము గోళోర్ధ్వభాగము రెండును రెండు సగములు. నడుమ నొక సమరేఖ. సమరేఖ నడిమిభాగమునుండి సూటిగా క్రిందికి దిగుచున్న యొక రేఖ. ఈ రేఖకు రెండువైపుల సమముగా విభజింపబడిన రెండు చతురశ్రకోణములందు సమానముగ నడిమికి చీలగొట్టినట్లు మరిరెండు రేకలు. అటు నిటు చిన్న చిన్న రేకలు వేలుండవచ్చును. ధ్వనికూడ వెలుతురువలె చూడదగినదైనచో నా కోకిల కూత ముప్పేటలుగ వారి చెవులలో పొడిచిన దన్నది చూడవచ్చును. ధ్వని తరంగముల ప్రవాహములు వివృతములుగా, విభిన్నములుగా శ్రవణ కార్యమునందు గుర్తింపగల పరమసుకుమారమైన శ్రవణేంద్రియశక్తి యున్నచో నాధ్వనియొక్క త్రిశూల సదృశపాతము తెలియవచ్చును. అట్టి యనుభూతి యాత్మయందు సర్వాంతర్బహిరింద్రియ సమ్మేళనము కలిగిన ప్రేమయోగులే దర్శింతురు. దైవవశమున ఒకానొక పూర్వజన్మ పరిపాక విశేషమున స్ఖలితుడయ్యు నవధాని యస్ఖలితమైన సీతవలె నట్టి యనుభూతి పొందెను.

అంతటి సమాధిప్రాయస్థితినుండి యవధాని తెమల్చుకొన లేకపోయెను. సీత నిముసములో

తెమల్చుకొని నేలరాలిన పూలు ప్రోగుచేసెను. రాలిన పూలు ప్రోవుచేయుచున్న సీత యవధానిలో మఱల సంకల్ప వికల్పములను సృష్టించెను. అతని కీ గాఢావధానస్థితి పూర్వజన్మపరిపాకవిశేషము. ఆ స్తంభరోమాంచములు వదలినంతనే ప్రస్తుత జన్మసంస్కారములు వెలువడెను. అతడు నెమ్మదిగా నడచి సీతవద్దకు పోయెను. సీత యది యేమి నిలుచుండుట? ఆ యొయ్యారమేమి? అది యభినయించుట కాని యభినయము. శిల్పమువలె నిట్లు చేయవలయునని చేసిన లీలావిచ్ఛిత్తి కాదు. హృదయమునకు, శరీరమునకు మహాపరిపాక మందిన యాత్మలు గల వ్యక్తులలో నది యొక విచిత్రప్రాదుర్భావము. సంకల్పమునుండి సర్వజగదావిర్భావము చెప్పిన మహర్షుల వాక్యములలోని యర్థము. దివ్యాత్మలైన సీతవంటి స్త్రీరత్నముల హృదయగతప్రేమ భావము శరీరాంచలములయందు మధురమధురమై మసృణమసృణమై విదలించిన సహజహేలాకిలికించితాది మహానుభావములు భాష్యీకరించును. ఆ వెనుక నున్న హృదయములోని యచ్ఛమైన ప్రేమ, శరీరము నందిట్టి వంకలు, ఒయ్యారము, భంగిములు కలిగించుట యేమిటి? ఆ హృదయగతాత్మకు

యీ శరీరమున కవినాభావసంబంధము లేనిచో నట్టి పునీతప్రేమభావము, ఇట్టి మధుర శరీరావయవ వికర్షణ మెట్లు చేయును? ఈ మధుర భావమునకు నీ మధురభంగిమ మని నిర్ణయించిన భరతుడేమి నిర్ణయించెను? స్థూల విషయముల వ్రాసెను. సూక్ష్మాంశములు శిల్పదృష్ట్యా వ్యక్తిప్రతిభోన్మేషము లందురు. శిల్పవిషయమున శిల్పిప్రతిభయు నచ్చమైన భావముగల వ్యక్తులలో సహజోద్గమమైన నా దివ్యజ్యోతి యనిర్వచనీయము.

అవధాని:—ఇంత యెండలో దొడ్డిలో నేమి చేయుచున్నావు?

సీత:—ఇంత యెండలో నీ వెందుకు వచ్చినావు?

అవధాని:—నీ వున్నావని వచ్చినాను.

సీత:—నే నిచ్చట నున్నానని నీ కెట్లు తెలియును?

అవధాని:—ఇల్లంతయు వెదకితిని. నీవు కనిపించలేదు.

సీత:—నే నెందుకు?

సహస్రముఖముల మాటల విజృంభించుచున్న యవధాని మనస్సునకా మాట రెండు మూడు అర్థము లిచ్చెను. నెల్లీయుండగా తా నెందుకనియా? లలిత

విషయమా, శారద విషయమా? తనయందు నిరాదరణయా?

అవధాని.— ఊరకే వెదుకరాదా?

సీత:— పోయిన వస్తువును వెదకుము.

అవధానికి మఱల నామాటయు భిన్నార్థములనే స్ఫురింప చేసెను. అతని మొగములో నొక గాంభీర్యము, నొక విచారము, నొక పట్టుదల కనుపించెను. అత డిట్లనెను. 'నీవు నాకు పోయిన వస్తువవు. నిన్ను నేను పోగొట్టుకొంటిని. పోగొట్టుకొన్నది చాలక నిన్ను చూచి గుర్తుపట్టలేకపోతిని. నీవు నేను పోగొట్టుకొన్న వస్తువని శారద చెప్పవఱకు తెలియదు. నిన్నిసారి పోగొట్టుకొనను. నాకు మిగిలిన సర్వము పోయినను నిన్నిసారి పోగొట్టుకొనను.'

సీత అర్ధనిద్రలో నుండి మధుర సంగీతము వినుచున్న ట్లతని మాటలు వినుచుండెను. అంతలో శారద దొడ్డిలోనికి వచ్చెను. వీరిద్దరిని మామిడి చెట్టుక్రింద చూచెను. మూడవమనిషి వచ్చినంతనే వారిద్దరిచుట్టు నావరించియున్న యొక తన్మయత్వమండలరేఖ విచ్చిపోయి యిరువురు తమ పూర్వనిమేషస్థితి లజ్జాహేతు వని గ్రహించిరి. సమాధి

గతుడైన బ్రహ్మవిద్వరునకు పరస్పర్శ సోకినంతనే మెలకువ వచ్చినట్లు, వారిరువురి ప్రేమభావము, లజ్జా మాధుర్య మహానంద వికారము, శారద వచ్చినంతనే విరిసిపోయెను. శారద కిల కిలా నవ్వెను. సీత తొట్రుపడెను. అవధాని ధైర్యము నభినయించెను. అందరును తిరిగి యింటిలోనికి పోయిరి. పిపాసితుడై ప్రాణావశిష్టమైన దశలో నున్న బాటసారి కడనీరు లభించినట్లు, మహాదారిద్ర్య పారావారమునందు మునక లిడుచు దారి తెన్ను తెలియని దరిద్రునకు పెన్నిధి దొరికినట్లు, దొడ్డిలో జరిగిన సీతాసమాగమము అవధాని యుద్వేగమునకు ప్రథమతర్పణము చేసెను. ఆకలి మితిమీరి పట్టుకొనరాక 'అస్తుపిస్తైనవాడు భోజనము ముందు కూర్చుండి మొదటి వాయ తిని నీళ్లు త్రాగినంతనే 'అమ్మయ్యా' అనుకొని తరువాత సావకాశముగా భోజనము చేయుటకు తొందర పడనట్లు, అవధానియొక్క యుద్వేగము తీక్ష్ణభావతప్పితమై సీతతోడి యితర సమాగమములు క్రమశః అవియే జరుగునన్న ధైర్యముతో నుండెను. అతనికి మూడు నెలలనుండి యున్న సందేహము ఒక్కసారి విచ్ఛిన్నమయ్యెను. సీత తన్ను ప్రేమించుచుండె

నని తనకు తెలియును. కాని ప్రేమించదేమోయను
ననుమానము ఆ విశ్వాసము నెంట వెంట
తగులుచుండెను. ఇప్పు డా యనుమానము లేని
నిశ్చయజ్ఞానముతో నతని యుద్వేగము ప్రథమ
దశను దాటిపోయెను. ద్వితీయ దశను పొందెను.
ప్రేమ మహానదివంటిది. అది పుట్టినచోట కొండలలో
బడి చిన్నరాళ్ళకు పెద్దరాళ్ళకు చిన్న తరగలు
పెద్ద తరగలు సృజించుకొనుచు, నిలువలేక గంతులు
వేయుచు, నడ్డువచ్చిన ప్రతిదానిని సముల్లంఘించుచు,
త్రోసివేయుచు పఱచిన ప్రవాహదశ
ప్రథమదశ. సమప్రదేశమును జేరి నిండు ప్రవా
హమై తన నిండుతనముచే కల్పించుకొన్న తరంగము లే
కాని శిలాతాడనస్ఫురిత తరంగములు లేని ప్రవా
హము రెండవ దశ. పంటపొలాల నడుమగా కాలు
వలై, బోదెలై సన్నని నూలంత యెత్తుకూడ లేని
తరంగములు కలిపించుకొన నక్కఱ లేకుండ కనిపించు
స్థితిలో నున్నది తృతీయ దశ. అవధాని ప్రేమ
యిప్పుడు ద్వితీయదశలోనుండెను. అతనియందు
ప్రొద్దుటివలె మాటకు సమాధానము చెప్పక
పోవుట, పరధ్యానముగా నుండుట యేమియు లేదు.

ప్రతిదానికి మొగములో కనిపించు నొక పరితృప్తి రేఖయే సమానముగా నుండెను.

సాయంకాలము ప్రొద్దు వాటారిన తరువాత సీతాశారదలు నవధానియు వాహ్యాళి బయలు దేరిరి. నడచినంతసేపు నెవ్వరును మాటాడలేదు. సీత తనకు బావ దగ్గరగా నడుచుచున్నా డన్న యూహ సన్నని పట్టుదారములవంటి వేయి దారములతో నామె శరీరగతసర్వరక్తబిందువులకు బ్రాకి యామె సహస్రమాణిక్యముల దారమువోసి వ్రేలాడదీసిన చెండువలె నడచుచుండెను. సీత తన్ను వెన్నంటి వచ్చుచున్నదన్న యూహ యవధాని మనస్సులో తానొక చంద్రునివలె ననిపించెను. రెండు జ్యోతిర్గోళముల సన్నిధానమున నడచు నక్షత్రమువలె శారద పోవుచుండెను. పూర్వము అవధాని శారదలు కూర్చున్నచోట పోయి కూర్చుండిరి. కొంతసేపెవ్వరును మాటాడలేదు. అవధానికి తనలో తనకే అచ్చెరువాయెను. ప్రొద్దున సీతతో మాట్లాడెను. మరల మాట్లాడుట కంత సిగ్గెందులకు?

అవధాని:—శారదా! మీ చెల్లెలు మాటాడదేమి? ఇంక నాతో మాట్లాడదా?

శారద:—ఇంక ననగా నాకేమి తెలియును? మీరిద్దరు కలసియుండుట మాత్రమే చూచితిని.

సీత శారదను మోచేతితో పొడిచెను.

శారద:—నడుమ నాకీ పోటులెందుకు? ఆయన మేనత్తకొడుకు. నీవు మేనత్తకూతురవు. మీరిద్దరు నొకరి నొకరు ప్రేమించుకొనుట యేమి? నీవు నన్ను పొడుచుట యేమి?

సీత:—ఇది యంతయు నీవే చేసినది.

శారద:—ఏది యంతయు నేను చేసితిని? ఈ పూవులు నేను పూయించితిని కాబోలు. ఆ కోకిలను నేను కూయించితిని కాబోలు. ఈ యాకాశమును నేను వెలయించితిని కాబోలు.

అవధాని:—శారదా! నీకున్న తెలివితేటలు నాకున్నచో జీవితములో నేనింకెంతయో బాగుపడెడివాడను.

శారద:—ఒకొక్క-సమయములో పొందు నానందము ఎట్టి మాటలైన ననిపించును.

అవధాని:—ఆ మాటకు సీత సిగ్గుపడు నెందుచేతను?

శారద:—అది రాక రాక వాహ్యాళి వచ్చెను. నీవేమో దొరవు. అది పట్టి తెలుగువాళ్ల పిల్ల. ఏమో సిగ్గుపడునులే.

అవధాని:—నేను దొరనుకాను. నా దొరతనము పోయి మూడునెల లైనది. నేనిప్పుడు తెలుగువాడనే.

శారద:—ఏ యెండ కా గొడుగుపట్టనిచో నుద్యోగములో నభివృద్ధి లేదు.

అవధాని తల వాంచెను. అతని మొగములో నొక వివర్ణత యుదయించెను. అతని యానందములో నణగియున్న యొక విషాదభావము పొడసూపెను. శారదకు దాని కారణము తెలియలేను. శారద యేమాట యనినను తనకే తగులుచుండెను. ఆమెకు సహజమైన వాక్చమత్కృతి యిట్లు తనయెడ విపరీతఫలదాయిని యగుట తనదే దోషము. తనకు ప్రియతమాతిప్రియతమయైన సీతకడనే యామె యుండుట-యిది భగవంతుడు చేసిన సన్నివేశము. తనదోషము తనకు ప్రతినిమేషమందును జ్ఞాపకము చేయుటకు శారదావాక్చాతుర్యము భగవంతు డిప్పు డిట్లుపయోగపఱచుచుండెను. సీత యవధాని మొగమును చూచి ఖిన్నురాలయ్యెను. శారద

పూర్వము రెండు మూడుసారులు కొన్నిమాటలచే నవధాని గగ్గోలుపడుట గుర్తించెను. మఱల నట్టి సన్నివేశమే జరిగెను. వెనుకసారి యతడే యేదో రహస్య ముండెనని చెప్పెను. ఈమాట లా రహస్యమును స్పృశించుచున్నవా? ఆ రహస్యమేది? ఆ రహస్యము సీత కపకారము కలిగించునది కాదు గదా! వెనుకటి యవధాని ధోరణి అట్టిది కాదన్న ధైర్యము నిచ్చెను. సీత తనకే పెదతండ్రికూతురా? అవధానికిని మేనమామకూతురు. అతనికి సీతమీద ప్రేమయున్నదనుటనిర్వివాదాంశము. మధ్యాహ్నము మావిచెట్టుక్రింద నున్నప్పటి యవధానిని జూచినచో నతనియందు కాముకత్వ లక్షణములు లేవు. అగాధమైన ప్రేమభావముచే విహ్వలుడగుచున్న మనిసియే కానుపించెను. బంధుత్వములో, నింతటి ప్రేమ విషయములో, నవధాని మోసము చేయడు. ఒకవేళ నతనిని మించిన తొలగించుకొనరాని యొక యాపద్వాగురలో నతడు తగుల్కొని యతనివెంట సీత గూడ లాగబడునేమో? శారద యెంత వివేకవంతురాలో, అంత మధురభావానుకూల్యవతి. లాగబడనిమ్ము. నష్టమేమి? వారిప్రేమ నిశ్చయవిషయమైనప్పుడు కష్టములుగూడ మధురములే యగును.

శారద:—బావా! నామూలముగా మీ యిద్దరి యేకాంతము మధ్యాహ్నము చెడినది. ఇప్పుడు నా నోరూరకుండుట లేదు. నేను వెడలి పోయెదను.

సీత:—నేను కూడ వత్తును.

అవధాని:—ముగ్గురము కలసియే పోవుదము.

శారద:—చూచితివా, నిన్ను వదలినచో బావ యుండలేడు. నీవు వత్తువనగనే తానుగూడ వత్తుననుచున్నాడు.

అవధాని:—ఈ ఒత్తులెందుకు?

శారద:—తెలుగు రాదందువే?

అవధాని:—సీతతో నాల్గు మాటలు మాటాడిన తర్వాత తెలుగు రాకపోవుటయేమి?

శారద:— ఇవ్వేళ సీత మన వెంట నేల వచ్చినది?

సీత:—ఈ మాటకు, పూర్వపు మాటలకు సంబంధము లేదు.

శారద:—అసలు వచ్చినదానికి దీనికి సంబంధము కలదు.

సీత:—ఎందుకు వచ్చితిని?

శారద:— మధ్యాహ్నము గ్రుచ్చిన పూలదండ యేమి చేసితివి? ఎందుకు గ్రుచ్చితివి?

సీత:—నేను రాములవారిబొమ్మ కొన్నాను. ఆ బొమ్మకు వేయుటకు కూర్చితిని.

శారద:—ఆ బొమ్మకు నేను ప్రాణప్రతిష్ఠ చేసితిని. నీ వా బొమ్మమెడలో వేయుము. ఆ దండ తెచ్చితివా?

సీత మాటాడలేదు. దండ కుచ్చెళ్ళలో పైట చెంగు కప్పిన కుడివైపున చేతిరుమాలులో భద్రముగా నలగకుండ దాచియుంచెను. శారద యామె నడుమంతయు సర్ది దండతీసెను. వేయు మనెను.

సీత:—ఇచ్చట రాములవారి విగ్రహము లేదు.

శారద:—నీ పెట్టెలో నున్నది విగ్రహముకాదు. వట్టి ఛాయాచిత్రము. రంగులతో గీతలతో నున్న బొమ్మ. దానికి ప్రాణప్రతిష్ఠ చేయుటకే వీలులేదు. ఓసి సిగ్గరీ! నేను చెప్పినట్లు చేయుము.

సీత:—నేను చేయను.

శారద:—నేను నీకు మనుచరిత్రము పాఠము చెప్పితిని. నాకు గురుదక్షిణ నిమ్ము.

అవధాని:—శారదా! అంత బలవంత మెందుకు?

శారద:—ఇది బలవంతముకాదు. ఇష్టము లేనిదానిని చేయుమనుట బలవంతము. ఇష్టమున్నది లజ్జచేత చేయబడనిచో చేయించు నప్పటిది ప్రోత్సాహము.

అవధాని:— ముందు దాని కంత సిగ్గుగానున్నచో నాదండ నాకిమ్ము. నేను వేయుదును.

సీత శారదచేతిలో దండ లాగుకొని తానే యవధాని మెడలో వేసెను. ప్రభావతీప్రద్యుమ్నము చదివిన శారద, "అయం ముహూర్త స్సుముహూర్తోస్తు" అంచు శచిముఖవలె నవ్వెను. పక్షులు కిలకిలారావము చేసెను.

శారద:—సీతా! తరువాత దండవేయునంత తేలిక పని కాదు.

సీత:—నాకు తెలియును.

ముగ్గురును గలసి యింటికి గాలి పడగలవిూద పోయిరి. సంజ చీకట్లు రహస్యములవలె ముసురుకొని వచ్చెను. వారును దొంగలవలె నింటికిపోయిరి. వారి హృదయములలో నెడములేని వెన్నెల. బయట యొత్తుకొనివచ్చు చీకటి. ఆ రాత్రి సీతావధానులకు నిదురపట్టలేదు సరికదా; శారదకును నిదురపట్ట లేదు. మఱునాడు అవధానియు సీతయు నొకరినొక

రెఱుగనట్లే ప్రవర్తించిరి. ఆ మఱునాడు క్రొత్త పోయి పరస్పరాకర్షణము విజృంభించెను. కలసి మెలసి మాటాడుటలో పూర్వోద్వేగమందలి బలము సమాగమోద్వేగమునందు పట్టెను.

పూర్వ మనుమానముతో గూడిన భయము. ఇప్పుడు సౌఖ్యభావనతో గూడిన భయము. ఈ భయము పవిత్రప్రేమకు సహచారియా ?

మూడవనాటిరాత్రి యిరువురకునునిద్రపట్టలేదు. రాత్రి రెండుగంట లయ్యెను. ఇంటిలోనున్న యందరును గాఢసుషుప్త్యవస్థలో నుండిరి. కడచిన రెండు పవళ్లు రెండు రాత్రులు సరిగా నిద్రాహారములు లేక వాడిన శరీరములతో, గాజువారిన కంటికాంతులతో, మేల్కొనియుండి, ప్రతీక్షాపర్యాప్తములైన కన్నులతో నామె వచ్చునని యతడు, అతడు వచ్చునని యామె. అప్పుడు అవధాని దొంగవలె బొట్టనవ్రేళ్లపై నడచి సీత గది తలుపు త్రోసెను. లోన గడియవేసి లేదు. త్రోసికొని లోనికి పోయెను. సీత లేచి నిలుచుండెను. ఆమె నిలువెల్ల వణకిపోయెను. అవధాని ఆమెచేతులు తన చేతులలో పట్టుకొనెను. ఆమె యేడువ నారంభించెను. ఇది యంతయు నవధానికి క్రొత్తగానుండెను. ఓసి పాశ్చాత్య దేశ

కామినీ! నీకును సీతకును నేమి సంబంధము? సీత కొంతసేపటికి నోదారెను. అవధాని యామె నోదార్చుటకు చెప్పినమాట లనవసరములు. ఆమె వణకిన వణకు, ఏడ్చిన యేడ్పు, నొక మహాభయ దుఃఖసంజనితములు కానేకావు. ప్రథమసమాగమ వేళాసాత్వికభావములు. ఎందుకనియో ఆమె నిలువెల్ల వణంకిపోయెను. ఎందుకనియో భయపడెను. ఈ శరీర మొక పవిత్రగృహము. కన్యాత్వము, భార్యాత్వము రెండు పవిత్రదశలు. ఒక దశనుండి మఱియొక దశకు ప్రాపించు వేళ నట్టివణకు, నట్టి దుఃఖము దశాభేదము సూచించునా? అయ్యో! పసితనము పోయి స్త్రీత్వము వచ్చుచున్నదని పసితనముమీద నున్న యనురాగమా? ఇంక తనకు కన్యాత్వము రాదన్న దుఃఖమా? కాని తన భార్యాత్వము బహుదినములుగా వాంఛించుచున్న స్థితి. కన్యాత్వము పోవుచున్నదానియం దున్న దుఃఖము కన్న వచ్చుచున్న భార్యాత్వమునం దనురాగము మెండే. ఆ దుఃఖమునకు వ్యాఖ్యానము, భాష్యము వ్యర్థములు. ప్రతి రక్తబిందువునందు నిగూఢమై పవిత్రభావ మనుస్యూతమైయున్న ప్రకృతియొక్క కదలికలు వాని కవియే యుదాహరణలు.

సీత:—బావా! నీవు రెండురాత్రులనుండి వత్తువను కొన్నాను.

అవధాని:—సీతా! నీవును వత్తువని నే ననుకొన్నాను.

సీత సిగ్గుపడెను.

అవధాని:—సీతా! నాకు వివేకము పోయినది. అట్లనుకొనుటలో తప్పు నీవు సిగ్గుపడిన తరువాత తెలిసినది.

సీత:—నన్ను వివాహ మెప్పు డాడెదవు? నేనింక చదువను. వీరి యింటిలో నుండను.

అవధాని:—నేను వివాహమాడుటకు మఱికొన్ని నెలలు పట్టును. ఇప్పుడు నాస్థితి నాకే తెలియుటలేదు. నేను ని న్నింతదూరము తీసికొనివచ్చుట తప్పుచేసితినేమో యనుపించుచున్నది. సీతా! నీవు పారిజాత పుష్పమవు. నిన్ను నేను బంతిపూవువలె వాడుచున్నానేమో! నీకు చెప్పవలసిన రహస్య మొకటున్నది. అది నే నిప్పుడు చెప్పలేను. అయిదారు నెలలుపోయిన తరువాత చెప్పుదును. నీ కొకవేళ నిచ్చట కష్టముగా నుండినచో నిన్ను మదరాసు పంపింతును. ఇది అరు

నెలలు పట్టునో, ఏడాదిపట్టునో, అంతకాలము నీవు మదరాసులో నుండుము.

సీత:—నిన్ను వదలి యున్నాళ్లుండుటయే నాకు కష్టమయ్యెను. ఇంక నే నస లుండలేను.

అవధాని;— మన మింకను పెండ్లి చేసికొనలేదు గదా?

సీత:—నేను సాయంకాలము నీ మెడలో పుష్ప మాల వేయుటయే నిన్ను వరించుట. అదియే మన వివాహము. మా యప్పగార్ల కిద్దరకు మా నాయన చిన్నప్పుడే వివాహము చేసెను. బ్రదికియుండినచో నాకుగూడ సమంత్రకమైన వివాహము జేసెడివాడే. చిన్న బాబయ్య నాకట్టి వివాహము నెప్పుడును చేయడు. సంఘసంస్కారపు పెండ్లియే చేయును. దానికిని దీనికిని భేదమేమున్నది?

అవధాని:—ఈ వివాహము మన మిద్దరము వివాహ మనుకొనవచ్చును. లోకము వివాహ మనుకొనదు. రాచరికమువా రనుకొనరు.

సీత:—మన మిద్దర మనుకొన్నచో చాలదా?

అవధాని: —ఓసి పిచ్చిదానా! చాలదు. దీనిమీద ననేకములైన తగాదాలు పుట్టవచ్చును.

సీత:—నాకు భయము లేదు.

అవధాని:—సీతా! నీ మాటలు విన్నచో, నీ విశ్వాసము చూచినచో, నీకు చెప్పవలయునన్న రహస్యము వెంటనే చెప్పవలయు ననిపించుచున్నది. అది నీకు చెప్పినచో పాలవంటి నీమనసులో సుడి కల్పించినవాడ నగుదును.

సీత:—అయినచో నాతో చెప్పకుము.

అవధాని యామెను కౌగిలించుకొని యొక యనిర్వచనీయమైన యానంద మనుభవించెను. ఆ క్షణములో నామెను వదలి తా నొక నిముసమైన నుండగలడా యనిపించెను. మిగిలిన రాత్రి అర్ధనిమేషమువలె జరిగెను. తెల్లవారకముందే తాను పోయి తన సెజ్జమీద పండుకొనెను. ప్రొద్దెక్కి నిదుర లేచెను. నిదుర లేచు వేళ సీత వేన్నీళ్లు పెట్టి పెద్దచెంబుతో నవి తెచ్చి మొగము పుల్ల నచ్చట నుంచెను. పీట వేసెను. అతడు మొగము కడుగుకొని వచ్చినంతనే కాఫీ కాచి తెచ్చియిచ్చెను. అతడు స్నానము చేయుటకు నీరు, తుడుచుకొనుటకు తుండుగుడ్డ, కట్టుకొనుటకు దోవతి, పెట్టెలోనుండి యుదికిన చొక్కా తీసి గుండీలు పెట్టుట, అతడు వచ్చినచో లేచి నిలుచుం

డుట, మాటాడవలసి వచ్చినచో నీవు బదులు మీరు అని వాడుట, చూచిన ప్రతి చూపు, నిలచిన ప్రతి భంగిమ, తా నెదురైనప్పటి నడక, అన్నియు నొక పవిత్రశృంగారరసమును వెల్లడించెను. ప్రతి దినము రాత్రియు నందరు నిదురపోయిన తరువాత వారు కలసికొందురు. రాత్రులం దామె తనకు మేనమామకూతురు, స్నేహితురాలు, శారదవంటిది. తనతో పరిహాసము లాడును. తన్ను కొంచెము చమత్కారముగా, లేతగా, వెక్కిరించును. పవళుల యం దది యొక విచిత్ర గౌరవము.

వారము దినములలో వీరిద్దరి పరస్పరసంబంధము ఇంటిలో నందరకు తెలిసెను. శాంతకు కోపము వచ్చెను. వివేకానందుడు విసుగుకొనెను. తన యింటిలో నేదో యప్రతిష్ఠకార్యము జరిగిన ట్లతడు భావించెను. వివాహము లేదు. వా రిరువురు నిశాసమయములందు నేకగృహవాస మను వీలు కలిగించుకొని యు ట్లసభ్యముగా ప్రవర్తించు చున్నా రనుకొనెను. సీతతండ్రి సీతను తన కప్పజెప్పి పోయెను. సీత స్వతంత్రించి యిట్లు చేయుట సీత యొక్క స్వభావమును చెప్పుచున్నది. ఆమె సాదు పలవ. నంగనాచివలె నేమియు తెలియనట్లుండి యెంత

పని చేసినది? నలుగురిలో తానింక తలనెత్తుకొన గలడా? మొదట తన కూతునకై నిర్దేశింపబడిన యవధాని హృదయము తాను వశపఱచుకొనెను. ఇప్పుడు అధమజాతిస్త్రీవలె, జారిణివలె ప్రవర్తించుచుండెను. వివాహమును లేదు, చట్టుబండలును లేదు. ఈ విశృంఖలాచరణము హద్దు మీఱిపోవుచున్నది.

వివేకానందు డిన్ని యనుకొనినను మేనల్లునకు కోపము వచ్చునేమో యని పైకేమియు మాటాడ లేదు. అతనికేమి? ఇంగ్లండులో నిట్టివెన్ని చేసెనో? ఈ రెండేండ్లనుండి యీ దేశములో నెన్ని చేసెనో? సుఖముగా నీమెతో నున్నన్నినాళ్లుండును. తరువాత లేచిపోవును. అప్పుడు దీని బ్రతుకేమి కావలయును? సీత తన యింటిలో నుండరాదు. ఆమెను దాని యక్కగారి యింట్లకు పంపించును. విమలకు నీ సంగతి యంతయు నుత్తరము వ్రాసెను.

అవధాని తరువాత పదిదినము లుండి వెడలిపోవలసి వచ్చెను. అతడు తరువాత తిరిగివచ్చుటకు నెలపైన నిరువది దినములు పట్టెను. ఈలోపుగా సీతస్థితి యా యింటిలో దుర్భరమయ్యెను. అత డుండగా నణగియున్న వివేకానందుని కోపము బయ

టకు వచ్చెను. శాంత జోడుపడెను. శారదమాట ఈ సందర్భములో పట్టలేను. సీతకు నెల మసలుట నింటిలో నందరకు తెలిసిపోయెను. అది తెలిసిన తరువాత నిరువది దినములు సీత పడిన పాట్లు కుక్కలు పడవు. ఆమె సంతతధారగా నైన కన్నీళ్లలో తడిసిపోయెను. సరిగా నన్నము తినలేదు. ఇరువది దినములలో చిక్కి శల్య మయ్యెను. శారద కేమి చెప్పుటకును తెలియలేదు.

అప్పు డవధాని వచ్చెను. సీతను వెంటనే ప్రయాణము కట్టి మదరాసునకు బయలుదేర దీసెను. తా నొక్క దినము సెలవుమీద వచ్చి శారదను తోడు పొమ్మనెను. ఆమె తలిదండ్రు లొప్పుకొనలేదు. అవధాని తాను సీతను పెండ్లాడుదు ననియు, నామె నాల్గువేలు వెంటనే యిమ్మనియు నొక్కెను. అప్పుడతడు శారదను మదరాసు పంపుట కంగీకరించెను. సీతాశారదలు మఱల మదరాసు పోయిరి. అవధాని తన యుద్యోగపు టూరు చేరెను.

## సెల

### ౨

అవధాని సీతాశారదలను మదరాసు పంపించెనే గాని తాను వెనువెంటనే వెళ్ళకపోవుటకు విచారిం

చెను. తాను భోక్తృటకు వీలు లేకపోయెను. విమల మనస్సులో బూర్వాచారపరాయణురాలు. తన తండ్రి యశ్రద్ధచేత నామెకుగూడ సంఘసంస్కారులకు వలె వయసు గడచిన తరువాతనే వివాహమైనను నామె మనస్సులో బూర్వాచారపరాయణత్వము వదల లేదు. కొందఱికి వదలదు. సీత చూడలేదా? ఎనిమిదేండ్లు పినతండ్రి యింటనున్నను, నాయిల్లంతయు నూతనాభిప్రాయములతో వెలయుచున్నను, దన భారతదేశస్త్రీసాంప్రదాయమునే నిలువబెట్టుకొనెను. విమల తనయందు దోషము పట్టుట యీ యొక్క విషయముననే కాదు. తాను వివాహము చేసికొనకుండ సీతతో సంసారము చేయుటయు నామెకు గోపహేతు వగును. అందులో సీతకు నెల మసలుటఁ దనదోష మామెబుద్ధిలో రెట్టింపుగా గన్పించును. అయినను విమల సుకుమారహృదయ. తన్ను మిక్కిలి ప్రేమించును. ఒకవేళ కోపము వచ్చినను దనమీద వచ్చునుగాని సీత మీద రాదు. సీతను ప్రేమగానే చూచును. ఇంతలో నవధానిని కాకినాడలో నసిస్టెంటు సెషన్సు జడ్జిగా వెంటనే యుద్యోగములో జేరుమని యుత్తరువు వచ్చెను.అతడు కాకినాడలో నేరికోరి వేయించు

కొనెను. ఇప్పు డా వేయించుకొనుట తప్పుగా తోచెను. తాను దూరస్థలమున నున్నచో విమల కోపము తన వ్యవహారము పరిష్కార మగువఱకు దన్ను జేరకుండెడిది. ఇపుడు విమలకు దన రహస్యము చెప్పుటయు నామెను ప్రసన్నను జేసికొనుటయు నసంభవవిషయములుగా గనపించెను. విమల తా నెప్పుడో సీతతో హఠాత్తుగా కాకినాడలో దిగి యీ మఱుగుగా నున్న రహస్యమును కాకినాడలో నలుగురకు దెలియజేయునేమో! ఎవరిచేత నైనను సీతకు గబురు చేసినచో బాగుగానుండును. ఉత్తర మేల వ్రాయరాదు?

అవధాని మనస్సులో నిట్టి యాందోళన పడు చున్న సమయమున నతని నప్పునితో గలిపి సృష్టించి యిద్దరి జీవితములకు నెడ తెగని సంబంధము కల్పిం చిన దైవము వాని నతని యింటికి దెచ్చెను. తా నధికారిగా నియమింపబడి తక్కిన క్రింది యధి కారులచే దర్శింపబడకముందే యప్పడు తన్ను దర్శించుటకు వచ్చెను. అవధాని సహజముగా రహస్య గోపనశక్తి గలవాడే. అప్పునితో దక్కువ మాట లాడవలయు ననుకొనెడివాడే. మానిసి కొక కష్టము సంభవించినను మానసికాందోళనము కలిగినను

నెవడో యొక యగాధప్రకృతి తప్ప దక్కనవారు బేలుపోయి తమ యెడంద నితరుల కందిత్తురు. అప్పుడు వచ్చినతోడనే యవధాని వానితో నాప్యాయముగా మాట్లాడుచు,

అవ:—అప్పడూ! మా చెల్లెలు విమలకు నామీద గోపము వచ్చునేమో యనిపించుచున్నది.

అప్ప:—ఎందుకండీ బాబయ్యగారూ! మీరేమి చేసినారు? మీరింత గొప్పపదవిలో నుండగా నావంటివానికే యానందముగా నున్నది. విమలమ్మగారి కేల యుండదు?

అవ:—పోనీ లే, ఎందుకో వచ్చినది.

అప్ప:—నేను మీకు చిన్నప్పటినుండియు సేవకుడను. మీ రహస్యములు నేను బయట పెట్టుదునా? మీరు నన్ను మదరాసు పోయి రమ్మన్నచో పోయివత్తును. విమలమ్మగారన్నచో నాకు భయమైనను నామెకు నా యందు దయగలదు. నన్నేమియు ననదు.

అవ:—ఏమియును లేదు. పర్లాకిమిడిలో మా మేనమామ కూతురు సీత యని యున్నది. ఆమెను నేను పెండ్లియాడ దలచితిని. అందుచేత నామెకు గోపము వచ్చునేమో యని.

అప్పుడు కొంపలు తీసెడు కొఱవి. వాడు వెంటనే రహస్యమును గుర్తుపట్టెను. "సీతమ్మగారితో దపురు—అని యూగెను.

అవ:—అవునోయీ!

అప్ప:—బాబయ్యగారూ! అయిన మాత్ర మేమి? మీరు వెంటనే వివాహము చేసికొనుడు. తప్పేమి యున్నది?

అవ:—తప్పేమియు లేదు. మన యుద్దేశము నెవరు గ్రహింతురు? నే నామెను వివాహము చేసి కొనుటకు మఱి కొన్నాళ్లు పట్టును.

తరువాత నేదో యేదో మాట్లాడిరి. అప్పడి దారి నప్పుడు పోయెను. అప్పడికి మనస్సులో గుంజాటనగా నుండెను. ఏడాదివఱకు నవధాని యేల వివాహము చేసికొనరాదు? సామాన్యముగా నింగ్లండు పోయిన మన దేశస్థు లచ్చట నెవ్వతెనో కట్టుకొని వత్తురు. ఆ తప్పు తిరిగి యింటికి వచ్చిన తరువాత దెలియును. అవధాని కట్టి స్థితి జరిగి యుండవలయును. రోజులు గడచినకొలది నీ తనని యూహ యప్పడి బుద్ధిలో యథార్థముగా గనిపించెను. అతని హృదయములో నతని మనస్సునకు దెలియకుండ నవధానియందు నొక తేలిక భావ

మును నొక చోటవయు గలిగెను. పైగా నవధాని తనకు దగ్గరవాడు. అవధాని యూరిలోనికి జడ్జిగా వచ్చినప్పటి నుండియు దన పలుకుబడి గౌరవములు హెచ్చెను. తన పాయానాంధ్రడే, పూర్వము వట్టి చిఱునవ్వులతో నెడలి పోయియున్నారు, తన కిప్పుడు నమస్కారములు చేయుచుండిరి. తా నేది చేసినను నాయూరిలో దన కెదురు లేదనిపించెను. మదరాసు దాక బోనక్కఱలేదు. ఎల్ల యభియోగములును కాకినాడలో దీర్పు చెప్పెడివారిలో నతఁ డత్యధికుడు. తనకు బరులను జూచి భయపడవలసిన యవసరము లేదను ధైర్య మతనికి జక్కగా పాతుకొనిపోయెను.

ఇట్లుండగా రంగయ్య తన కూతును నళినిని అప్పడు చేసికొనునో లేదో గట్టిగా దేల్చుకొనవలయు ననుకొనెను. నళిని యప్పనినే తప్ప మఱియొకనిని వివాహము చేసికొనననని పట్టుపట్టెను. ఈ నడుమ గొన్ని దినములు వారి యింటి కప్పడు రాకపోకలు మానెను. రంగయ్య యేదో పని యున్నట్లు వానిని దన యింటికి రమ్మని కబురంపెను. అప్ప డీ మఱల కబురంపుట యవధానికి దనకు గల సంబంధమే హేతు వనుకొనెను. అత

డిప్పుడు రంగయ్య యింటికి బోవుచు వచ్చుచుండెను. పూర్వము తాను వారియింటికి బోయినను నళినితో నెక్కువ పరిచయముగా నుండుటకు వీలులేకుండె డిది. ఇప్పుడు నళిని వచ్చును, మాటాడును. తనతో గలసి యొక చాపమీద గూర్చుండును. ఆమె దిన దినము, పూటపూటకు నతని నాకర్షించుటకు గ్రొత్త చీరలు తాల్చును. క్రొత్త యలంకారములు చేసి కొనును. అప్పడికి గ్రమక్రమముగా నామెయందు ప్రేమ లేకపోయినను, నామె సౌందర్యవతి కాదని యత డనుకొనినను, దాని వయసు, దాని సోకు, తన యందలి దాని యూహ, యివి యన్నియు నతనికి గామోద్రేకమును గలిగించెను. అతడు రంగయ్య లేనప్పుడు రెండుమూడుసారు లామెను వశపఱచు కొనుటకు బ్రయత్నించెను గాని యామె నిరాక రించెను. ఇట్లు వ్యామోహపఱచి యతనిని వివాహ భావాభిముఖుని జేయుద మని నళిని యూహ. తాను వివాహమెట్లును జేసికొనడు, ఆమెను వశపఱచుకొన వలయు నని యప్పడి యూహ. క్రమ క్రమముగా నళినికి దన యూహ ఫలాభిముఖ మగు చున్న దని భ్రాంతి. అప్పడికి నీ పునఃపునఃప్రతా

రణము వలన వృద్ధియగుచున్న కోపము తోడి పట్టు దల. కొన్నాళ్ళు గడచెను.

ఒకనాడు రంగయ్య యూరిలో లేడు. ఆ రాత్రికి రాడని చెప్పిరి. అప్పుడు నళినితో సినిమాకు బోదమా యనెను. ఆమె వానికి దనయందలి ప్రేమ కిది వృద్ధిసూచనయనియు మఱియు మోహపెట్టుట కిది యవకాశ మనియు నంగీకరించెను. అతడు రెండవ యాటకు బోదమనగా నామె మొదటియాటకే తన యంగీకృతి చూపెను. అతడును జివర కొప్పుకొనెను. సినిమాకు బోయిరి. ఆ సినిమాలో గథలో నొక దుష్టుడొక్క సౌశీల్యవతియైన కన్యను బలవంతము చేయుటయు నామె యతనిని జెంపలు పగుల గొట్టుటయు సన్ని వేశములలో నున్నట్లే యుండెను. సినిమాయైన తోడనే యప్ప వొక బండి కట్టించి యింటికి బోదమనెను బండి చీకటిలో నేదారిని బోవుచున్నదో నళినికి దెలియలేదు. చివరకా బండి యొక నిర్జనమైన మారుమూల సందులో నిలచెను. అప్పడు నళినిని దిగుమనెను. నళినికి సందేహము వేసెను.

అప్ప:—ఫర్వాలేదు. ఇది మా స్నేహితుల యిల్లు. వాని తల్లి ముసలిది. నిన్న నేను బెండ్లి

యూడుకు నని చెప్పగా నిన్ను దీసికొనివచ్చి చూపించుమని చాలసార్లడిగినది. చూచి పోదము.

నళిని:—ఇదివఱకు నీ వీ సంగతి నాకెప్పుడును జెప్ప లేదే?

అప్పు:—నా కిప్పుడే జ్ఞాపకము వచ్చినది.

నళిని సందేహించుచు దిగెను. దిగుచున్నప్పుడు బండివానిని జూచెను. అతడు తా నెఱిగినవాడే. భయము లేదనుకొని యప్పునితో నింటిలోనికి బోయెను. బండివాడు బాడిగతోలుకొని పోవుచుండెను.

నళిని:—బాడివాని నుండు మనుము.

అప్పు:—ఫర్వాలేదు. మన మిచ్చట నింక గొంత సేపుండవలయును. మాటాడుట కాలస్య మగునేమో? నేను మఱొక బండి దీసికొని వత్తును.

వారిద్వరును లోనికి బోయిరి. తరువాత నొక గంటసేపటికి నళిని రైక యంతయు చిఱిగి చీరవలిగి పోయి, తల చెదరి, మెడ లంతయు గీరుకొనిపోయి యేడ్చుచు బయటికి వచ్చెను. ఆ సమయమున నా

దారివెంట రామారావను పెద్దమనిషి పోవుచుం డెను. అతనికి రంగయ్య చాలసా ర్లప్పు పెట్టెను. రంగయ్య యింటిలో నత డందరిని నెఱుగును. ఆమె యేడ్పు విని యామె యెవరో యని చూచి నళిని యగుట గుర్తుపట్టి యిదియేమని యడిగెను. ఆమె యేడువ నారంభించెను.

అతడు వెంటనే యొక బండిని మాటాడి నళినిని వారి యింటికి దీసికొని పోయెను. రంగయ్య యూరి నుండి తిరిగివచ్చెను. అతడు కూతురు జూచి యాదు ర్దాతో విషయ మడిగెను. ఆమె తండ్రితో రహస్య ముగా నప్పుడును దానును సినీమాకు బోయితి మనియు యచ్చటనుండి యెచ్చటికో తీసికొనిపోయె ననియు, నచ్చట దన్ను బలవంతము చేసెననియు దాను దన్ను వివాహము చేసికొమ్మని యడిగెననియు, నిప్పుడు నీవు నాకు వశమైనచో జేసికొందునని యతడు బలవంతపెట్టెననియు జివరకు దా నొప్పు కొనకపోవుటచేత దన్నిట్లు చేసెననియు జెప్పెను. రంగయ్య రుద్రుడై మండిపోయెను. " వాడు అవ థాని యండ చూచుకొని యెగురుచున్నాడు. వాని గోరీ కట్టించెదను, చూడు'' మని విసరుకొనెను. రంగయ్య వ్యవహారజ్ఞానము కలవాడు. కోర్టుపక్షి.

అతడు వెంటనే పోలీసువారికి రిపోర్టిచ్చెను. పోలీసు సబినస్పెక్టరు వచ్చి యామె వద్ద కైఫీయతు తీసికొనెను. మఱునాడు డాక్టరు సర్టిఫికెట్టు వచ్చెను. "ఆమె శరీరముమీద నున్న గాయములు పరులచేత బలవంతముగా బాధింపబడినప్పుడు చేయబడినవి. ఆమె యొక పురుషునిచేత బలాత్కరించబడినది. ఆ చిహ్నము లామెయం దుండెను" అని.

మఱునాడు పోలీసు సబిన్స్పెక్టరు మేజస్ట్రేటు కోర్టులో నీ దావా వేసెను. అప్పుడు పూర్వ మొకసారి చెఱలోనికి వెళ్లినవాడు కావునను, పట్టణములో నతడు కాడీలలో నొక డగుటవలనను పోలీసువారు వెంటనే యతనిని ఖైదీగా పట్టుకొనిరి. అప్పుడు డిఫెన్సు పెట్టుకొనలేదు. అడిగిన యే ప్రశ్నకును సమాధానము చెప్పలేదు. ప్రతిదానికి దానెఱుగ ననెను. సబిన్స్పెక్టరు మండిపోయెను. వానికీ వ్యవహారములోని లోతుపాతులు తెలియును. అందుచేత తన డిఫెన్సంతయు సెషన్సుకోర్టులోని కట్టిపెట్టుకొని యుండె నని గ్రహించెను.

కేసు సెషన్సుకోర్టుకు కమిటు చేయబడెను. మేజస్ట్రేటతనిని 'ప్రైమాఫేసి' కేసుండుటవలన సెషన్సుకు కమిటు చేసెను.

# శిక్ష

## ౧

అవధాని జామీనుమీద దాను వదలించుకొందమని యప్పుడు తలచెను. కాని యవధాని యేమియు మాటాడలేదు. అతని కవధానిమీద గోపము వచ్చెను. ఇంతలో నప్పటి కేసు విచారణ జరుగుటకు వేసవికాలపు సెలవు లడ్డమువచ్చెను. అవధాని సెలవులలో మదరాసు పోవలయు ననుకొనెను. సీతను గలసికొనవలయునని యతని హృదయము నిరంతరము పీడించుచుండెను. సీతను బంపించిన తరువాత విమలవద్దనుండి జాబే లేదు. విమల వారమున కొకసారి యన్నగా రెచ్చటనున్నను జాబు వ్రాయుచునే యుండెను. తాను సీతను బంపించి రెండు నెలలు కావచ్చెను. ఈ రెండునెలలు విమలవద్ద నుండి జాబు లేదు. అతనికి మనస్సులో నాందోళన బయలుదేరెను. అతడు పసివానివలె రాత్రిపూట మంచముమీద బడుకొని యాలోచించి యాలోచించి తుద కేడ్వ నారంభించెను. "విమలా! విమలా! నీకు నామీద గోపము వచ్చినచో నేను బ్రతుకలేను. నేనేమి తప్పు చేసితిని? నేను సీత నన్యా

యము చేయదలచుకొనలేదు. సీత నన్యాయము చేయుట నన్ను నేను జేసికొనుట. ఎవ్వడుగాని తన గుండియమీద దానే నిప్పులు చెఱుగుకొనునా? నా యెదో దోషమునకు నీ కోపమను శిక్ష నాకు జరుగునని నాకు దెలియును. నే నే శిక్షనైనను నాగ గలుగుగాను. నీ కోపము నాగలేను. నే నన్నను, నీవు చెల్లెలివి. నా భయము నీ కుండవల యును. భగవంతు డిచ్చుట దారుమారుచేసి నీ భయము నాకు బెట్టెను" అని బిగ్గరగా నసుకొ నుచు నేడ్చుచుండెను. అతని యేడ్పు తగ్గిన తరు వాత నిట్లనుకొనెను. 'ఛీ ఛీ యిది యేమిటి? నాపని నాటకము తరహాగా నున్నది గాని, మనుష్య సహజ ముగా లేదు. అని శూన్యమనస్కుడై కొంతసేపు కనులు తెఱచుకొని మేడ పైకప్పువాక జూచుచు నుండి యుండి నిదురపోయెను. అతని మొగములో రోజులు గడచినకొలది నొక వివర్ణత వ్యాపించెను. అతడు కాక యింకొకడైనచో విమలను లెక్క సేయడు. సీతను దెచ్చుకొని వివాహము చేసికొ నును. ఇంతటి సులభమైన మార్గమున నతడేల విషాదము పొందును! అతడు సెలవులన్నాళ్లు గడ్డము చేసికొనలేదు. శుభ్రమైన వస్త్రములు

తాల్చలేదు. సరిగా నిద్రాహారములు లేవు. ఇంటిలో దనతల్లి భవానియే వండిపెట్టుచుండెను. ఆమె యితడు భోజనమునకు వెళ్లినప్పుడు పెట్టును. భోజన సమయములో నేమైన గావలయునా యని యడుగుటయే తప్ప నామె యతనితో నింకొకమాట మాటాడదు. అతడు పదిగంటలకు భోజనముచేసి వెడలిన తరువాత నామె మడిగట్టుకొని సీతారామాంజనేయము, భజగోవిందశ్లోకములు, వివేకచూడామణి, సాహస్రి మొదలైన తెలుగు లిపి గ్రంథములు, తాత్పర్యములతో నున్నవి, తలక్రింద నొకపీట పెట్టుకొని, కొంగుపఱచుకొని పరుండి రెండు గంటలగు వఱకు జదివి చదివి యప్పుడు భోజనముచేయును. తరువాత గొంచెము కూర్కును. రాత్రికి బ్రాహ్మణపోయి వంటచేయును. అతనికి జెందలకడ నాకలియైనను నీలులేదు. వేరే జడ్జీలకు నియమింపబడిన బంగళాలో నుండుట కతనికి మనస్కరించలేదు. సీతయున్నచో నుండెడివాడే. తల్లి యచ్చట నుండగా దాను వేఱేయుండుట కిచ్ఛగించలేదు. వంటవానిని పెట్టుట కామె యిచ్ఛగించలేదు. తనకు కాఫీయు ఫలహారములు నామె చేసిపెట్టదు. కాఫీహోటలు నుండి తెప్పించుకొనవలయును. అట్లు తెప్పించు

కొనుట యతనికమర్యాదగా నుండెను. ఇక తా నీ బాధపడుట యెన్నాళ్ళు? విమల తన్ను క్షమించునా? ఒకనాటి సాయంతనమున నత డుప్పుపేటవెంట నడచుచుండెను. అతని నెఱిగియున్న యొక పోలీసువాడు నమస్కారము చేసి కొంతదూర మనుసరించి వచ్చుచుండెను. తనవంక నిద్దరు, ముగ్గురు తేఱిపాఱ జూచిరి. ఆ పోలీసువాని నెఱిగియున్న యొకడు వానిని బలుకరించి 'పోలీసుస్టేషనుకు దీసికొని పోవుచున్నావా' యనెను. ఆ పోలీసువాడు తికమకపడి నీళ్లు నమలి వానిని పొమ్మని సైగ చేసెను. అవధాని యామాట విని విననట్లు నటించెను. నిజమే, కారాగృహీతునకు దనకు నేమి భేదముండెను? తన మాసిన తల, గడ్డము, దుస్తులు, చిక్కిన శరీరము, పోలీసువాడు వెంటవచ్చుట, లాంఛనము లన్నియు సరిపోయినవి. తన మనస్సుకూడ శిక్ష యనుభవించుచున్నవాని మనసువలెనే బాధపడుచుండెను. రాజనిబంధనము వినా తనకు గారాగృహీతునకు భేదము లేదు. "ఓయి యవధానీ! నీవు చిన్ననాడు జేబుదొంగవు. నేడు నీ దొంగతనము మితిమీఱి పోయినది. మహోపకారివైన గురుమూర్తిగారి యాస్తి నాహుతి పుచ్చుకొంటివి.

మేనమామకూతు లని లేక బంధుత్వములో నమ్మ
కముమీద, పెండ్లియాడుదు నని చెప్పి యామె
వయస్సును గొల్లగొంటివి. అప్పుడిమీద పెట్టినకేసు
నీ మీదను బెట్టవచ్చును. అప్పుడు అల్లరివాడు.
నీవు పెద్దమనిసివి. అప్పుడు విద్యావిహీనుడు. నీవు
ఐ. సి. యస్. పరీక్ష నిచ్చితివి. అతడు నిరుద్యోగి.
నీవు గొప్ప యుద్యోగివి. అతడును నమ్మిన స్త్రీ నవ
మానపఱచెను. నీవును పఱచితివి. అతడు శిక్ష
ననుభవించుచున్నాడు. నీవును శిక్ష ననుభవించు
చున్నావు. లోకమునకు వాడు శిక్ష ననుభవించు
చున్నట్లున్నది. నీ వనుభవించుచున్నట్లు లేదు.
ఇంతియే భేదము."

సెలవులైన తరువాత మఱల కోర్టు తెఱచిరి.
అప్పుడి కేసు విచారణ యవధాని వీలైనంతవఱకు
జాగుచేసెను. చివరకు తప్పక వచ్చెను. విచారణ
నాడు కోర్టులో నళిని, రంగయ్య, రామారావు,
నళినిని బండిమీద నా సంధులోనికి తీసికొనివెళ్లిన
బండివాడు - వీరందరును హాజరైరి. పబ్లికు ప్రాసి
క్యూటరు కేసును గురించి మాటాడుట యారంభిం
చెను. అవధాని యప్పునిజూచి "ఈ నీ మీదవచ్చిన
ఫిర్యాదునకు నీవేమి చెప్పుదువు ?

అప్పడు:—అయ్యా! నావద్ద డబ్బులేదు.

ప. ప్రా:—అయ్యా! ఇతడు దొంగ. డబ్బులేని వాడు కాదు.

అవ:—నీ వీ యభియోగము నొప్పుకొందువా? ఏమైన సమాధానము చెప్పుదువా?

అప్ప:—అయ్యా! జరిగినదంతయు నబద్ధము. నా తరఫున న్యాయవాది యున్నచో నేను వారితోఁజెప్పి నామీఁద వచ్చిన పిర్యాదబద్ధ మని ఋజువుచేయగలుగుదును.

అవ:—గంగాధరరావు పంతులుగారూ! దయచేసి మీ రితని తరఫున, 'ఎమికస్ క్యూర్రై'గా పనిచేయుదురా?

గంగా:—చిత్తము. కాని యొక్క మనవి. నాకీ కేసుతో పరిచయములేదు. రికార్డు యావత్తు పరిశీలించుటకును ముద్దాయి వద్ద సంజాయిషీ పుచ్చుకొనుటకును కొంత వ్యవధి కావలసియున్నది. కాని కోర్టువారి కాలము వృథాపుచ్చుట నా మతముకాదు. అందుచేత పబ్లికు ప్రాసిక్యూటరుగారి విచారణ యయిన తరువాత నేనొకసారి సాక్షుల

నందరిని పరీక్ష చేయుటకు మీరు అనుజ్ఞ యిప్పించవలయును.

అవ:—(ప్రాసిక్యూటరుతో) దీనికి మీ కేమయిన నభ్యంతరము కలదా?

ప్రా:—ఏమియును లేదు.

అవ.—ఈ కేసు మఱల పదిరోజులకు వాయిదా వేసితిని.

ఆనాడు నళిని రంగయ్య మొదలగు వా రెవ్వరి దారిని వారు పోయిరి. రంగయ్య పబ్లికుప్రాసిక్యూటరుతో "అయ్యా నేను జెప్పలేదా? ఆయనకు నతనికి జిన్ననాటనుండి పరిచయము. నే దది యూరకే పోవునా? కేసింత విస్పష్టముగా గనిపించు చున్నప్పు డతనికి వేతే డబ్బు లేకుండ ప్లీడర్ను గుదిర్చినాడు. మా కేసెట్లును జెడగొట్టును. ఈ కేసు నీ జడ్జిగారు విచారించుటకు వీలులేదని ట్రాన్సుఫరు పిటీషను బెట్టవలయు" ననెను. పబ్లికు ప్రాసిక్యూటరు "అట్లు వీలులేదు. గవర్నమెంటువా రట్లు చేయరు. అట్లు చేసినచో దమ న్యాయ చక్రము తామే కాదనుకొనిన ట్లగునని చేయ" రనెను.

గంగాధరరావుగారు జైలులోనున్న యప్పడితో పోయి మాట్లాడెను. అప్పడిట్లు చెప్పెను. 'అయ్యా! ఆమె యిష్టముమీదనే నేను తీసికొని పోయితిని. ఇష్టముమీదనే నాతో నుండెను. తరువాత దన్ను బెండ్లిచేసికొమ్మని యడిగెను. నేను జేసికోనంటిని. మా యిద్దరకు సంబంధము మాత్రము విడిపోనక్కరలేదన్నాను. ఆమెకు గోపము వచ్చి రైకచించుకొని, తలపీకుకొని, యొడలంతయు గీరుకొని యేడ్చుచు బయటకు బోయెను. నే నామెయే మరల తిరిగి వచ్చుననుకొంటిని. కాని రాలేదు. మరునాడు పోలీసువారు నన్ను బట్టుకొనిరి. నాకు జామీ నీయలేదు. నే నేమి చేయుదు" ననెను.

గంగా:—మఱి డాక్టరు ఆమెను బరీక్షించి నీకు వ్యతిరేకముగా సర్టిఫికెటిచ్చెను గాదా!

అప్ప:—డాక్టరు లేమున్నదండీ! డబ్బిచ్చినచో సర్టిఫికెటిత్తురు.

గంగా:—మఱి నీ కనుకూలముగా సాక్ష్యమిచ్చు డాక్టరు నెఱుగుదువా?

అప్ప:—నా కెవ్వరున్నారు?

గంగా:—డబ్బిచ్చినచో నెవరిచేతనైన నిప్పించవచ్చును.

అప్పు:—నా దగ్గర దమ్మిడీ లేదు. అవధానిగా రిత్తు రేమో కనుగొనవలయును.

గంగా:— ఛీ ఛీ, నోరుముయ్యి.

అప్పు:—మీకు రేపు ప్రొద్దున చెప్పెదను

ఆ సాయంకాలము రాముడికూతురు సీత అప్పని చూచుటకు వచ్చెను. ఆత డామె కివరకు చేయించి పెట్టిన గాజు లమ్మి యా డబ్బు తెచ్చిపెట్టున ట్లేర్పాటు చేసెను.

మఱల వాయిదా దినము వచ్చెను. కోర్టు జనముచే క్రిక్కిరిసలాడి పోవుచుండెను. మానభంగపు కేసనగా శ్రవణపేయములైన యసభ్యసంభాషణలు వినవచ్చునని జనము మూగిరి.

ఒక వకాల్తనామా మైన లేక కోర్టునకు హాజరు కావలసిన యవసరము లేని న్యాయవాదులు కూడ న్యాయసభాభవన మలంకరించిరి.

పోలీసువారు సంకెలలు వేసి తెచ్చిన యప్పని నవధాని, 'నీవు సిద్ధముగా నుంటివా' యని యడిగెను.

గంగా:—అయ్యా! మా పక్షము సిద్ధముగానే యున్నది.

జడ్జి:—మొదటిసాక్ష్య మెవరు?

బాడివాడు వచ్చి బోనులో నిలుచుండెను. వాని చేత న్యాయసభ బంట్రౌతు ప్రమాణము చేయించెను.

ప్రా:—నీ పేరేమి?

బాడి:—సలీము.

ప్రా:—నీ విదివర కెప్పుడైన జైలులో నుంటివా?

సలీ:—లేను.

ప్రా:—ఫిర్యాదిని ముద్దాయిని నీ వెప్పుడైన చూచితివా?

సలీ:—చూచితిని.

ప్రా:—ఎప్పుడు?

సలీ:—కొన్ని రోజులక్రింద సినీమావద్దనుండి వారి యిద్దరిని నా బండిలో నెక్కించుకొని రాత్రి పదిగంటలవేళ వారిని ఊరి చివరనున్న యీా సందులో దించితిని.

ప్రా:—నీవు అప్పడికి స్నేహితుడవా?

సలీ:—కాను.

ప్రా:—అప్పుడు నీ కెంత యిచ్చెను?

సలీ:—బండి బాడుగ యిచ్చెను.

ప్రా:—అడిగినదానికి సమాధానము చెప్పు. నీ చేతి కెంత యిచ్చెను?

సలీ:—రూపాయి యిచ్చెను.

అని యింక నేదియో చెప్పబోవుచుండగా ప్రాసి క్యూటరింక నేమియు చెప్పనక్కరలేదనెను.

ప్రా:—నీ బండి యొక్క యింటిముం దాగినది. ఆ సందు మంచి సందేనా?

సలీ:—మంచిసందేనండి.

ప్రా:—అదికాదు. అందులో మర్యాదస్థు లెవరైనను, అనగా ఉద్యోగస్థులు కాపుర ముండిరా?

సలీ:—లేరు.

ప్రా:—నీవుకూడ సినిమాకు వెళ్లితివా?

సలీ:—వెళ్లితిని.

ప్రా:—నీవు సినిమాకు డబ్బియ్యలేదుగదా!

సలీ:—ఇయ్యలేదు.

ప్రా:—ఏ యింటిదగ్గర అప్పుడు నళినియు దిగెనో ఆ యింటిలో నెవ్వరుండురు?

సలీ:—ఎవ్వరు నుండరు. ఎప్పుడును దాళమువేసి యుండును.

ప్రా:—రాత్రులం దక్కడ జూదమాడుచుందురా?

సలీ:—నే నెరుగను.

ప్రా:—పనియు పాట లేనివారు నా యింటిలో మూగుచుందురు గదా!

సలీ:—అప్పు డప్పు డెవరో కొందరుందురు.

ప్రా:—ఆ యింటివద్ద నీవు అప్పని నెప్పుడైన చూచితివా?

సలీ:—చూచితిని. అప్పుడా సందులో నొకటి రెండుసార్లుండగా జూచితిని.

ప్రా:—నీ వింక వెడలిపోవచ్చును.

రెండవసాక్షి రామారావు బోనులో నిలుచుండెను.

ప్రా:—మీ పేరు?

రామా:—రామారావు.

ప్రా:—మీరు ఫిర్యాది తండ్రి నెరుగుదురా?

రామా:—ఎరుగుదును.

ప్రా:—ఎట్లెరుగుదురు?

రామా:—నాకు వతనికిని స్నేహము.

ప్రా:—స్నేహముగా గలసి చదువుకొన్నారా? కలసి యేదైన వర్తకము చేసినారా?

రామా:—లేదు.

ప్రా:—మరి యేమి స్నేహము?

రామా:—ఊరకే మొగమెఱుక.

ప్రా:—స్నేహము కాదు, మొగమెఱుక. మీ రప్పుడా సందులోని కెందుకు వెళ్ళినారు?

రామా:— మా యింటి కది దగ్గర. అందుచేత నట్లు పోవుచుంటిని.

ప్రా:—పోవుచుండగా మీ కేడ్పు వినిపించినది కదా!

రామా:—అవును.

ప్రా:—ఎవరో యేడ్చుచున్న దని మీరు చూచితిరి. ఆమె యీమె యైనది. అంతేనా?

రామా:—అంతే.

ప్రా:—అప్పు డామె యెట్లున్నది?

రామా:—దుస్తులు చిరిగియున్నవి. ఒడలంతయు నెత్తురు కారుచున్నది.

ప్రా:—ఆమె య[illegible]ల కున్నదో మీరడుగ లేదా?

రామా:—ఆమె మిక్కిలి దుఃఖములో నున్నది. నే నడిగినను జెప్పలేదు. వెంటనే యామెను బాడి యొకటి మాట్లాడి యింటికి దీసికొని పోతిని.

ప్రా:—మీ రామెను చూచి యే మనుకొంటిరి?

రామా:—ఎవరో యామెను మాసభంగము చేసి రనుకొంటిని.

కోర్టులో నందరును నవ్విరి. తరువాత నళిని బోనులోని కెక్కెను.

ప్రా:—అప్పుడు మీ యింటికి వచ్చుచుండును గదా! ఎందుకు వచ్చుచుండును?

నళి:—మా నాయనవద్ద నెప్పుడైనను డబ్బడిగి తీసి కొనుటకు వచ్చుచుండును.

ప్రా:—అప్పుడు ఆ స్త్రీకలవాండో కాదో నీకు దెలి యునా?

నళిని:—తెలియును. అతడు పేదవాడు.

ప్రా:—నీ తండ్రి కెంత యాస్తియున్నదో తెలి యునా?

నళి:—మాకొక మేడ యున్నది. పదునేను వేలు ఖాతా తిరుగుచున్నది.

ప్రా:—నీకు అప్పలుగాని చెల్లెండ్రుగాని. యన్నలు తమ్ములుగాని యున్నారా?

నళి:— ఎవ్వరు లేరు.

ప్రా:—ఆ స్త్రియంతయు నీకు వచ్చును గనుక నిన్ను పెండ్లి చేసికొనవలెనని చాలమంది యూ హింతురన్నమాట.

నళి:—అవును.

ప్రా:—నీ వివాహమునకు సంబంధములు వచ్చి నవా?

నళి:—అయిదారు సంబంధములు వచ్చినవి.

ప్రా:—నిన్ను సినీమాకు దీసికొని వెళ్లునపు డప్పుడు నీతో నేమి చెప్పెను?

నళి:—మా తండ్రి సినిమావద్దనుండి నన్ను దీసి కొని రమ్మని పంపించెను.

ప్రా:—అచ్చట నీ తండ్రి లేడు. నీ వడుగలేదా?

నళి:—ఏదో పనిమీద వెళ్లినాడని నా కప్పుడు చెప్పెను.

ప్రా:—అతడు దుర్మార్గము చేసిన యింటివద్ద నీతో నబద్ధములు చెప్పి లోనికి దీసికొని వెళ్ళెను. అప్పుడేమని చెప్పెను.

నళి:—అది తన స్నేహితుల యిల్లని, యాతని స్నేహితుని తల్లితో మాటాడి వత్తునని చెప్పెను.

ప్రా:—కోర్టువారితో మనవి చేయుచున్నాను. ఆ యిల్లు రౌడీలు జూదమాడు నిల్లు. నళినీ! లోనికి దీసికొనిపోయి నిన్నేమి చేసెను?

నళి:—బలవంత పెట్టెను. నే నొప్పుకోలేదు. నన్ను
చేతులతో గొట్టి నాచేతులు కాళ్ళు బిగించి
పట్టుకొనెను. నేను తన్నుకొంటిని.

ప్రా:—అయ్యో! ఈ సాక్ష్యమైపోయినది.

ఆ రాత్రి శివధానికి సీతవద్దనుండి యుత్తరము వచ్చెను.

"పూజనీయులైన భర్తగారికి—మదరాసు.

మీరు రాలేదు. వదినె నాయెడల గొంతసేపు సుభావముగా నుండును. కొంతసేపు దయగా నుండును. మీ ప్రసంగము వచ్చినచో దిరస్కార భావమును వహించును. మీరు రాకపోయినచో నేనే కాకినాడ బయలుదేరి వత్తును. నా యొంటిలో సరిగా లేదు.

—మీ భార్య సీత"

ఆ యుత్తరము చూచి యవధానికి భయము వేసెను. సీత విమలవద్ద నుండుటయే మంచిది. ఇచ్చటికి వచ్చినచో దన తల్లితో నెట్లు పొసగును? తన తల్లి తన తండ్రి బ్రతికియున్నప్పటి తల్లికాదు. ఆమె పూర్తిగా మారిపోయెను. గర్భిణియై వివాహము కాని పిల్ల, యందులో దన యన్నగారి

కూతురు, తన యింటిలో వచ్చియుండె ననగా నామె యింటిలోని కాపురము తీసికొని పోయి వీధిలో బెట్టెను. ఆమె మదరాసు పట్టాకిమిడులతో సంబంధము లేని జీవనము గడుపుచున్నది గాన నింత మాత్రము నడచుచుండెను. అతడు సీతకు మరల నుత్తరము వ్రాసెను. ఒక రెండు నెలలలో దన వ్యవహారమంతయు బహిష్కార మగుననియు, నీ రెండు నెలలోపిక పట్టుకొనుమనియు, సీత కంత భయముగా నున్నచో వెంటనే సివిలు మారేజి చేసికొందు ననియు, మఱి కొన్నాళ్లు తన వివాహము రహస్యముగా నుండుటయే తప్ప దనకు వేఱే సంగతి యక్కరలేదనియు. మూడవనాటికి సీత వద్దనుండి మరల నుత్తరము వచ్చెను. "ఈ లౌకికమైన వివాహముతో నామెకు సంబంధము లేదు. లోకము కొఱకవధాని యట్లు చేసికొనినచో దన యభ్యాంతరము లేదు. తనకు గావలసినది తనభర్త తనవద్ద నుండుట, ప్రస్తుతము దానికిగూడ వీలులేనిచో దాను వచ్చి కాకినాడలో వేఱేయింటిలో నుండును. బంధువుల యిండ్లలో నుండుట తానున్న స్థితిలో దనకు ప్రాణాంతకముగా నుండెను. తాను వచ్చి కాకినాడలో నుండుటకు నవధాని యొప్పుకొనవల

యును. భర్తను వదలి తానుండలేదు. తన స్థితి యొకసారి మేరుశిఖరమునకు బోయి కాలుజారి క్రిందపడుచున్న ట్లుండెను."

అవధాని యీ యుత్తరమునకు వెంటనే సమాధానము వ్రాయలేదు. మఱునాడు తపాలులో ననకొక యుత్తరము వచ్చెను. దానిమీద బొంబాయి ముద్ర వేసియుండెను. అతని గుండెలో గుబుక్కు మనెను. కదలుచున్న వ్రేళ్లతో నా యుత్తరమును జించిచూచెను. అది నెల్లీవ్రాసిన యుత్తరము. ఆమె బొంబాయిలో దిగి నాల్గు దినములైనది. పది పదునేను దినములలో గాకినాడకు వచ్చును. పెద్ద బంగళా యొకటి మాట్లాడి సోఫాలు, కుర్చీలు, తెరలు, టీ కప్పులు, సాసర్లు, సర్వము సిద్ధపఱచి యుండవలయు నని వ్రాసెను. తాను గాకినాడకు జేరు దినమున వ్రాయుదు ననియు నాటికి రైలుస్టేషనుకు రావలయుననియు వ్రాసెను. తాను హిందూదేశమునకు వచ్చుటకు వ్యయపడిన రెండువేల రూపాయలు తన కిప్పుడు చేతిలో వాడుకొనుటకు మఱి మైనువందలు వెంటనే పంపించవలయు నని యుండెను. అవధాని యుత్తరమును బల్లమీద విడచి పడకకుర్చీలో

వ్రాలిపోయెను. అనుకొన్నంతయు నైనది. తన కేమో యింత దెబ్బ తగులు నని యెరింగినది తొలగ లేదు. దీనికి దన జేయు ప్రతిక్రియావిధానము లేదే! ఏమి చేయవలయును? ఇది యాలోచన మెడమిచ్చుటకుగూడ వీలు లేకుండనున్నది. వెంటనే డబ్బు పంపించకపోయినచో నేమి మునుగునో? ఆమె వ్యవహారమునకు సిద్ధముయియే వచ్చి యుండును. తనకు వచ్చిన నెలజీతము మున్నె వ్యయమయి యుండెను. ఇక నెల సగము గడచిన గాని మరల రాదు. తాను సీతకు బాపించినది దమ్మిడీలేదు. ఇంత డబ్బు ఖర్చెట్లయ్యెను? ఈ రెండేండ్లుగా దాను నిలువచేసినదిలేదు. తన పొలములమీద శిస్తుకూడ సరిగా వసూలగుటలేదు. రయితులు తెచ్చియిచ్చినంత. వారి దయాధర్మ భిక్షముగా నున్నది. రయితుల కడనుండి సొమ్ము వసూలగుట యింత కష్టమా? గురుమూర్తిగారిని జూచి తా ననుమానపడెను. అవధాని గురుమూర్తి గారికి తంతివార్త నిచ్చెను. వెంటనే బయలుదేరి రావలయు నని. ఈ లోపుగా నతని కేమియు పాలు పోలేదు. ఊరిలో రామారావుగా రున్నారు. నిజ ముగా దానింత బాగుపడుటకు రామారావుగారు

చెప్పిన యింగ్లీషే యాధారము. తా నీ రెండేండ్ల నుండి యాయనను పోయి చూడనే లేదు. నేడు సాయంతనము పోయి చూడరాదా? కాదు, గురుమూర్తిగారు వచ్చిన తరువాత నొక్కసారిగా చూడవచ్చును. మరునాటికి గురుమూర్తిగారు రాలేను. మూడవరోజునను రాలేదు. మరల జవాబునకు డబ్బుకట్టి యుంకొక తంతివార్త పంపెను. మదరాసునుండి వైద్యపరీక్షయై యప్పడి కేసులోని వస్త్రములు తిరిగి వచ్చెను. అందలి విషయములనుబట్టి యప్పడియందు దోషము స్థిరపడెను. ఆ వస్త్రములు శుక్లశోణితసుక్కబిందుదూషితములై యుండెనని వైద్యశాఖాధికారి దస్కతుతో నుండెను.

అవధానికి కారణము లేకుండ నందరమీద గోపము వచ్చెను. తల్లికి దనకు సంబంధము లేక పోయినను రెండునెల లామె నేమియు ననలేదు. నాడు భోజనము ముందు దల్లిమీద గక్కసించుకొని వివేకానందుని, శాంతమ్మను, గురుమూర్తిని దిట్టెను. తన గదిలో గూర్చుండి నెల్లి బొంబాయిలో నేదైన వ్యాధిగ్రస్తురాలై పోయిన బాగుండు ననుకొనెను. చివర కేమియు సంబంధము లేని లలి

తనుగూర్చికూడ దిట్టుకొనెను. విమలయు సీతయు నిద్రకే చివరకు వదలబడినది. అంతలో నవధాని కోపము వృథాగా నప్పుడిమీఁదికి దిరిగెను. తన జీవితమంతయు వాని సంపర్కముచేత గలుషితమై పోయినది. వాడొక పెద్ద దయ్యమువలె దన్ను బట్టుకొనినాడు. ఈ నీచకులజునితో, నీ పరమ పశువుతో దనకేల సంబంధము? చివరకు వాని కేసు తాను విచారింపవలసి వచ్చెను. పులినిఁజూచి నక్క వాతపెట్టుకొన్నట్లు తా నొక దుస్సమయములో దన రహస్యము వానికి జెప్పగా దనవలెనే తానుగూడ జేసెనా? తా నా దుష్టునివలె దన్ను బెండ్లియాడు మని వచ్చినకాంతను మానభంగము చేయలేదే! ఈ కుష్టుని చరిత్ర తన దివ్యప్రవర్తనకు దుర్వ్యాఖ్యానమువలె నున్నది. స్థూలముగా జూచి నచో మూఢులకు, పామరులకు దమ యిద్దరి ప్రవర్తనల మధ్య భేదమున్నట్లు కనుపించదు. తనకు సీత యెట్టిదో వానికి నళిని యట్టిదా? వానిని దప్పకుండ శిక్షింపవలయును. వాడు మరల దనకు గనబడకుండ జేయవలయును. తానేమో వానికి గాపుదల యని వాని యుద్దేశము కావలయును. వెధవను గ్రుంగదీసి గోతిలో బెట్టవలయును. మఱి

నాటికిగూడ గురుమూర్తిగారు రాలేదు. ఆ నాటి కవధాని కోపము పశ్చాత్తాపముగా మారెను. "అప్పుడికి శిక్ష విధించినచో విశ్వాసఘాతుకముగా నుండును. కేసులో బలములేదు. గంగాధరరావుగారు సాక్ష్యముల దిరిగి విచారించుటలో వారి సాక్ష్యములను వ్యర్థపఱచును. ఒక్క మద్రాసు వైద్యశాఖవారి నివేదికమీద శిక్ష యాధారపడి యుండవలయును. దానినైనను గంగాధరరావు ప్రత్యాఖ్యానము చేయవచ్చును. పాపము, వానికేల శిక్ష విధింపవలయును? వాడు తనకంటె నేమి తప్పు చేసెను? తానేమి శిక్ష యనుభవించుచుండెను? కులమర్యాద వెనుక, నధికారము వెనుక, ధనము వెనుక, తన తప్పు తప్పుగా లేదు. తప్పుగా పరిణమించలేదు. వాని కివి యేవియు లేవు గనుక వాని తప్పు తప్పుగా కోర్టు కెక్కెను."

మరల నింకొక యూహ. తాను దన చేసిన తప్పునకు శిక్ష ననుభవించుచునే యుండెను. విమల మాటాడకపోవుట. ఆమె కోపము దన్ను కారవాగ్నిలో వేల్చుచుండెను. తన ప్రాణముల ప్రాణమైన సీతతో నెడబాసి యుండుటకన్న శిక్ష వేఱే యేమి యుండును? పూర్వజన్మలలో జేసిన

పాపము వెంటబడి వచ్చినట్లు నెల్లి యొక తెలియును కొని వచ్చెను. తనశిక్ష కవధి లేకుండెను. తనవలె బరదేశములందు బరీక్ష నిచ్చి వచ్చినవారు సర్వ సుఖము లనుభవించుచున్నారు. తన స్థితి యిట్లున్నది. తాను గారాగృహమునం దున్నచో నింత కన్న నెక్కువ మనఃకష్ట మనుభవించునా? వట్టి శరీరమును గట్టివేయుట యేపాటిది? చేసిన దోష మునకు శిక్ష యనుభవించి తీరవలయును. తన శిక్ష తా ననుభవించుచుండెను. అప్పడు చేసిన దుష్కార్యమునకు వాడును ననుభవింపవలయును. అప్పని దాను శిక్షించినచో వానిమీద దనకు గోపము లేదు. ద్వేషము లేదు. వాని శిక్షలో దన శిక్ష కూడ నిమిడియున్నది. శరీరములు భిన్నములుగా నున్నను నిద్దరి జీవితప్రవాహములు నేకముఖముగా బ్రవహించుచున్నవి. వాడు తనవలె దన్ను బెండ్లి చేసికొనవలయునన్న స్త్రీని దనయంత లోతుగా బ్రేమించలేనిచో, వానికి దనకున్న విద్యా సంస్కారము లేదు. తన కున్న యనుభవము లేదు. తనవలె వాడుకూడ ధనవంతుడైనచో వా డింగ్లండు పోలేడా? తా నిచ్చిన పరీక్ష నీయలేడా? తాను చేసిన దుష్కార్యము గోపనము చేసికొనలేడా?

చదువున్న చో దనవలె హృదయదఘ్నమైన సుఖాను భూతి పొందలేడా? వాని దోషము తనది. వానిని శిక్షించుట తన్ను శిక్షించుకొనుట. అయ్యో! మఱి కారాగృహములో వా డుండునే! తాను తీవిగా నుద్యోగము చేసికొనుచుండునే! మనస్సుచేత శిక్షా సామ్య మెంత తెచ్చుకొనినను భిన్నాధికారములు గల శరీరముల విడితన మనుభవవిషయమున వేఱే చేయుచున్నది. ఏమి సామ్యవాదము? ఈ సామ్య వాదమున కందని చిత్త సంస్కార భిన్నదేహాదిక ములు తన్ను వెక్కిరించుచున్న ట్లుండెను. కాదీనాడు తాను దన యుద్యోగము వదలి తాను దోషము చేసినట్లు న్యాయాధికారులకు వశుడగును. ఫిర్యాది సీత కావలయును. సీత తనమీాద ఫిర్యాదు చేయదు. మఱి తన శిక్ష యేమికావలయును? సీత చదువు కొన్నది. సత్కులమందు బుట్టినది. మతి సంస్కా రము గల గృహములో బెరిగినది. మర్యాద, యాదర్శగుణములు, భావమధురిమ తాండవించిన సంఘతరగతిలో బుట్టుటవలన దన దోషము దోషము కాకుండ బోయెను. సీతకు దనయందు బ్రేమయేగాని యసూయ లేకపోయెను. అందుచే దన శరీరమునకు శిక్ష తప్పెను. తన యాత్మకు

జరుగుచున్న శిక్షలో గొఱత యన్నది లేదు. అప్పుడికి నాత్మలో నింత శిక్ష జరుగుచుండుటలేదు. ఈ శిక్ష యతని శరీరమునకు జరుగవలయును. ఇం దన్యాయ మే మున్నది? సంఘములో దా నాత్మస్థానీయుడు. అప్పడు శరీరస్థానీయుడు. తమ రిద్దరేయే స్థానములకు జెందుచున్నారో శిక్ష యాయాస్థానములకు జెందుచుండెను. అప్పని మనస్సులో నావేదన లేదా? తనకున్నయంత యీవేదన లేదేమో! ఉన్న దేమో! అప్పనితోబోయి మాటాడవలయును. తాను మాటాడరాదు. అభియోగపు దీర్పు జరిగినతరువాత మాటాడినచో మాటాడ వచ్చును. అప్పుడు మాటాడి యేమి ప్రయోజనము? ఇప్పుడును బ్రయోజనములేదు. అప్పడికి శిక్ష వేసి తీరవలయును. వేసి వానితో జెప్పవలయును. "ఈ శిక్ష మన యిద్దరిదిరా యప్పా, నా బదులు నీ వనుభవించి రమ్ము. నాయందు నీ కా మాత్రము స్నేహము లేదా" యని.

ఆనాటి రాత్రికి గురుమూర్తిగారు వచ్చెను. అవధాని మేడమీదినుండి దిగివచ్చి గురుమూర్తిగారిని కౌగిలించుకొనవలయు ననుకొనెను. కాని యాయన నను జూచినతోడనే యతని యుత్సాహ మంతయు

నీరసించిపోయెను. ఈ రెండేండ్లలో నాయన మనిసి సగమయ్యెను. ఆయన మొగములో బూర్వపు కీవియు, నిద్రాతనమును లేవు. ఆయన యొక కుర్చీలో జదికిలబడెను.

అవ:—అట్లున్నా రేమి?

గురు:—నా కీ రెండేండ్లుగా జబ్బుగానేయున్నది.

అవ:—నాకు దెలియనేలేదే. ఉత్తరమైనను వ్రాసినారు కారు.

గురు:—మీ వద్దనుండి నా కేమియు జాబు లేకుండ నేనెట్లు వ్రాయుదును? మీరు పెద్ద యుద్యోగస్థులు. నేను పేదవాడను.

అవ:—ఏమి జబ్బు! ఏ డాక్టరుకైన చూపించ లేదా?

గురు:—డాక్టరులకు డబ్బు కావలయును. నా దగ్గర లేదు.

అవ:—మీకు పథ్యమా?

గురు:—నేను రాత్రులందు భోజనము చేయుట లేదు.

అవ:—గోధుమరొట్టెయు బాలును దెప్పింతును.

గురు:—మీకు నావలన శ్రమ యగునేమో! వట్టి పాలు చాలును.

అవ:—బాబూ ! నన్ను మీరు, మీరు అనుట
యెందుకు? పూర్వము లేని మర్యాద
యిప్పు డెందుకు?

గురుమూర్తి మాటాడలేదు. ఆ రాత్రి చల్ల గాలి వచ్చునని గురుమూర్తిని మేడపై గదిలో బరుండబెట్టి యవధాని తాను గ్రింద బరుండెను. పరున్న గంటసేపైన తరువాత నవధాని మఱల మేడమీదికి బోయి "బాబూ! జేబులో డబ్బు తల క్రింద బెట్టుకొనలేదుకదా! జేబులోనసే యున్నదా? ఎంతయున్నది" యనెను. గురుమూర్తి యవధాని వంక నివ్వెఱపోయి చూచెను.

అవ:—కాదు బాబూ! నా చిన్నపుడు నీ జేబులో
నున్న డబ్బులో గొంచెమే కాజేసితిని. ఇప్పు
డంతయు గాజేయువలయునని యున్నది—

గురుమూర్తి కీ మాట లర్థము కాలేదు. అవ ధాని గురుమూర్తి జేబు వెదకెను. పదిఅణాలన్నర మాత్రమే యుండెను. అవధాని యందులో నేబది రూపాయలు వేసెను. వేసి గురుమూర్తితలక్రింద బెట్టెను. గురుమూర్తి కా మిగిలిన రాత్రి యొక స్వప్నఖండ మయ్యెను. అంత చిక్కియుండియు నంత యాపదలో నుండియు నతనిలోని వివేక మను

వస్తువు మొక్కవోనిదై సంపూర్ణముగా నుండెను. అవధాని యేదో కష్టములో నున్నాడు. అతనికి బశ్చాత్తాపము ప్రళయముగా ముంచుకొని వచ్చుచుండెను. సోమశంకరముగారు కొడుకును దన కప్పజెప్పి పోయెను. ఈ నడుమ నతనిమీద గొంత కోపము కలిగినమాట నిజమే. తన పది యెకరముల పొలము తాను వివాదపెట్టినచో నవధాని కెట్లు చెందెడిది? తానే చేతులార నిచ్చెను. దానిని గుఱించి తన కతనిమీద గోపమెందుకు? తన దారిద్ర్యమున కత డేమి హేతువు? తన గొంతులో ప్రాణమున్నంతవఱకు సోమశంకరముగారికి దనయందున్న విశ్వాసమునకు బదులు తీర్చును.

మఱునాడు ప్రొద్దుననే యవధాని పట్టణములో నున్న పెద్ద పలుకుబడి గల డాక్టరునకు గబురంపించెను. గురుమూర్తిగారు వారము దినములలో మంచి యారోగ్యవంతుడు కావలయును. నతాడు నాల్గురోజులలో మొగమున క్రొత్తకాంతి రావలయును. అవధాని తొందరచూచి డాక్టరుకు నవ్వు వచ్చెను. కాని యవధాని యుద్యోగగౌరవము ఆ నవ్వును రానీయలేదు. అత డమితశ్రద్ధతో జూచి మందిచ్చెను. పండ్లరసము ప్రధానముగా

నీయవలయు ననెను. ఆహారము తక్కువగుటయే వ్యాధి. వారము దినములలో గురుమూర్తిగారు లేచి తిరుగ నారంభించిరి. ఆరోగ్యవంతుని వలె గనిపించిరి. ఒకసేవకు నాయన కోసము ప్రత్యేకముగా నవధాని నియమించెను. ఆ యింటిలో నాయన భోగము రాజభోగముగా నుండెను. ఒక నాటి సాయంతనమున నవధాని గురుమూర్తిగారి చేతికి రిజిస్ట్రాఫీసు ముద్రలు గల యొక స్టాంపు నిచ్చెను. గురుమూర్తి చూచుకొనెను. తన పది యెకరముల పొలము మరల దనపేర వ్రాసియుండెను.

గురు:—ఇది నాకెందుకు ?

అవ:—బాబూ! మీరొక కుక్కవానిని పెంచుకొనుడు. బరంపురములోని రెండిండ్లును నీ పదియెకరములును వాని కిండు. ఆ కృతఘ్నుడైన యల్లు డేల తినవలయును ?

గురు:—నీవు నాకు బిడ్డవంటివాడవు. నీవు తినవచ్చును.

అవ:—మీరు వదలినప్పటినుండియు నా పొలము మీద నాకు శిస్తే వసూలగుటలేదు. నే

నేమి చేయగలుగుదును? నేను మీ కింకను నాటువందలరూపాయ లియ్యవలయును.

గురు:—నేను నిన్నుగూర్చి యీ రెండేండ్లలో బది పదకొండుసార్లు దుష్టముగా నూహించినాను. క్షమింపుము.

అవ:—బాబూ! మంచిపని చేసినావు. దుష్టముగా నూహించుటచే మీ యెడ నేను జేసిన దోషమునకు శిక్ష జరిగినది. దాని కది చెల్లిపోయెను. మీ యాస్తి నేను గాజేసితి నన్నదోషమును లేకుండ జేసితిని గదా! ఇంక దీనికి శిక్ష లేదు" అని వెడలిపోయెను.

ఆ మఱుదినమున నప్పడి కేసు విచారణ దినము. కోర్టులో మఱల జనులు వేనవేలు మూగియుండిరి. మొదటిసాక్షి సలీము బోనులో నిలుచుండెను. గంగాధరరావుగారు వానిని మాఱుపరీక్ష చేయుచుండిరి.

గంగా:—నీవు సినిమాకొటకే వెళ్లితినంటివి. డబ్బు లేకుండ వెళ్లితివా?

సలీ:—ఆ గేటుదగ్గర నిలుచుండువాడు నాకు స్నేహితుడు. వాడు నన్ను లోనికి బో నిచ్చెను.

గంగా:—అప్పుడు తీసికొని వెళ్లలేదు.

సలీ:—లేదు.

గంగా:—అప్పుడు నీకు రూపాయి యిచ్చెనుగదా! బండి బాడుగ యంత యగునా?

సలీ:—బాడిబాడుగ బేడయే బాబు! తక్కిన డబ్బు అతని పావమఖది గోపి కిచ్చివేసితిని.

గంగా:—నీవిచ్చితివా? అత డిమ్మన్నాడా?

సలీ:—అతడే యిమ్మన్నాడు.

గంగా:—ఆ సందులో నెవ్వరును మర్యాదస్థులు లేరన్నావు. అందరును దొంగలా?

సలీ:—కాదండి. ఉద్యోగస్థులు లేరు. అందరును పని చేసికొని బ్రతికెడు వారు.

గంగా:—వారిలో మర్యాదస్థులు లేరా? అందులో బదిమంది గౌరవించు మనిసి యనుచు లేడా?

సలీ:—ఎందుకు లేరండి? ఆ సందులో కాళయ్య యున్నాడు. ఏ తగాదా వచ్చినను నాయనే తీర్పు చెప్పును. ఆయన దేవునివంటివాడు.

గంగా:—ఆ యిల్లు తాళము వేసియుండె నంటివి. మఱి యప్పుడు లోని కెట్లు పోయెను?

సలీ:—నాకు దరువాత తెలిసినది. ఆ యింటి

వాండ్రు పిఠాపురములో నుందురు. ఇత డిద్దెకు దీసికొనెను.

గంగా:—ఆయింటిలో జూదమాడగా నీ వెప్పు డైన జూచితివా?

సలీ:—చూడ లేదు!

గంగా:—నీ వింక బోవచ్చును.

రెండవసాక్షి రామాశావు బో నెక్కెను.

గంగా:—మీరు బ్రాహ్మణులు. రంగయ్య కాపు. మీ కిద్దరికి మొగమెఱుక యెట్టిది? అతడు డబ్బు పెట్టుబడిదారు. మీ కేమైన నప్పు పెట్టెనా?

రామా:—చిత్తము.

గంగా:—ఎంత ?

రామా:—ఐదు వేలు.

గంగా:—మీ కేమాత్ర మా స్తియున్నది?

రామా:—ఈ యూరిలో నొక్క యిల్లున్నది. అంతే.

గంగా:—అది యెంతవెల జేయును?

రామా:—అయిదారు వేలకన్న నెక్కువచేయదు.

గంగా:—ఇన్నిమధ్య తన డబ్బిమ్మని రంగయ్య బలవంతపెట్టెనా?

రామా:—పెట్టెను. నా యిల్లు వ్రాసియిమ్మనెను. నేను వేఱె యింకొక మార్గమున తీర్చెదను. ఇంకొక యేడాది యాగుమంటిని.

గంగా:—మీ రింక బోవచ్చును.

తరువాత నళినిని బోనులో నెక్కను.

గంగా:—ఊరకే డబ్బుకోసము మీ యింటికి వచ్చు నల్లరివారితో గలసి మీతండ్రి రమ్మనె నని చెప్పగా నీవు నమ్మితివా?

నళిని:—నమ్మలేదు. ఏమో యనుకొని వెళ్లితిని.

గంగా:—అదివర కెప్పుడైన నప్పుడు నిన్ను సినీ మాకు తీసికొని వెళ్లెనా?

నళిని:—వెళ్లలేదు.

గంగా:—మీయింటిలో నతనికి రానుపోను ఇష్టము వచ్చినట్లుండను దగినంత చనవు వున్నదా?

నళిని:—(ఆలోచించి) లేదు.

గంగా:—నీ తండ్రి సినిమావద్ద లేనపుడు నీవు వెంటనే యేల తిరిగి యింటికి బోలేదు?

నళిని:—సినిమా చూడవలెనని యాశగా నుండెను.

గంగా:—ఆశ సరే, తండ్రి రమ్మన్నాడు. అక్కడ లేడు. నీకు టిక్కెట్టెవరు కొనిరి?

నళిని:—అప్పుడే కొనెను.

గంగా:—అతడు నీతండ్రివద్ద యాచించుటకు వచ్చును. అతని డబ్బుతో సినిమాకు బోవుట నీ కమర్యాద కాదా?

దానికి సమాధానము లేదు.

గంగా:—నీ వెఱుగని సందులోనికి బండిపోయి నపుడు బండి యెందుకు దిగితివి? బండివానిని నీ వెఱిగియున్నప్పుడు బండిని మీ యింటికి దీసికొని పొమ్మనకపోతివా?

సమాధానము లేదు.

గంగా:—అతని స్నేహితుని తల్లి లోపల నున్నది. అతడు మాట్లాడివచ్చును. నీ వెందుకు బోయితివి? నీ కతనితో నెక్కువ స్నేహము లేకుండ నతని స్నేహితుని తల్లిని జూచుటకు బోయితివా?

నళిని:—అతడు చెప్పినమాట నమ్మితిని.

గంగా:—అత డింతే చెప్పెను. నీ వతనియందు మచ్చికతో వెడలితివి.

ప. ప్రా:—ఆ మచ్చిక యన్న మాటకు నే నభ్యంతర పెట్టుచున్నాను.

గంగా:—మచ్చిక యన్నచో స్నేహము, అలవాటు, తప్పు లేదు. ఇంకొక మాట మీరు చెప్పుడు.

ప. ప్రా:—ఇంటికి వచ్చుచు బోవుచుండువాడు కదా యని విశ్వసించెను.

నళిని:—అవును.

గంగా:—ఆ విశ్వాసమున కైనను గొంత చనవు, నభిమాన ముండవలయును.

ప్రా:—అక్కరలేదు.

గంగా:—సరే, ఆయిల్లు పెంకుటిల్లో? డాబా? వీధి లోనికి కిటికీలున్నవా?

ప్రా:—కిటికీలు మూయవచ్చును.

గంగా:—పెంకుటిల్లా, డాబా?

ప్రా:—ఈ ప్రశ్న యనవసరము.

జడ్జి:—ఏ యిల్లయిన నేమి?

గంగా:—డాబాయైనచో లోని యేడుపు నల్లరియు బయటికి వినిపించదు. పెంకుటిల్లయినచో వినిపించును.

జడ్జి:—పెంకుటిల్లా? డాబా?

నళిని:—పెంకుటిల్లే.

గంగా:—వీధిలోనికి కిటికీ లున్నవా?

నళిని:—ఉన్నవికాని మూసియున్నవి.

గంగా:—మూసియున్నను గొంత ధ్వని వీధిలోనికి వినిపించుచుండును.

ప్రా:—అప్పుడు వీధి నిర్జనముగా నుండెను.

గంగా:—సినిమా యిప్పుడే వదలిపెట్టిరి. జనము వచ్చుచు బోవుచునే యుందురు. నళినీ! నిన్నతడు బలవంతము చేయవచ్చినప్పుడు నీ వతనితో పెనగులాడితివా? కేకలు వేసి తివా

నళిని:—కేకలు వేయలేను. పెనగులాడితిని.

గంగా:—అప్పుడు మంచి బలశాలి. నిన్ను ద్రోహము చేయుట కచ్చటికి దీసికొనిపోయెను. అత నితో పెనగులాడి గెలువవలయు ననుకొం టివా?

సమాధానము లేదు.

గంగా:—నీవు బయటకు వచ్చినంతనే రామారావు గారు కనిపించెను. ఆయనతో సర్వవిష యము నా సందర్భములో నెవరైనను చెప్పుదురు. నీ వేల చెప్పలేను.

నళిని:—నాకు భయము వేసినది.

గంగా:—ఆయన నీ యింటికి వచ్చుచు బోవుచుం డెడివాడే. నీ వాయనను బాగుగా నెరుగు దువు కదా!

నళిని:—ఎఱుగుదును.

గంగా:—మఱి మీ నాయన యీ రోజు పొరుగూరికి పోయెను. మఱునాటికి పట్నకు రానని చెప్పి పోయెను. ఆ సమయము చూచుకొని యప్ప డిట్లు ద్రోహము చేసెను.

నళిని:—అవు నవును.

ప్రాసిక్యూటరు మొగములో గత్తి వేసిన నెత్తురు లేదు. అతడు లేచి 'ఆయన ప్రొద్దు గ్రుంకువేళకే తిరిగివత్తు నని చెప్పిపోయె'న నెను.

నళిని:—కాదు, మఱునాటికే వత్తునన్నాడు.

ప్రాసిక్యూటరు ఛీ యని కేకవేసెను.

గంగా:—అప్పుడు మీయంత డబ్బు కలవాడు కాదు గదా! మీ తండ్రి నిన్నతని కేల యిత్తు ననెను?

ప్రా:—ఈప్రశ్న యడుగరాదు?

గంగా:—ఆమెను సమాధానము చెప్పనిండు.

నళిని:—నాకు దెలియదు.

గంగా:—ఏమి తెలియదు? తండ్రి నిన్నతని కీయనున్నాడని తెలియదా? అట్టి యూహకు హేతువు తెలియదా?

నళిని:—ఆయన మొదట నిత్తునన్నాడు, తరువాత నీయ నన్నాడు.

గంగా:—అప్పుడు చేసికొందు ననెనా?

నళిని:—అతనికి వేఱే పిల్లమీద యాశ యుండెను. ఉప్పుపేటి వంతెన యవతల తో నున్న యింటి యతని కూతురు సీతను జేసికొనవలయునని యతని కుండెను.

గంగా:—అందుచేత నిన్ను జేసికో నన్నాడు. నీ వింత యాస్తితో వచ్చుచుండగా నొక పేదపిల్ల మీద ప్రేమచేత నిన్ను వలద నెనా?

అవధాని యీ మాటమీద నూహింప నారంభించెను. అప్పుడు తనకన్న బుద్ధిమంతుడు. సీతమీద నతని కొంత ప్రేమయుండెనో? అతని యందు దోషము లేదు. ఒకవేళ వ్యామోహములో బడెనేమో! కామోద్రేకములో మనిషి పొరపాటు పడవచ్చును. తాను నెల్లీ విషయములో బడలేదా? అప్పనిలో నొక్కటియే దోషము. తాను సీత నెరుగ నప్పుడు నెల్లీ విషయమున వ్యామోహము పొందెను. అప్పుడు సీతను ప్రేమించిన తరువాత నళిని విషయములో వ్యామోహము పొందెను.

గంగా:—నీవు ఆ సాయంకాలము తండ్రి రమ్మనె ననగా నున్నదాన వున్నట్లు పోతివా, అలంకరించుకొని పోయితివా?

నళిని:—(ఆగి) అలంకరించుకొనియే పోతిని.

గంగా:—అప్పుడు నీ నగ లేమైనను లాగుకొనెనా?

నళిని:—అట్లు చేయలేదు.

గంగా:—ఊరకే నీవు పెండ్లి చేసికొనుమంటివి. అత డొప్పుకొనలేదు.

నళిని:—అంతే.

గంగా:—అతనిని పెండ్లిచేసికొమ్మని నీవు బలవంత పెట్టితివా? అతడు బలవంత పెట్టెనా?

నళిని—నేనే యడిగితిని.

గంగాధరరావు చువ్వవంటి మనిషి. అతని మొగములో దీక్షత్వము, ప్రశ్రయాయోగ్యత్వము నొక్కసారిగా గనిపించును. ఆ కోర్టులోనున్న తక్కిన న్యాయవాదులకన్న నాయనకు తెలుగు నుడికార మెక్కువ తెలియును. తెలుగులో నింటిలో మాటాడుకొన్నట్లు వాడుకభాష చక్కగా దూచి యే మాటమీద నెంత బరువుంచవలయునో యుంచి మాటాడును. సాక్షి కన్నులలో జూచుచుండగా జూచువారికి నేదో యేకాంతము మాటాడుచున్నట్లుండును. అతడు చమత్కారముగా నవ్వి పసిపిల్లను లాలించినట్లుగా 'మఱి నీవే బలవంతము చేసి

తివి. మఱి యతనిమీద బెట్టుకుచేమి? చీ చీ తప్పు
గదా!'

నక్కిని యీ మాటలు వినినతోడనే యది కోర్టని
మఱచిపోయెను. ఎవరో తన పితృస్థానీయులు తన్ను
చీవాట్లు పెట్టుచున్నా రనుకొనెను. అనుకొని
వెంటనే "కాదు బాబూ! అతడు నన్నేందుకు చేసి
కొనరాదు?" అనెను.

కోర్టులో నున్న జన మందఱు పగటి గుడ్లగూబ
కూత వినిన యడవిలోని కాకిపింఛువలె నిశ్శబ్ద
ముగా నుండిరి. వెంటనే గంగాధరరావున కొక
చిరాకు కలిగెను. చీ చీ, నేను న్యాయవిరుద్ధమైన
పని చేయుచుంటి ననిపించెను. అట్టి యమాయకు
రాలి హృదయము నూరకే బయట పెట్టితి" నను
కొని వెంటనే కూర్చుండెను.

అప్పటికి జడ్జిగారి విశ్రాంతి సమయము వచ్చెను.
విశ్రాంతి సమయములో నందరును కేసు పోయిన
దనగా బోయిన దనిరి. అప్పుడు మనస్సులో మిగుల
సంతోషించుచుండెను. అవధాని తనయెడ నున్న
పాక్షికభావము వదలి పోవుట యసంభవ మను
కొనెను. ఈ కేసులో దాను శిక్షపడకుండ బయట
పడినచో నూ రొకవైపు ముట్టింతు ననుకొనెను.

రంగయ్య కూతును చాటుగా దీసికొనిపోయి తిట్ట వలసినన్ని తిట్టెను. "చెడిపోయినదానవు. నిన్నింక నెవరు చేసికొందురు? ఈ దశ నీ మొగమున నే వ్రాసియున్నది. వట్టి చమురుకాళ్ళ ముండవు" అని తిట్టగా దిట్టగా నేడ్చుచున్న నళిని యిట్లనెను. 'నీవు కేసు పెట్టనిచో నాకు బెండ్లియాస యుండెడిది. నేను తప్పుసాక్ష్యము చెప్పుటవలన బోలేదు.' ఆ మాటతో రంగయ్య మాటాడకుండ వెడలిపోయెను. తరువాత జడ్జి గంటసేపు తీర్పు వ్రాయుచు గూర్చుండెను. అప్పుడు వచ్చి నిశ్శబ్దమైన సభలో దీర్పిట్లు చదివెను.

'ప్రాసిక్యూషను తరఫు వాదన లన్నియు గంగాధరరావుగారు తమ న్యాయశాస్త్రపాండిత్యముచే ఋజువుగాకుండ చేసిరి. ఫిర్యాది తెచ్చిన డాక్టరు సర్టిఫికెట్టునకు ముద్దాయి తరఫున డాక్టరు రామారా విచ్చిన సాక్ష్యము వ్యతిరేకమై యది వ్యర్థమైనది. మదరాసు ప్రధాన వైద్యశాఖవారి నివేదికమాత్రము నిలచియున్నది. ఉన్న సాక్ష్యములో బలవత్తమమైన దది. దాని నెవ్వరును బ్రతిఘటింపజాలరు. అప్పని పూర్వచరిత్ర సుప్రసిద్ధమైనది. అతడు చిన్నప్పటినుండియు జేబుదొంగ. దానిని

తానుగూడ నెరుగును. ప్రతిదోషమునకు శిక్ష యుండవలయును. అందుచేత నేనతనికి రెండు సంవత్సరములు చెరసాల విధించుచున్నాను.'

పల్లెకు ప్రాసిక్యూటరు మొగము వెన్నెలంత యయ్యెను. గంగాధరరావుగారు కనుబొమలు ముడుచుకొని జడ్జివంక సూదులవలె చూచెను. అప్పని మొగములో గోర్గు సంతయు మ్రింగివేయవలె నన్నంత కోపము తోచెను. అతడు నోరెత్తి యేదియో యనబోవుచుండగా ప్రక్కనున్న రక్షకభటుడు మోచేతితో పొడిచెను. సళిని మొగమున నాశ్చర్యము, దుఃఖము, తన యందు దనకు ద్వేషము కనిపించెను. ఆమె తన వంక క్రోధముగా జూచుచున్న యప్పనివంక దీనముగా బతిమాలుచున్నట్లు చూచెను. రంగయ్య తన కసితీరినట్లు చూచుచుండెను. న్యాయాధిపతి మొగములో నే భావములేదు. ఒక కోటి పర్వతములు శిరస్సున మోసికొనుచు పోవుచు దద్భారము తొలగనీని పాసితలమునకు లొంగిపోయిన మహాబలశాలివలె గనిపించెను.

ఆరాత్రి యవధాని తానొక్కడు నూరకే శూన్యహృదయముతో శవమువలె బండుకొనెను. రాత్రి పండ్రెండు గంట లయ్యెను. అప్పు డతడు

మోటారుకారువానిని లేపి మోటారు సబ్‌జైలు నకు బట్టించెను. రక్షకభటుఁడు తుపాకి భుజమున నిడుకొని యటునిటు దిరుగుచుండెను.

"ఎవరు వారు?"

"నేను. జడ్జిని."

అవ:—ఖైదీ భద్రముగా నున్నాడా?

ర. భ:—చిత్తము.

అవ:—నే నతనితో మాటాడవలయును.

రక్షకభటుఁడు కారాగృహాధికారి వద్దకు బోయి తాళపుచెవి తెచ్చెను. అవధాని తానుగూడ జెయిలోనికి బోయి బయట మఱల తాళము వేయు మనెను. అప్పుడవధానిని జూచినంతనే కోపము, తలుపు దీయించునప్పు డాలోచన, యతడు లోనికి వచ్చి బయట తాళము వేయించినప్పుడు నివ్వెఱ పాటు పొందెను. అవధాని గంటసేపువఱకు రక్షక భటు నచ్చటికి రావలదనెను. అవధాని చెఱలో దన దుస్తులు తీసి సామాన్యుడైన ఖైదీవలె గూర్చుండి నేలవంక జూచుచుండెను. అప్పుడు దిగ్భ్రాంతి ద్రిప్పుకొని,

అప్ప:—జడ్జిగారుగూడ నిట్లు వచ్చిరేమి?

అవ:—జడ్జిగారుకూడ నీవు చేసిన తప్పే చేసిరి.

అప్పు:—వారి నెవరు శిక్షింతురు?

అవ:—వారిని వారే శిక్షించుకొనుచున్నారు.

అప్పు:—ఇది యొక మాట. ఒక గంట సేపు. రెండేండ్లు కాదుగదా! నాకు గోపము వచ్చినచో మీకు భయమేమి?

అవ:—నీ భయముచేత రాలేదు. దైవభయము చేత వచ్చితిని. నాశిక్ష నే నిదివరకే యనుభవించితిని. ఇంకను ననుభవింతును. కాని నే నిట్టి శిక్ష కొంతసేపైనను బొందుటకు వచ్చితిని.

అప్పు:—మీరు చేసినపాపము నన్ను శిక్షించుట. ఆ పాప మిట్లు తీరదు.

అవ:—ఆ పాపము వేఱే విధముగా దీర్చుకొందును. నీవు తిరిగి వచ్చువఱకు నీ సీత నీకై యవివాహితగా నుండునట్లు చేయుదును. ఆమె నే లోపము లేకుండ జూతును. నళిని నీకై మఱొక భార్యగా నుండునట్లును, రంగయ్య మీ వివాహామునకు సమ్మతించునట్లును జేయుదును. నీవు చెఱనుంచి వచ్చిన తరువాత నెలనెలకు నాజీతమునుండి నేను

బ్రతికి యున్నన్ని దినములు వందరూపాయ లిత్తును.

అప్పు:—నా కేమియు నర్థమగుటలేదు.

అవ:—అప్పుడూ! నీవు నేను గలసి దొంగలము. నా తీర్పులో నొకమాట యున్నది. సరిగా విన్నావో లేదో. "ఇతడు చిన్నప్పుడు జేబు దొంగ. దానిని తానుగూడ నెరుగుమును," అని. దాని యర్థమేమి?

అప్పు:—మీరుకూడ జేబుదొంగ లన్నమాట.

అవ:—ఇప్పుడు నీ వనుభవించు శిక్ష నీ యొక్క నిదే కాదు. నాది కూడను. అసలు నీకు శిక్షయే లేదు. నీమీద కేసు నిలువదు. నిలువలేదు. నేను నీకు శిక్ష విధించితిని. అనగా నాకు నేను శిక్ష విధించుకొన్నాను. నీవు నా బదులు పోయిరమ్ము.

అప్పు:—నేను మీ బదులెందుకు పోయిరావలెను?

అవ:—నేను నీకు దొరను. నీవు నాకు సేవకుడవు. నాది మనస్సు. నీది శరీరము. మనస్సు ద్వారా నే నెంతో యనుభవించితిని. అనుభవింతును. నీలో నా శరీరమున్నది. నా శరీరభావ మున్నది. నీకు నేను జెప్ప

మాటలు తెలియవు. నా యందు నీకు
బూర్వమున్న గౌరవ మున్నచో మాటాడ
కుండ నీ శిక్ష యనుభవించి రమ్ము.

అప్పుడు పకాలున నవ్వెను. అవధాని దయ్యము పట్టిన వానివలె లేచి నిలుచుండి అప్పని రెండు భుజములు చేతులతో బట్టుకొని "శిక్ష యనుభవించునది నీవుకాదు. నేను" అని యొక వికారపు చూపు చూచెను. అప్ప డతని మొగము చూచి భయపడెను. తాను దాను గాదనుకొనెను. అయిదు నిమిషము లిద్దరు మాటాడలేదు. గంటస్తంభ మంతనే రక్షకభటుడు వచ్చి తలుపు తీసెను. అవధాని వెనుదిరిగి చూడకుండ బయటకు వచ్చి వెడలిపోవుచుండెను. చెఱలో నుంచినప్పటినుండియు దివారాత్రములు తలుపుచువ్వలు పట్టుకొని నిలుచుండెడి యప్పడు గదిలో నిద్రపోవుచుండెను. రక్షకభటున కాశ్చర్యము వేసెను. కారాగృహాధికారి యప్పుడు చనిపోయెనేమో యని యనుమానము పొందెను. జడ్జి లోనికి వచ్చియేమి చేసెనో? రేపు ప్రొద్దుటికిఖైదీ సరిగా నుండనిచో బాధ్యత యెవరిది? అత డప్పుడూ అని పిలచెను. అప్పుడు 'అప్ప డిచ్చట లేదు. అప్పుడు వెడలిపోయినాడు. అప్పడి

మీాద కేసు రుజువు కాలేదనెను. కారాగృహాధి కారియు, రక్షకభటుడు నిద్దరును పకాపక నవ్వు కొనిరి.

మఱునాడు అప్పని రాజమహేంద్రవరము తీసి కొని పోయిరి. అవధాని రైలుసెడలు వేళకు దాను గూడ ప్లాటుఫారముమీాదికి బోయెను. అతడు ప్లాటు ఫారముమీాద నుండెనని యప్ప డెరుగును. కాని యీ యిద్దరి కన్నులు కలియలేదు. రెండోడ్లవఱకు గలియరాదని యిద్దరకు దెలిసిన ట్లుండెను.

ఇంటికి దిరిగి వచ్చిన తరువాత గురుమూర్తిగా రవధానిని జూచెను. నాల్గు దినములనుండి యవ ధాని అవధానిగా లేడు. ఏదో యాలోచన, ఏదో పర ధ్యానము, ఏదో విషాదము. ఈ తిరిగి వచ్చిన యవ ధాని తాను చిన్నప్పుడు చూచిన యవధాని. ఆ యుత్సాహము, ఆ నవ్వు, ఆ కన్నులలో నెవ్వరిని లెక్కచేయకపోవుట- గురుమూర్తికి విస్పష్టముగా గాన్పించెను.

అవధాని 'బాబా! నిన్ను బాబా యని యెందుకు బిలుచుచుంటినో తెలియునా? నిన్ను నేను నా బాకీక్రింద బది యెకరములు వ్రాయు మన్నప్పుడు నీవు నన్ను 'నాయనా' యని పిలచితివి.

నీ యాస్తి నీ కిచ్చివేసితిని. అందుచేత బాబూ యని పిలచితిని. నాడు నీకు నేను లోకువనైతిని. ఇప్పుడు నీవు నాకు లోకువ మైనావు' అనెను.

గురుమూర్తి రెండు నిముషము లదే చూపుగా నవధానిని జూచి తరువాత విరుగబడి నవ్వెను. గురుమూర్తి కిప్పు డాశ్చర్యము చక్కగా నుండెను. ఎంత నవ్వినా నతని యాసను రాలేదు. దగ్గు రాలేదు.

గురు:—నీవు నన్ను లోకువ చేసికొనుటకు నా చేత నేదో పని చేయింతువు.

అవ:—బాబూ! నీ వివేకము తెలిసికొనుటకు నా కిరువది యేండ్లు పట్టినది.

గురు:—ఆ పని యేదో చెప్పుము.

అవ:—నేను ఇంగ్లండులో నెల్లి యను పాశ్చాత్య స్త్రీని వివాహమాడితిని. వివాహమాడి నందుకు జాల పశ్చాత్తాపపడితిని. ఆమె యిప్పుడు వచ్చి బొంబాయిలో గూర్చు న్నది. వచ్చి నా నెత్తిమీద నుండుదు నను చున్నది. నీవును రామారావుగారును బోయి దాని నాత్రోవ నన్నెల్లి వెనుకకు బంపించ వలయును. నాకున్న యాస్తిపాస్తుల వివరము

లన్నియు గాగితముల దాఖలాగా నామెకు జూపింపుము. ఆమె యెంత కావలె ననినచో నంతయు నిచ్చివేసి పంపించుము. ఆ స్త్రీయంతయు బోయినను నాకు దిగులులేదు. నా జీతముమీద, నా బ్రతుకుమీద, దానినీడ పడగూడదను. అది యున్నదని, యిట్టి పని నేను జేసితినని విమల కే మాత్రమును దెలియరాదు. నేను బూర్వము నీయందెంత ద్రోహము చేసినను నే నిట్టి యున్నత స్థితిలో నుండుట నీ కానంద మగునా? కాదా?

గురు:—ఆనందమని యడుగవలయునా?

అవ:—ఆనందమైనచో నీ సంగతి విమలకు దెలియనీయకుము. తెలిసినచో నామెకు నామీద గల ప్రేమయో శుక్లపాడ్యమినాటి చంద్రుని యంత వంకర వచ్చినను నేను బ్రతుకలేను. నీ వీ రెండు పనులను జేసి పెట్టెదవా? లేదా? చెప్పుము.

గురు:—నీ యా స్త్రీయంతయు నా చెల్లిని వెనుకకు బంపించుటకు బట్టినచో నా పదియొకర

ములు నీవు తీసికొందువని వాగ్దానము
చేసినచో నొప్పుకొందును.

అవ:—(కన్నీళ్లు కార్చుచు) బాబూ! నాకిప్పుడెంత జీతము వచ్చుచున్నది? ఇంక ముందెంత వచ్చును? సాలునకు నీ పది యెకరముల మీద వచ్చు నాదాయము నా యొక్క నెల జీతమునకు సరిరాదు. నీవొక్క కుఱ్ఱవానిని బెంచుకొనుము. వానికి నేను చదువు చెప్పింతును. నీవు నా చదువుకు డబ్బు పంపించి నన్ను బెద్దవానిని జేసితివి. నీ దత్తపుత్రునకు నేను మరల నింతయు జేసెదను.

గురుమూర్తి మాటాడలేదు. ఇద్దరు నెవరి యాలోచనలు వారే చేసికొనుచుండిరి. చివరి కొకరితో నొకరు మాటాడకుండ బోయి పండుకొనిరి.

గ్రీష్మము పోయి యానాడే వర్షర్తువు ప్రారంభమైనట్లుండెను. ఆషాఢ శుద్ధ ప్రతిపత్తు. గ్రీష్మము సగమే వెళ్లెను. కాని పూర్తిగా వెడలిపోయినట్లాషాఢమేఘము వానకురిసెను. ఆ కురిసిన వాన యొక వైపున నెండ గాయుచుండగా నొక వైపున వానకురిసెను. నల్లని మేఘము తెల్లని

యెదఁబొమ్ము గల సుందరాంగి వామపయోధ రాగ్రమున వెడలైన నల్లని పుట్టుమచ్చవలె బ్రకాశించెను. వానధార లెండలో దళతళ లాడి మేఘమునుండి వెండిత్రాళ్లు వ్రేలాడుచున్నట్లు, తెల్లని కింజల్కములు క్రిందికి వ్రేలాడగా క్రిందికి వాల్చి పట్టుకొన్న నల్లకలువవలె నా మేఘములు ప్రకాశించెను. తప తప కొట్టిన వాన జల్లునకు భూమి క్రొత్త పెండ్లికూతురువలె సువాసనలు వెడలగ్రక్కెను. విరహిణివలె వేడి నిట్టూర్పులు విడచెను. తొలిమాసములలోని గర్భిణిస్త్రీవలె నోకిలించుకొనెను. దొడ్డిలో విచ్చిన యరటి మొవ్వాకు విడిసినంతమేర నల్లగా, విరియక చుట్టలు చుట్టుకొన్నమేర తెల్లగా నున్నట్లు మింటసగమావరించిన యెండల, ఆకరటితోటల కాంతిబాహుళ్యము చేత భిన్నవృక్షము లేర్పరచుకొనరాక యల్లుకొనిపోయిన ట్లుండెను. ఒకవైపున నెండ, యొకవైపున మొగిలు, తాపములో జల్లదనము, చల్లదనములో దాపము- మృగశిర రోహిణిపైకి సవతివలె గ్రమ్ముకొని వచ్చినను నా సవతి రాగమై చేతులతో బుగ్గలుపొడిచిన ట్లుండెను. ఎండ కొండి నాల్క గీసుకొనుటకు బనికిరాని పందిరిమీద

తాటియాకులు మృగశిర వానలకు పసిపిల్లలవలె జప్పటులు కొట్టెను. ఒకగోడమీద గురిసిన వాన నుండి వచ్చిన సన్నని మంటితావి యొక యా లేగ దూడ తోకయెత్తుకొని పై పండ్లవరుస కనిపించు నట్లు పెదవి నెత్తి ప్రియాసంయోగసమయ వృషభరాజువలె మూజూచెను. జనము వాన కురి యుట, తడిసిపోదు మని భయపడుట, మఱచిపోయి యా చల్లని వానకు దడియుటకే సమ్మతించిరి. పరిహరణీయమో, పరిగ్రహణీయమో యెరుగరాని నూత్నవస్తువిషయమునం దనాలోచనాబుద్ధులవలె జనులు వానలో దడియుటకే సమ్మతించిరి.

మఱునాడు గురుమూర్తి రామారావులు బొంబాయి పోయిరి. సీతవద్దనుండి మరల నుత్తరము వచ్చెను. "మీరు నన్ను వచ్చి చూడుడు. నన్ను గుర్తుపట్టలేరు. నాకు సాయంకాలములందు సన్నగా జ్వరము వచ్చుచున్నది. ఇప్పుడు వదినెకు నా మీద నిరాదరణ లేదు. శారద నాకు సర్వోపచారములు చేయుచున్నది. ఈ యుత్తర మందిన వెంటనే బయలుదేరి రానిచో— ఇట్లు సీత."

అవధాని యుత్తరము చేతబుచ్చుకొని యుత్తరీయముకూడ లేకుండ నడచి పోవుచుండెను.

దాటిలో నిద్దరు ముగ్గురు నమస్కారము చేసిరి. అతను వారివంకనే చూడలేదు. ఎదురుగా వచ్చుచు గంగాధరరావుగారు కనంబడెను. అవధాని 'దోషమునకు శిక్షపడి తీరును. అప్పుడు వెడలి పోయెను గదా' యనెను. న్యాయవాదికి నవధాని యన్న మాట లసందర్భముగా గనిపించెను.

గంగా:—ఉత్తరీయము లేదు, కోటులేదు. ఎచ్చటికి బోవుచున్నారు.

అవ:—నే మదరాసు పోవుచున్నాను.

గంగా:—ఇప్పుడు రైలు లేదుకదా!

అవధానికి తన స్థితి తనకు దెల్పిసెను. విషాదముతో గూడిన యొక నవ్వుతో చమత్కారము చేసినట్లు నటించెను. మఱల నింటికి బోయెను. నాల్గు దినములు సెలవుపెట్టి యా సాయంతనము మెయిలుకే మదరాసు ప్రయాణమై పోయెను. మఱునాటి ప్రొద్దున నేడున్నర గంటలకు విమలయొక్క వాకిట నిలుచుండెను. లోనికి బోవుటయా? విమల యతనిని జూచెను. చూచి నిశ్చలముగా నిలుచుండి యింటి లోనికి బోయి కాళ్లు కడిగికొనుటకు నీళ్లు తెచ్చెను.

తాను వట్టి చుట్టమా? అన్నగారుకూడ గాదా? తన్నారాధించు భక్తుడుకూడ గాదా?

సీతయు శారదయు వచ్చిరి. సీత యవధాని మీాద బోయి పడెను. కౌగిలించుకొనెను. ఓపిక లేక యతని పాదములమీాద జారిపోయిన యతని ప్రాణ మనిన వస్త్రమువలె గూలబడెను. అత డామెను జేతులతో నెత్తికొనెను. లోనికి దీసికొని పోయెను. విమల మాటాడకుండ బ్రక్కనే నిలుచుండెను. అవధాని "విమలా! నేను తప్పుచేసితిని. ఒకతప్పుకాదు. రెండుతప్పులు చేసితిని. ఒక తప్పునకు బశ్చాత్తాప పడితిని. రెండవ తప్పునకు శిక్షించుకొంటిని. ఇంగ్లండులో నొక పాశ్చాత్త్య స్త్రీని వివాహమాడితిని. ఈ తప్పునకు నా పశ్చాత్తాపము నా యాస్తియంతయు దానికి వదలి పెట్టుట. రెండవతప్పు సీతను వివాహమాడ నుద్దేశించి నను వివాహాత్పూర్వము దానిని నే ననుభవించుట. ఈ తప్పునకు గంటసేపు ఖైదులోనున్నాను. రెన్నెల్లనుండియు యమయాతన పడినాను. నేను చేసిన తప్పు వంటిదే యప్పుడు చేసెను. నా శరీర భావమును వానియందు పెట్టి నన్ను నేను రెండేండ్లు శిక్షించుకొన్నాను. నీ కింకను గోపము పోదా? నీవు నాయందు గోపించినచో బ్రదుకుట నాకు దుర్లభ మగునని నీకు దెలియదా?"

"నీవు నాకు జెల్లెలవు. నీవును నేనును నొక త్రేవు నుండి వచ్చితిమి. ఆ త్రేవులోని సౌకుమార్య భాగము నీవు, పావిత్ర్యభాగము నీవు, సుశిక్షిత భాగము నీవు. అసుకుమారాపవిత్రాశిక్షిత భాగమును నేను. నీవు నన్ను దయగా జూడనిచో నేను వట్టి జంతువను, పశువను, వట్టి యధికారిని, ఉద్యోగాంధుడను; నా కింక ప్రతిక్రియ చేసికొనవలసిన దోషము కనిపించలేదు. చిన్నవాడు గురుమూర్తి గారి జేబులోనుండి డబ్బులు కాజేసితిని. దానికి గూడ బ్రతిక్రియ చేసితిని. ఆయన నా కీయవలసిన డబ్బుక్రింద గట్టుకొన్న యాయన పొలము నాయనకు దిరిగి యిచ్చివేసితిని. ఆయన నొక పిల్లవానిని దత్తత చేయుదును. వానికి నేను జదువు చెప్పించి పెద్దవానిని జేయుదును. విమలా! నీ యుద్దేశములో బుద్ధి తెలిసినప్పుడే పాపము చేయదు రందువా? తెలియనప్పుడు చేసిన పాపములు వెంట రావందువా? అప్పుడు నాతో గలసి చిన్నప్పుడు దుర్మార్గములు చేసెను. మా జీవితములు వేఱుగా నున్నను, మా యదృష్టములు వేఱుగా నున్నను మా పాపములు కలసియే యున్నవి. పాపభావమునందు మా యిద్దరకవినాభావసంబంధ మున్నది. నేను సీతను జేసిన

యన్యాయమే వాడు నళిని యనుదానికి జేసెను. ఈ శిక్షతో నా పాపపుసంకెలలను ద్రుంచితిని. మూడు నెలలనుండి నీ శాంతిమయమైన దయ నెఱుగని నా తపన నే ననుభవించుటకు యోగ్యము కాని శిక్ష నిచ్చెను. అది యేమో, చెల్లెలియం దింత ప్రేమ యెవరికుండును? ఇట్టి గౌరవ మెవరికుండును. ఈ యాదర్శబుద్ధి యెవరికుండును. మన తండ్రి లోభియై నీకు జబ్బుచేసినప్పుడు నీకు మాదైన నిప్పించలేదు. నేను దొంగతనము చేసిన డబ్బుతో నీకు మందిప్పించితిని. నీకు దెలిసికూడ నీవా మందు సేవించితివి. నీయందు నాకున్న గౌరవమా నీ దోషమునకు శిక్ష?"

అతని యీ యుపన్యాసమును జూచి. శారద నివ్వెఱపోయి నిలుచుండెను. సీతకు లేని యోపిక యెచ్చటనుండి వచ్చినదో, నిలుచుండి నిర్ఘాంత పోయెను. విమల యాపాదశిఖము సన్నని కంపము నొందెను. కొంతసేపటి కామె తేరుకొని 'యన్నా! నిన్ను నేను గుర్తెరుగలేకపోతిని. నాయందు నీకు గల గౌరవము లోకసామాన్యముగా నుపయో గించుకొనబోయితిని. నిజముగా నీ కన్న నేనే నీతిమతి నని, శాంతిమతి నని యనుకొని హీనమతి

నై తిని. నీలో నింతటి సంస్కార మెట్లు కల్గినది? నీవు చదివిన చదువులో నిది లేదు. మన తల్లిదండ్రుల రక్తములో నిది లేదు. ఇది యెచ్చటినుండి వచ్చినది? ఓయీ! నీవు పూర్వజన్మలో నెవ్వరవు? నీ ప్రకృతి లో నింత యుద్వేగ మెచ్చటనుండి వచ్చినది ? నెత్తురులో లేని, పెంపకములో లేని, చదువులో లేని యీదివ్యశక్తి యెక్కడిది? ఇది యెచ్చటినుండి నిహితమైనది? ప్రపంచమున సర్వమును గార్యకారణ భావముచే నిబంధితమగుచుండగా గారణము తెలియంగ రాని యీ విచిత్ర సంస్కారము నీ కెచటినుండి వచ్చినది" యనెను.

అవధాని:—నాకు నదే యూహ. నీ వంటి చెల్లెలు, సీతవంటిభార్య నాకు దొరకుటయే యాశ్చర్యముగా నున్నది. నా చదువునకు నా బ్రతుకునకు నా మనస్సునకు బరదేశ ములో గిరవాటు పడి యుండవలయును. ఇది నా దేశములోని మంటిలో లోతులు త్రవ్వ కొను చున్నది.

విమల:—ఓయీ! అదియా కారణము. తెలిసినది. నీవు ప్రబలమైన పరసంప్రదాయములను వెగుల్చుకొని వచ్చు స్వజాతి సంస్కారము

లను జదువుచే, బెంపకముచే, సమావృత పరిస్థితులచే, సర్వముచే, నధఃకరింపబడియు జన్మయందు గూడ దెలియరానిదై, గర్తమునం దెచ్చుటనో దాగియున్న యొక స్వజాతి శక్తి, యూరకే శిలామయమైన యాలయగోపుర కఠినోపలముల నడిమి సున్నములోనుండి పెగుల్చుకొనివచ్చు రావిమొక్కవలె పోట మరించు నిన్నెవడు చంపును? రాళ్లు లెంత దగ్గరగానున్నను, నెడములేకున్నను, నీవు తల చూపనే చూపుదువు. ఒకవేళ గోపురమం తయు నేకశిలావికారముగ జేసినను గాలము వికసించిన యొడలు, వానలు, నా రాతిని జిట్లించి, యందునుండి యీ రావి మొక్కను బుట్టించును. నిన్నెవ్వ డాపగలడు? నిన్నెవ్వరు తెలియగలరు? నాశనములేని చెల్లెలను నేను నీకు.

## జేబుదొంగలు:
### అనుశ్రుతము

తరువాత నేడేండ్లకు మదరాసులో దావాజీ పెండ్లి జరిగెను. • జరిగిన తరువాత నైదవ దినము సాయంకాలమున మోహానరావు నింటి సావ

డిలో నందరును గూర్చుండిరి. మోహనరావు, విమల, తానాజీ, పెండ్లికూతురు రోహిణి, అవధాని, సీత, అవధాని కొడుకు గురుమూర్తి, యాత్రేడ్లవాడు, లలితా శారదలు, వారి భర్తలు, గురుమూర్తిగారి పెంపుడు కొడుకు నలినీకాంతరావు; అప్పుడు నిలుచుండి యెవ్వరేది యడిగినను దెచ్చి యిచ్చుచుండెను. అప్పడెచ్చటి కేగిన నచ్చటికి వానివెంట తిరుగుచు వాని కొడుకైదేండ్లవాడు తిరుగుచుండెను. వాని పేరు రంగయ్య.

మోహనరావు మేనల్లుని గురుమూర్తిని బిలచి రహస్యముగా 'నాయనా! నలినీకాంతరావు జేబులో డబ్బున్నది. పక్క జేబులో బెట్టుకొన్నాడు. నీవు దానిని అన్న చూడకుండ నెమ్మదిగా నెత్తుకొని రమ్మనెను. గురుమూర్తి నెమ్మదిగా దొంగగా నడుచుచు పోవుచుండెను. మోహనరావు చెప్పుటయు కుఱ్ఱవాడు వెళ్లుటయు నవధానియు నప్పుడును జూచుచునే యుండిరి. అవధాని యేమియు ననలేదు. సీత ప్రక్కవాటుగా నన్నగారు చేయించుచున్న పని చూచి గ్రహించి చిఱునగవు నవ్వుచుండెను. ఈ నాటకము విమలయు జూచెను. ఆమె మొగములో కొంచెము కోప ముదయించెను. మోహనరా

వాామెవంక జూచి పండ్లు బిగించుటవలన నామె యూరకుండెను.

గురుమూర్తి డబ్బుతెచ్చి మేనమామ కీయ బోయెను.

మోహన:—బావా! నీ కొడుకు చూచితివా? నలినీకాంతరావు జేబులో డబ్బు కొట్టివేసెను. మఱల నీయంత వాడగును.

అందరును కుఱ్ఱవానివంక జూచిరి. ఈ నాటకము తెలియని యచట గూర్చున్న తక్కినవారి దృష్టులు చిన్న గురుమూర్తి వైపునకు మఱలెను.

నలినీ:— మామా! అది కుఱ్ఱవాడు దొంగిలించుట కాదు. అన్నగారి సొమ్ము వానిదే. నా డబ్బంతయు అవధాని బాబయ్యగారు తెచ్చిపెట్టినదే. వానిసొమ్ము వాడు తీసికొన్నాడు.

మోహన:—మీ తండ్రి గురుమూర్తిగారు నట్లే యనుకొన్నారు. ఇది వంశపరంపరయా వచ్చుచున్నది.

కొందరు నవ్విరి. కొంద రవధానికి కోపము వచ్చునేమో యని భయపడిరి. అందరి మొగములును తలా యొకరీతిగా నున్నను నవధానియు

మోహనరావును నవ్వుచుండిరి. చిన్న గురుమూర్తి మొగము చిన్నబోయెను. మేనత్తభర్త చమత్కారము చేయుచున్నాడని తాను బోయి తీసెను. ఈ యందరి నవ్వులతో నతని మొగము వివర్ణమయ్యెను. సీత కొడుకే చెప్పునేమో యనుకొనెను. అతని ముఖరేఖలు సడలుటకు బదులు బిగిసెను. ఒక నిముసములో నా చమత్కారబలము తగ్గిపోయి యెవరి దారిని వారు మరల యథాస్థితిగ నుండిరి. మఱొక నిముసములో గురుమూర్తి యింటిలోనికి బోయి యొక త్రాడు తెచ్చి యప్పుడి కొడుకు రంగయ్యను బిలచి తన చేతులు జతచేసి కట్టించుకొని తండ్రి వద్దకు వచ్చెను. అందఱి మొగము లందును నొక నివ్వెఱపాటు తోచెను. అతడు తండ్రితో 'నాన్నగారూ! నేను తప్పుచేసితిని. నాకు నేనే యీ శిక్ష వేసికొంటి' ననెను. అవధాని యిదిగూడ మోహనరావే చెప్పిపెట్టెనేమో యని యనుమానపడెను. కాని మోహనరావు మొగములో గత్తివేసిన నెత్తురు చుక్కలేదు. అవధాని వెంటనే గ్రహించెను. ఈ పని చేయువా రింటిలో మఱియొకరు లేరు. గురుమూర్తి స్వబుద్ధిచేతనే యట్లుచేసెను. ఆయన మొగములో నొక విచిత్రమైన యానందము తాండవించెను.

మోహన:—నాయనా! ఇట్లు రా. నిన్నిట్లు కట్టు కొమ్మని చెప్పితినా?

గురు:—పో మామా! నీతో మాట్లాడను. నీవే నా చేత దప్పుచేయించితివి—అని యేడ్వ నారంభించెను.

అప్పడి కొడుకు రంగయ్య దీనవదనుడై గురుమూర్తి దగ్గరకువచ్చి 'చిన్న బాబయ్యగారూ! నిన్ను నేను కట్టివేసితిని. నాచేత గట్టించుకొన్నావు' అని యా కట్టు నూడదీసి తనచేతులకు గట్టుకొనెను.

మోహనరావు దిగ్భ్రాంతి పొందెను. సీతావధానులు విమలామోహనరావులు నలుగురి మొగములందు విశ్వరూపము చూచిన ధృతరాష్ట్రుడు, అర్జునుడు, గాంధారి మొగముల వలె జెప్పరాని మానుషాతీతమై మానుషసంభవమైన దీప్తులు కలిగెను. అప్పడి మొగములో గొడుకునందో తనయందు దనకో కృతజ్ఞతా భావమే గోచరించెను. ఈ సన్నివేశము చూచిన తక్కిన యందరు నేమియు నర్థముకాక చకితులై చిత్రగతప్రతిమలవలె నిలచిపోయిరి. అంతలో నప్పడి భార్య లిద్దరు సీతానలినులువచ్చి తొంగి చూచి చేతులు త్రాటితో గట్టుకొని నిలుచున్న కొడుకు నిద్దరు చెరియొక చేయి

పట్టుకొని ముద్దు, కోపము, ప్రేమ, తాండవించు చున్న కన్నులతో వెడలిపోవుచుండగా, సీత రంగయ్య నెత్తుకొనిపోయెను.

విమల:—ఎప్పుడు నంతే. రంగయ్య నలిని కొడు కైనను సీతకు వాడు ఆమెకు గన్న దనకే కొడుకు కనిపించును.

అవధాని యీ మాటయే వినుపించుకొనలేదు. ఇట్లనెను :

"నా కిదే యానందము. నా కొడుకులో నా రక్తము చెడలేదు. అప్పడి కొడుకులో అప్పడి రక్తము చెడలేదు. మే మిద్దరము చిన్నప్పుడు జేబుదొంగలమే. మా యిద్దరి కుమారులును మా వలె జేబుదొంగలేకాదు, మా వలె గలుషములు కడిగి వేసికొనువారు కూడ నైనారు. నాశిక్ష యప్ప డనుభవించినట్లే నా కొడుకు శిక్ష చిన్ని రంగయ్య యనుభవించును. చక్రవర్తులమై తండ్రిరక్తపుదారి తీయకపోవుటకన్న, జేబుదొంగ లమై తండ్రిరక్తపుదారి తీయుట శ్రేష్ఠము. జేబు దొంగయో, బానిసయో, మహారాజో, యెవ్వ డైనను వానిజాతి చావరాదు. ఏవర్ణమున నేజాతిలో నే జంతువున నేగుణమున్నదో, మానవుల కేమి

తెలియును. భగవంతుడే యెఱుగును. ఏ నెత్తురు స్రోవను నెవడును మలగించరాదు. సర్పములను సంపూర్ణనాశనము జేయుదు నని బయలు దేరిన రాజును, సర్వరక్షస్సులను హోమము చేయుదునని బయలుదేరిన ఋషీశ్వరుని సర్వదేవతలును సర్వమునులును వారించిరి. ఈ జగత్తులో మహారాజు తాను నిలుచుట కెంత యవసరమున్నదో బానిస నిలుచుటకు నంతే యవసరమున్నది. ఒక పురుషుడు, ఒక జాతియు స్వతంత్రత సంపాదించి, కొన్ని భావములు పెంపొందించుకొనుటవలన తద్భావగతవ్యామోహము చేత దిక్కెనవాడు కాని, తక్కిన జాతికాని, తన నెత్తురులోని గుణములు చంపుకొన నక్కరలేదు. స్వాతంత్ర్యమో, ధనమో, యధికారమో, దైవాధీనములు, కాల పరిణతములు; కాలము మహానది వంటిది. ఈ నా డిచ్చట కయ్యకోయును. ఈ యిసుకను దీసికొనిపోయి యొక చోట లంకను జేర్చును. ఆ లంక పది పంద్రెండేండ్లు, కాదు, పాతికయేండ్లు లంకగానే యుండును. ఒండుమట్టి పేరుకొని యడుగున నిసుకయైనను బైన నొక యడుగు మందమో, యడుగున్నర మందమో, యొండు ఒండుగా నుండి సర్వ

సస్యము విరియబండవచ్చును. మహాప్రవాహ గతమైన యీ ద్వీపమును శాశ్వతమనుకొని నదికి దూరముగానున్న తక్కువ పండుచున్న పొలము నమ్ముకొని యీ లంకలో మూర్ఖుడుగాని, యిజారా పాడడు. మూర్ఖుడుగాని తన సుస్థిరనివాస మదియే చేసికొనడు. బుద్ధిమంతుడు దానిని తాత్కాలికముగా నుపయోగించుకొనును. అబుద్ధిమంతుడు శాశ్వతమైన తన పొలమును వదలి యేటివఱదల హావ్యమైన యీ లంకపొలము నివాసము చేసికొనును. తన నెత్తురు దారి తాను వదలుకొని పెఱ నెత్తురుదారులకు సంగలార్చుకొనువాడు మొగిలును నమ్మి చెఱువు నీటికి వఱవ తెఱచువాడు. నీ నెత్తురు నీ సంతానములో ప్రతిబింబించనిచో నీ జాతియంతయు నష్టమైనచో నీ జాతిలో నిగూఢములైన దివ్యగుణములు మఱల సృజింపబడుటకు నాత్మపదార్థ మెంత యిక్కట్టు పడవలయును? మఱల నా గుణాభాసము జరుగుటకు నెంత తపస్సు కావలయును? నా తండ్రి భారతీయ గుణములైన న్యాయము, ఓర్పు, వితరణము మొదలైన గుణములు తనలో నింకించుకొని యొక పరభావమునకు దాసుడై పోయెను. నా నెత్తురులో నా మఱుగు

పడిపోయిన భావములను బ్రజ్వలింప జేయుటకు నేను సప్తలోకములలో గుడుసుళ్లు పడిపోయితిని. ఆత్మబలమువలన సర్వదేవతాసన్నిధానప్రసాదముల వలన నా సర్వగుణములు మఱల నాయందు బ్రతిష్ఠితములైనవి. ఇదిగో నా కొడుకు. నేను బ్రతిష్ఠించిన సర్వగుణములకు జయదీపిక.”

సంపూర్ణము.

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి గ్రంథములు.

ఉన్నవి

| | | |
|---|---|---|
| ఏకవీర | (నవల) | 1-14-0 |
| జేబుదొంగలు | ,, | 2-8-0 |
| మాస్వామి | (పద్యకావ్యం) | 0-8-0 |
| శశిదూతం | ,, | 0-8-0 |
| తెలుగు ఋతువులు | ,, | 0-12-0 |

రాసున్నవి (త్వరలో)

శ్రీమద్రామాయణము

(బాల, అయోధ్య కాండలు)

మా బాబు

వేయి పడగలు

హాహా హూహూ

వీర వల్లడు

భోగిమాటలు

ధర్మచక్రము

కథల సంపుటి

చెలియలికట్ట

రసతరంగిణీ గ్రంథ మండలి,

గవర్నరుపేట, బెజవాడ.